


సంపుటం. ౧౭ విక్రమ, మార్గశీర్షము (డిసెంబరు 1940) సంఖ్య. ౧౨

# ద్రౌపది::

నన్నయ, తిక్కన, పోతనలు ఈ పాత్రను పోషించిన రీతులు; త్రివిధ చిత్రణలు

శ్రీ మొదలి వెంకటరామయ్య

## ❋ నన్నయ ❋

"............తన్నును నిన్ను
దనర జూదంబాడి ధార్తరాష్ట్రులకు
ధర్మతనూజుండు దా నోటువడియె
వనజాక్షి! కౌరవవరు డన్న నిన్ను
వడి దోడుకొనిపోవ వచ్చితి నిపుడ
చనుదెమ్మ కౌరవేశ్వరుకడకు..."

అని ప్రాతిగామి వచ్చి ద్రౌపదిని పిలిచాడు. ధర్మరాజు తన సర్వస్వాన్నీ, కడకు ద్రౌపదినీకూడా ఓడిన మాట నిజమే! అందువల్లనే దుర్యోధనుడు "ద్రౌపదిని పిలుచుకొని రమ్మ"ని ప్రాతిగామిని అంత స్వతంత్రంగా పంపగలిగాడు.

ప్రాతిగామిమాటలు యథార్థా లని ద్రౌపది తెలుసుకో లేకపోయింది. తనభర్త అట్టి దురాచారు డగునా యని శంకించి—

"ఏయుగంబునందు నెట్టి దుష్కృతవుండు
భార్య నొడ్డి యోటువడినభర్త
గలడె?.........................."

అంటూ సాశ్చర్యయై—

"మున్న దనోటువడి మరి నన్ను నోటు
వడియెనో! మున్న న న్నోటువడి విభుండు
గ్రన్న దనోటువడియెనో?........."

అనే ధర్మసూక్ష్మాన్ని కనుకొని రమ్మని ప్రాతిగామిని మళ్లీ పంపిందికాని తన నీవిధంగా అవమానాలపాలు చేస్తున్న భర్తలను పల్లెత్తుమాటైనా స్వతంత్రించి అనలేకపోయింది.

తరువాత "అవిరళగళిత నయనోదకబిందుసందోహ పరిపీడ్యమాన పీనస్తన పరిధానాంతర"యై, ప్రాతిగామి పిలుంద సభలోకి వచ్చింది. వెంటనే "ద్రౌపదిని తన వద్దకు తోడ్కొనిరమ్మ"ని దుర్యోధనుడు

"నిర్దయాత్ము, పాపనిరతు దుశ్శాసను
పనుచు నెటెగి..........."

తన కేమి కీడు వాటిల్లుతుందో అనే భయంతో, బెబ్బులిని జూచిన హరిణంలాగా, గాంధారి మాటున కూర్చుంది. సిగ్గొకవంకా, భీతి ఒకవంకా పీడిస్తోంది. సహజంగా ముద్దరాలు. పదిమంది పురుషుల్లో ఒంటరిగానూ, అభిముఖంగానూ నిలువ నేర్చిందిగాదు. ఇట్టి మానసికపరిస్థితుల్లో స్త్రీయే శరణ్య అనేభావం ఆమె మనస్సులో పొడసూపింది. ఆసభలో తన కాశ్రయమిచ్చే స్త్రీ లెవరూ కనిపించలేదు. పూర్వం బాల్యంలో తాను భయపడినప్పుడు పరిగెత్తి తల్లి ఒళ్లో కూచొని భయాన్ని వారించుకొన్నట్లు, ఆమె, గాంధారి వయోవృద్ధగాబట్టి ఆమెయందు మాతృభావ ముంచి, ఆమెయండన జేరింది.

వెంటనే 'కౌరవానుజుడు'
"..........దానిపి
ఉందన పాఱి ఇంక నె
క్కడ కరుగంగబోలు జులు
కం జనుదెమ్మట సౌబలుండు ని
న్నొడిచె.........."

అని డాయరాగా, ఆదుశ్శాసనునికి ఆమె చెప్పిన ప్రత్యుత్తరం వింటే ఆమెస్వభావం తేటతెల్లమౌతుంది. పట్టుకొనడానికి వచ్చేవాడు "నిర్దయాత్ముడు, పాపనిరతుడు" అగు దుశ్శాసనుడు. అట్టివాని చేతుల్లోంచి తప్పించుకోవడానికి 'ముదిత', 'విభీతహరిణాక్షి' అయిన ద్రౌపదికి కించిత్తైనా ప్రౌఢత్వం ఉండ నవసరం లేదూ? లేకపోతే ఆపదనించీ ఎలాతప్పించుకోగలమూ? "రజస్వలను, నన్ను ముట్టకుము. ఏకవస్త్రనై యున్నదానను. గురుబంధుజనాధిష్ఠితంబైన సభ కెట్లురానేర్తు" నని కేవలం కృతయుగంమనిషిలాగా జవాబు చెప్పింది. రజస్వల అయిన స్త్రీ సభలోకి రాగూడదనే విచక్షణా, ఆవిడను తాకకూడదనే జ్ఞానమూ ఆ దుర్మార్గుని కుంటుందా ?

ఈమె మాటలకు దుశ్శాసనుడు మరలిపోయాడా ? "నీ వేకవస్త్రవైననేమి, విగతవస్త్రవైననేమి, నిన్నెట్లుం దోడ్కొని పోదు"నని కేశపాశాలు పట్టుకొని బలాత్కారంగా నిండుసభలోకి లాక్కొని పోయాడు.

లోకంలో రజస్వలయైన స్త్రీదగ్గరికి ఇతరులు పోరు. అలాగే "నేను రజస్వల"నంటే దుశ్శాసనుడు దగ్గరికి రాడని ద్రౌపది అభిప్రాయం. పాపము ! ఆమె దుశ్శాసనుని మూర్ఖత్వాన్నీ, పశుస్వభావాన్నీ గుర్తించలేక పోయింది.

ఈలాగు ద్రౌపది "దుశ్శాసనాకృష్ట"యై "వాతాధూతంబైన పతాకయుంబోలె వికీర్ణకేశయు, వివర్ణవదనయు, కోపలజ్జాపరవశయు"నయి సభకు వచ్చియు, తనకు గలిగిన అవమానానికి ధర్మరాజే కారకుడని తెలుసుకోలేక —

"అనుపమదైవయోగహతుడయ్యునవశ్యముధర్మసంపదం
దనరుదనగాక ధర్మజుడు ధన్యుడధర్మపథంబు దప్పద్రొ
క్కునె?................................"

అని ధర్మరాజును కేవలం అవతారపురుషుణ్ణిగానూ, ఆదర్శప్రాయుణ్ణిగానూ ప్రశంసిస్తూ, దుశ్శాసనుణ్ణిమాత్రం నిందిస్తూ

"...కురువృద్ధులార! ధృశకోపను డీతడు నన్ను నేల దు
ర్గను డిట నీడ్చి తెచ్చె?........................"

అని ప్రశ్నించి వారిముందు వాపోయింది. కాని ఒక్కరూ జవాబిచ్చిన పాపాన పోలేదు. ఎవ్వరూ జవాబు చెప్పకపోయేసరికి ఆమెకు కోపం వచ్చింది. కాని లజ్జచే అది అణగద్రొక్కబడింది. మిక్కిలి ప్రయత్నిస్తేనేగాని ఆకోపం బయటబడదు. బయటబడినా అది క్షణభంగురం. అదత్తప్రతివచనయై—

"................................సర్వధర్మసం
విదు లన నున్న యీభరతవీరులవంశము నేడధర్మ సం
పద నతినింద్య మయ్యె.........................."

నని, మచ్చుకు, నీరసమైన ఒక్కటే నిందావాక్యం పలికి వెంటనే "కృష్ణు దలంచుట"కు మొదలుపెట్టింది. ఆమెకు కోపమే రాదు. ఎలాగో వచ్చింది. కోపోద్రేకంవల్ల సభలోనివారి నేమేమో అనజూచింది గాని లజ్జ తావియ్యలేదు. అందుచేతే తన కోపాన్ని ఒక్కమాటతో బయటపెట్టింది! అంతే!

నిండోలగంలో తన భర్తలకు గల్గిన అవమానానికీ, తనకు గలిగిన అవమానానికీ "దుఃఖితయయి" "స్వయంవరమునా డఖిలభూపతులచే నట్లు చూడబడి" ఈనాడు "పరిభూత నగుచు సభామధ్యమున మహీపతులచే జూడంగబడితి" ననుచు వాపోయింది.

"ధన్యులార! ఏ నదాసినే, దాసినే
ఎఱుంగ జెప్పు" ..................

డంటూ, జీవచ్ఛవాలైన ఆ సభ్యులయెదుట ఇంకనూ నిలిచి న్యాయనిర్ణయాన్ని అర్థిస్తూవుంది. నోరులేని జీవాల్లాంటి ఆ సభ్యులు తనకు న్యాయాన్ని కలుగజేస్తా రనేగాబోలు ఆమెయూహ! ఇంత బేలతనంగా ప్రవర్తించిన ద్రౌపదిని జూస్తే ఆశ్చర్యంగా లేదూ?

ముగ్ధలభావాలు అతి చంచలాలు. ఈ క్షణంలో ఉన్న మనోభావం ఇంకొకక్షణంలో ఉండదు. అమానుషమైన అలాంటి అవమానం కలిగితే, మళ్లీ ప్రాణముండగా, ఆ అవమానం చేసినవాళ్లతో మాట్లాడడానికి మనస్కొప్పుతుందా? కాని ద్రౌపది ఎలా మారిపోయిందో చూడండి?

"సుందరి నాకోడండ్రుర
యం దభ్యర్చితవు నీవ యతిమదమున నీ
కొందగ ప్రియంబుజేసెద..."

అని గోముఖవ్యాఘ్రంలాంటి ధృతరాష్ట్రుడు తియ్యగా కబుర్లు చెప్పగానే "తననింతగా పొగడుతున్నాడుగదా మామగారు" అని ఉబ్బిపోయి, ఆమె కదివరకున్న ఈషణ్మాత్రం కోపంకూడా మాయమయింది. ముఖాన మందస్మితం తాండవించింది. వదనం ప్రసన్నమైంది. మామగారికి తనమీద అనుగ్రహం కలిగిందనీ, ఆయనమాటలు అవశ్యకర్తవ్యాలనీ ఆమె నమ్మింది. వెంటనే రెండువరాలు కోరింది. ధృతరాష్ట్రుడు అవేగాక మూడవ వరాన్నిగూడా కోరమన్నాడు; తన్మూలంగా తన సమభావాన్నీ, దయార్ద్రిత్వాన్నీ, దాతృత్వాన్నీ, వాత్సల్యతనూ వెల్లడించినట్లు నటించాడు.

"సత్క్షత్రియసతికి రెండు
..................
కాన యింక వేడగాదు నాకు"

అని తనవ్యక్తిత్వాన్ని కనపరుస్తూ తనసూక్ష్మగ్రాహిత్వాన్ని బయటపెట్టి మామగారి మన్ననలు పొందుటకు ప్రయత్నించింది ద్రౌపది. "కోడలిగుణంబులకు, ధర్మం బెరుంగుటకు సంతసిం"చాడు ధృతరాష్ట్రుడు, అంతతో జరిగిందంతా మరచింది ద్రౌపది. పరాభవదృశ్యము తాత్కాలికంగా హృదయ ఫలకం మీద చెరిగిపోయింది.

అదే భారతప్రారంభం. పాండవు లప్పుడే ద్రౌపదిని వివాహమ్మాడారు. ద్రౌపదికి యౌవనం వచ్చిందిగాని, బాల్యం ఇంకా వదల్లేదు. అట్టిసమయంలో నన్నయ చిత్రించా డామెను. వయసుకు తగి ఉంది పాత్రపోషణం. కాపురానికి వెళ్లేటప్పుడు "భర్తలను దైవసములుగా జూడు, అత్తమామల నాదరించు" అని తల్లిదండ్రులు చెప్పిన ముక్కలనే ఆధారంగా చూచుకొన్నదిగాని, ప్రాపంచిక విషయాలను యించుకైనా గమనించడానికి ప్రయత్నం చేయలేదు. అందుచేతనే—

"తరుణి! జూదంబున నాలి నోటు
వడనివానిగా తనుభర్త బడయు మింక!"

అని రాధేయు డుల్లసమాడడానికనీ, "తనరమ్య పృథూరుతలంబు నెక్కగా రమ్మని" ధృతరాష్ట్ర సుతాగ్రజుడు "సన్న జేయుట"కునూ తావేర్పడింది.

## ❁ తిక్కన ❁

"ఇదికడుముద్దరాలు ............. ఎంతయుఁగా
మృదువొకకీడుపాటునకు మేకొనజాలదు.........ఒం
టిదిరుగుదాని కోర్వదొక టేనియు దాసవరించు
చొప్పెరుం
గదు.........ఒందులఁగా కొలువగా వెఱవెమ్మెయి
గల్గ నక్కటా!"

అని యుధిష్ఠిరుడు పాంచాలిని చూస్తూ, ఖిన్నాంతఃకరణుడై చెప్పిన ముక్కలు. ఈమాటల మూలంగా ఇంతకుముందంతా నన్నయ్యగారి లేఖినిచేత ముగ్ధగానే చిత్రించబడిం దనే తెలుస్తూవుంది. కారణం సోమయాజిగారి సమర్థనమే! ఇకమీదట సోమయాజి

గారు ద్రౌపదిని ఏమార్గాన్ని నడిపించారో తెలుసుకోవాలి.

ద్రౌపది ప్రౌఢత్వానికి సోమయాజిగారి లేఖిని ప్రథమభిక్ష పెట్టింది. బాల్యం గడిచింది. పాలపొంగు వంటి యౌవనాన్ని అడవుల్లోనే గడిపింది. అత్తవారిల్లంటే యేమిటో శల్యశల్యానా జీర్ణంచేసుకుంది. పతులసన్నిధానంలో పన్నెండేళ్లు సుఖదుఃఖాల్లో సమభాగినిగా సంచరించింది. ఇక ఒక్క సంవత్సరమే మిగిలింది. అది అజ్ఞాతవాసం. ఆసంవత్సరాన్ని తన తెలివితేటలచేతనే గడపాలిగాని, ఇతరుల సహాయ మపేక్షించడానికి వీలులేదు. ఇక్కడే విషమ పరీక్ష. ఇంతటితో తాను ఇదివరకు వేసుకొన్న అమాయకత్వపు బురకాను దూరంగా గిరవాటేసి 'ప్రౌఢాత్వ'పు బురకా తగిలించుకోవాలి. తిక్కన్నగారు ఆమెకు సాయమైనారు. సమయానుకూలంగా ఆమె వేషాన్ని మార్చారు. భావిజీవితాన్ని గడపడానికి యోగ్యురాలినిగా తయారుచేశారు. ఆమెనోటినుండీ వెలువడే ప్రత్యక్షరాన్నీ బహుగంభీరభావంగలదాన్నిగా చూపించారు.

తన ముందుకార్యక్రమాన్నంతా వెల్లడించింది ద్రౌపది. "భూరమణుదేవి గారవమున బిలువనంపితే"నే గాని అంతఃపురంలోకి పోనని చెప్పింది. సాధారణ పరిచారికలకూ తనకూ ఉండే అఖండభేదాన్ని ఒక్క ముక్కలో వెలిబుచ్చింది. అంతే కాదు.

"............మా
లినినాజని సాధ్వియిది మలీమసవృత్తం
బుల పోవ దెన్నడు
నను వేకదనంబు దోచునట్లు..."

చరిస్తానని చెప్పింది. అసలే రాజులకొలువు కత్తిమీది సాము. దానికిదోడు అంతఃపురనివాసం. ఇక ప్రమాదాలకు కొదవేముంటుంది? ఇట్టి పరిస్థితుల్లో, "సాధ్వియిది, మలీమసవృత్తంబులపొంత బోవదు" అనే పేరు రావాలంటే ఎంత జాగ్రత్తగా సంచరించాలి! ఈ మాటల్లోనే ఆమెచాకచక్య మంతా యిమిడిఉంది. "మనుపాంచాలికి ననుచారిణినై...యామె పంచిన... గురువంపు పనులు జేయుదు" నని పూర్వం తన కెంత గౌరవ మీయబడుతూవుండిందో తెలుపుతూ, తన కట్టి గౌరవమే యీకొలువులోనూ యిస్తేనేకాని సేవ జేయ నని వ్యంగ్యంగా తెలిపింది. దానికి ఇంతగౌరవ మెవరిస్తారు? ఆమె రాజపుత్రి కాబట్టి ఆ పలుకు లామెకు తగియున్నాయి.

సోమయాజిగారు ఆమె స్వభావాన్ని ఎంత ఆశ్చర్యకరంగా మార్చారో చూడండి! ప్రపంచజ్ఞానం లేని ద్రౌపదిని రాజాంతఃపురాల్లో వర్తించడానికి యోగ్యురాలినిగా తయారుచేశారు.

విరాటమహిషి దగ్గర జేరింది. నడురూ బెదురూ లేకుండా "ఏను పురుషపంచకసనాథనై యుండుదు... ......"అంటూ తన నిజవృత్తాంతాన్నే చెప్పుకున్నదిగాని, దూరాలోచన ఎవ్వరూ చెయ్యలేదు. "నీచము లయ్యెడు పనులకు నాచాలమి యెరిగి" నన్ను గౌరవంగా చూడమని సగర్వంగా అడిగింది. "నీ రూపము జూచి మానృపతి యువ్విళ్లూరు నేమో!" అని విరాటపత్ని సందేహించింది. తనభర్తగుట్టు బయట పెట్టుకొంది. కాని ద్రౌపది ఒక్కచిరునవ్వు నవ్వింది. "పాపము! ఇంత మహారాణి అయిఉండీకూడా ఆమె యింత అజ్ఞానురాలు కావడానికి కారణమేమో?" అని ద్రౌపదికి ఆమెమీద జాలికలిగి "నాదు పతులు గంధర్వులు, నీచమతి నన్నెవ్వడుసూచిన, వాని నారాత్రియే తెగటార్పజూతు" రని ధైర్యంగా చెప్పింది. ఈ ముక్కల మూలంగా కీచకవధకు బీజారోపణచేసింది.

కీచకుడు ద్రౌపదిని చూచాడు. మనస్సు వికలమైంది అతనికి. చాలా ప్రయత్నించాడు. చివరకు "ద్రౌపదియున్న యెడ...... అరుదెంచు" తరుణం చూచి ఆమెతో సంభాషణ కుపక్రమించాడు. నిమిషంలో పాంచాలి వాని హృద్గతభావాన్ని గ్రహించింది. అతడు రాజుకు మరది; రాణిగారి తమ్ముడు. తాను అంతఃపురదాసి. అందువల్ల అతనితో ఎలా మాట్లాడినా ప్రమాదమే! కాబట్టి మొదట లౌక్యంగా "వినియు విననిభావించి" నిర్వికారయై ఉండింది. అంతతో పోక, కీచకుడు మరీ మొండికిబడి "తనయభిలాష తేటపడ" పలికాడు. ద్రౌపదిమనస్సు చివుక్కు-

మన్నది. ఇక మాట్లాడకుంటే లాభంలేదనుకొని "పరిభవవికారంబు తోపకుండ తన్ను దాన ఉపశమించుకొని" "చనునె యిమ్మాటలాడ సజ్జనులకు, ఆడుపుట్టువులతోడ నీవును పుట్టలేదా?" అని అడిగింది. అభిమానమున్న మనిషికి ఆ ఒక్కమాటే చాలు! "మనిషికొకమాట! గొడ్డుకొకదెబ్బ!" అన్నారు పెద్దలు. ఆ మాటతో కీచకుడు ఆత్మహత్య చేసుకొని చావవలసిందే! "నీకు అక్కలూ, చెల్లెండ్లూ లేరా? పరాయి ఆడవాళ్లతో ఇలా మాట్లాడడానికి నీకు మతిలేదా?" అని చీవాట్లు తిని ఇక మనుష్యుడు జీవించగలడా? అతడు రాజు; తిట్టినమనిషి దాసి. కాని కీచకుడికి ఒంట్లో చీమూ, నెత్తురూ చచ్చిపోయింది. స్త్రీ లభిస్తే చాలు అతనికి; ఎన్నితిట్లయినా భరిస్తాడు. అలాంటి దురాత్ముడు కీచకుడు.

అంతటితో విరమించగూడదూ? "మదోన్మాదంబున తన్ను నెదిరి నెరుగక" ఇంకా ఏమో ప్రేలడం మొదలుపెట్టాడు. పరిస్థితులు విషమించే సూచనలు కనిపించాయి. ఇక వాణ్ణి వదిలించుకోకుంటే మానభంగం తప్పేలాగు లేదు. ఇంతవరకూ మనస్సులో అణచుకొన్న క్రోధాగ్ని ఒక్కమారు ప్రజ్వలించింది ద్రౌపదికి. వాడు నీచుడు కాబట్టి "జంకించినగాని పో" దని స్థిరీకరించుకొని—

"దుర్వారోద్యమ బాహువిక్రమరసా
స్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథన వి
ద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిద్దరిను దో
ర్లీలన్ వెసన్ ద్రుంచి గం
ధర్వుల్ మానము ప్రాణముల్ గొనుట త
థ్యం బిమ్మెయిన్ కీచకా!"

అంటూ భయభ్రాంతుణ్ణిగా చేసి "అందనిమ్రాకుల పండ్లు కోయదలచుట హితమే! మును చెడిన రావణాదుల వినియెరుగవె? ...వివేకవిహీనా!" అని ముఖం వాచేలాగా తిట్టి, ఇక ఒక్కక్షణం ఉంటే నీ మానప్రాణాలు దక్కవని రూక్షంగా పలికింది. దానితో కీచకునిగుండె నీరయింది. దమ్మిడీఅంత ముఖం చేసుకొని అక్కదగ్గరికి పోయాడు.

· అబ్బా! ద్రౌపది ఎంతమారింది! పాపాత్ముడైన దుశ్శాసనుణ్ణి వదల్చుకోవడానికి "నేను రజస్వలను... తాకకు!" అని చెప్పిన నన్నయద్రౌపదికీ, దురాత్ముడగు కీచకుణ్ణి వదల్చుకోడానికి "నాతో మాట్లాడితే నీడొక్క చీరేస్తా! ప్రాణంమీద ఆశ ఉంటే దూరంగా పో!" అన్న తిక్కనద్రౌపదికీ ఎంత అంతరముంది! పరిస్థితులు రెండూ ఒకటే! కాని పాత్రల స్వభావాలు మారిపోయాయి. తిక్కనగారి ద్రౌపది కడకు అన్నంత పనీ చేసింది. కాని నన్నయగారి ద్రౌపది ఎక్కడో ఉన్న దేవుణ్ణి తలుచుకుంటూ కూచుంది.

మదిర తేవడానికి ద్రౌపది కీచకుని యింటికి వెళ్లింది. కీచకుడామె నేమేమో అంటూ ఆమెవెంటబడ్డాడు. తప్పించుకొని ఆమె విరాటసభలోకి వచ్చి రక్షించమని మొఱబెట్టుకుంది. ఆమె సభలోకి రావడం ధర్మరాజు కిష్టంలేదు. వెళ్లిపొమ్మని చెప్పాలి. ప్రకాశంగా చెప్పితే తమగుట్టు బయటబడుతుంది. అందుచేత శాంతవచనాలతో "సతికి సభలలో నిలచి ధిక్కరింపదగదు. పలుపోకల బోవుచు నాట్యంబు సూపుచాడ్పున......కులసతుల గరువచందంబు దోలగగ నునికి" పాడిగాదు. సభలోనుంచి వెళ్లమన్నాడు. ద్రౌపదికి మహాకోపం వచ్చింది. భర్త అయి ఉండి తన పరాభవాన్ని కళ్లారా చూస్తూ, దానికి ప్రతీకారం చేయకపోవడం అలాఉంచి, పైపెచ్చు తననే మందలిస్తూవుంటే ఆమెకు అసహ్యం అయింది.

"నాదువల్లభుండు నటుడింత నిక్కంబు
పెద్దవారియట్ల పిన్నవారు
కాన పతులవిధమ గాకయే శైలూషి
గాననంగరాదు............"

"నాకు నాట్యంబు పరిచితంబు మత్పతి శైలూషుండు గాడు కితవుండునుం గావున జూదరియాలికి గరువతనం బెక్కడిది" అంటూ తన కసినంతా వెళ్లగక్కింది. "మీరు చేతగానివారవడంచేత నేను సభలోకి రాగలిగాను. మీకు శక్తి ఉంటే భార్యకు జరిగిన పరాభవానికి ప్రతీకారం చేయకకూర్చుంటారేమి?"

అనే గంభీరధ్వని ఉంది ఆమాటల్లో. మర్మచ్ఛిదాలైన ఆమాటలు బల్లెపుపోట్లలాగా ధర్మరాజుహృదయాన్ని దూసుకుపోయాయి.

తన పరాభవానికి ప్రతీకారం చేయడానికి భీమునికి దప్ప యితరులకు చేతగాదనే విషయాన్ని ద్రౌపది సమగ్రంగా గ్రహించింది. ప్రచ్ఛన్నంగా భీమునిదగ్గరికి పోయింది.తన అశ్రువులను చూచి రక్త ముడికేది భీముని కొక్కడికే! కాని అతని కోపం కర్తవ్యాకర్తవ్యాలను విమర్శింపదు. అందువల్ల కోపోద్రేకంలో ధర్మరాజుకేమైనా అపకారం కలుగజేస్తాడేమోనని శంకించి,అతని యెదుట ధర్మరాజును స్తుతించింది. వెంటనే ధర్మరాజు భీమునికి దైవసముడైనాడు. అటుమీద తన సోది మొదలుపెట్టింది. సుధేష్ణకు పనులు చేస్తూవుండడం మూలాన్ని "పాణితలములు కాయలు కాచా" యని చూపించి ఏడ్చింది. దానితో భీమునికి శివమెక్కింది.

"వాని దెగ జూడవైతేని వాయుపుత్ర!
నీవు గనుగొన నురినైన నీరనైన
నగ్నినైన విషంబుననైన మేను
దొఱగుదును...నెట్టు నీయాన సుమ్మ!"
అని యాతని క్రోధాగ్ని కింధనంవేసింది.

"మర్కటస్య సురాపానం మధ్యే వృశ్చికదంశనమ్,
తన్మధ్యే భూతసంచారమ్......................"

అన్నవతుగా అయింది భీమునిస్థితి. వెనకా ముందూ చూడకుండా "ధర్మతనయుండు తాన వచ్చి యడ్డుపడెనేని, నీవ పెంపారుకరుణ గాచినా" కీచకుణ్ణి యమాలయాని కంపుతా నని ప్రతిజ్ఞచేశాడు. ద్రౌపది కర్తవ్యం పూర్తయింది. అయిదుగురు భర్తలుండగా "ఆత్మహత్యచేసుకొంటా"నని భీముని ఎదుటనే ఎందుకనాలి? మిగిలిన నలుగురి తత్త్వాలూ ఆమెకు తెలుసు. భీముణ్ణి ఆశ్రయిస్తేనేగాని సద్యఃఫలం కలుగదు. ఆ కిటుకు నిమిషంలో గ్రహించింది తిక్కనద్రౌపది.

అజ్ఞాతవాసం పూర్తి అయి, విరాటుని కొలువు నుండీ బయటబడేసరికి మరీ ఆరితేరింది ద్రౌపది. ఒక్కొక్కమాట మాట్లాడితే ఒక్కొక్క బాకుపోటులాగా ఉంటుంది. ఎంత కార్యానికైనా వెనుదీయదు. భర్తలనుగూడా అంతరంగంలో తృణప్రాయంగా తలుస్తుంది. పైకిమాత్రం గౌరవం చూపుతుంది. దుశ్శాసన దుర్యోధనులు రగుల్కొల్పిన పరాభవానలం ఆమె కింకా హృదయంలో ఒకమూలనించి రాజుతోంది. కీచకునిరక్తం కండ్లచూస్తేనేగాని,ఆమెకప్పుడు క్రోధం శాంతించలేదు. ఇప్పుడు కురుకుమారుల కళేబరాలమీద గద్దలు వాలడమే ఆమెమనోరథం. అదే ఆమె జీవితాశయం. తనహృదయాన్ని విప్పిచెప్పడానికి అవకాశం లభించడంలేదు. ధర్మరాజు స్వప్నంలోగూడా"సంధి —శాంతి!" అని పలవరిస్తున్నాడు. అయినా భీముణ్ణి పురికొల్పింది గాని, అతడు అన్నగారి మాటలను మీరలేకపోయాడు. కడకు శ్రీకృష్ణుడు రాయబారానికి హస్తిపురికి ప్రయాణంకట్టాడు. సంధినిగూర్చి పంచపాండవుల వ్యక్తిగతాభిప్రాయాలు కనుక్కున్నాడు. ద్రౌపదివంతు వచ్చింది. ఆమె ఉద్దేశాన్ని వెలిబుచ్చడాని కదే తరుణం. భర్తలు కార్యశూరులు గారు. కృష్ణుడేమైనా సహాయంచేస్తాడేమోనని ఆమెఆశ.

ధర్మరాజు కృష్ణునితో చెప్పిన సంధివచనాలు విని, తారాజువ్వలాగా మండిపడ్డది.ధర్మరాజునుమింగి వెయ్యాలన్నంత కోపం వచ్చింది. ఆకోపంలో మాట కూడా సరిగా వెలువడలేదు. ధర్మరాజుకు ఏమీ బుర్రలేనట్లుగా మాట్లాడింది. "ధృతరాష్ట్రుడు సంజయునిచేత చెప్పంపించగానే ధర్మరాజు ఉబ్బిపోయి, అయిదుగురికీ అయిదూళ్లివ్వమని ప్రాధేయపడవచ్చునా? పోనీ! తమ్ముడైన దుర్యోధనునిమీద ఉండే ప్రేమచేత తన రాజ్యాన్నిగూడా వదులుకొని, అతన్ని క్షమించవచ్చునుగాని, లోకంలో జను లేమనుకొంటారో అని ఆలోచించ నవసరంలేదూ? పాండవులు క్షత్రియులైనా వట్టిదద్దమ్మ లని అనుకోరూ అందరూనూ? దుర్యోధనుడు మాటలతో రాజ్య మిస్తాడా? యుద్ధం చేస్తేమాత్రం అతనికి పౌరుషంలేదూ? అతడు బ్రాహ్మణుడా, ఊరికే కూచోడానికి?" ఇదీ ఆమెవాదన.

"సుయోధనుడు మాటలతో పోడు. అతని కింకా పౌరుషం ఎక్కువౌతుంది. నీరాయబారం అనవసర" మని చెప్పింది శ్రీకృష్ణునితో. "పోనీ! పాండవులు 'సంధి' అంటున్నారు గదా! "అచ్చోటన సంగరంబు

గసు చొప్పులు పుట్టినసైన పాండవుల్ పోటున కిచ్చ
ంతురో కో! పోదురో కానలనుండ" అని ప్రశ్నించింది. ఆ ప్రశ్న ఎంత గంభీరమైందో చూడండి! దుర్యోధనుడే యుద్ధాని కొస్తే పాండవులు యుద్ధంచేస్తారా? లేక మళ్లీ అడవులకు పరుగెత్తుతారా? అప్పుడు వీరి 'సంధి, అహింసాతత్త్వం' ఏవేపు పోతాయి? ఈ ప్రశ్న చాలా గట్టిదే! శ్రీకృష్ణుడుగూడా జవాబు చెప్పలేకపోయాడు.

ఇంతా వాదించి, ఆఖరుకు తనమాటలన్నీ లెక్కలేవన్నట్లుగా తప్పించుకొంది. "ఇలా అన్నానని నామాటలు లెక్కచేయకండి! నీవూ, ధర్మరాజూ ఆలోచించి చేయండి. "మాఅట నోరిదాననయి... కొఱులు ప్రేపెలెదక." నా వివేకమంతా నశించింది. కాబట్టి మీయిష్ట మెచ్చినట్టు చేయండి!" అని చెప్పి తనమీద భారం లేకుండా చేసుకొంది. కారణ మేమిటంటే "ద్రౌపది తన భర్తలను గూడా లెక్కజేయ"దని లోకం అంటుందేమోనని భయం.

కాని తన పని పూర్తి కాలేదు. కృష్ణుని కింకా ఉపదేశంచేసి అతనిచేత "సంధి కుదరనివ్వ"నని వాగ్దానం చేయించుకోవాలి. అందుకోసం తన గొప్పతనాన్నీ, సతీత్వాన్నీ వెల్లడించుకుంది.

"నీవు సుభద్రకంటె కడునెయ్యము గారవముం దలిర్ప సంభావన సేయుదు..."

నీ సొంత చెల్లెలికంటె నన్నతిగౌరవంగా చూస్తావు గాబట్టే యీ ఘోషంతా నీదగ్గిర చెప్పుకుంటున్నాను. నీకంటె నా కింక ఆప్తులులేరు.

"సరసిజనాభ! అన్నిట ప్రశస్తికి నెక్కినదాన"

అలాంటి నన్ను "వేణి వట్టి......... సభకు నీడ్చె"డు దుశ్శాసనుడు. నా కింత అవమానం జరుగుతూవుంటే నాపతులు నిశ్చేష్టులై, స్వాతంత్ర్య రహితులైన బానిస లవడంచేత "చిత్రములయాకృతి"జూచ్చున్నారు. గత్యంతరం గానక, నిన్ను ధ్యానించాను. నా యీ పరాభవాగ్నికి జలోపశమనం లేదా?" అని శ్రీకృష్ణుని హృదయం కరిగేలాగా అంగలారుస్తూ "నేను నాభర్తలతో హస్తిపురికి పోతాననుకో! రాజసూయ యాగసమయంలో ధృతరాష్ట్రుడు నన్ను "కోడ లనక......దాసిగ జేశె"డు, అలాంటి "మహాపురుషునిపాలికి" పోయి...

"కోటరంబు దగ జేయుదునో?......
వరవుడ మోపి చేయుదునో?...

నీవే నిశ్చయించు"మని శ్రీకృష్ణునికి ఒకసమస్య యిచ్చింది. కోడలని అయినా వివేకంలేకుండా, దాసీపనికి నియోగించిన పెద్దమనిషిదగ్గరికే పోయి కోడంటికం చేయడం ఉచితమేనా చెప్పమని అడిగింది. నిజమే! కోడంటికం చేయాలా, దాసీపని చేయాలా? ఎవరు నిశ్చయించగలరు? ఈ ప్రశ్నలతో శ్రీకృష్ణునికి మతిపోయింది; నిరుత్తరుడైనాడు. అతనికికూడా ఆవేశం బయలుదేరింది.

అదే సమయ మని ద్రౌపది "...బంధురంబయిన క్రొమ్ముడి విడ్చి వెండ్రుకల్...వలచేతబూని"ంది. ఆ వెండ్రుకలు "అసితచ్ఛవిబొల్చు మహాభుజంగం"లాగా వేలాడుతున్నాయి. హృదయాన్ని పరాభవాగ్ని దరికొంటూవుంది. అశ్రుధారాస్త్రాన్ని ప్రయోగించింది. ఇంతమంది సజీవులై యుండీకూడా తన పరాభవానికి ప్రతీకారం చేయలేకపోయారుగదా అని రోషం పొరలింది. అపరకాళీమూర్తిలాగా "డిగ్గనలేచి" ఆ వెండ్రుకలను శ్రీకృష్ణుని ముందుంచి "ఇవి దుస్ససేను వ్రేళ్లం దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి. నీ రాయబారసమయంలో వీనిని జ్ఞప్తికి దెచ్చుకో! నీ సొంత చెల్లెలి వెండ్రుకలనుబట్టి ఒకదుర్మార్గు డీడ్చాడంటే నీకురోషం లేదా? నీలో రక్తంలేదా? నీనరాల్లో పటుత్వంలేదా? నీనాడులు చచ్చిపోయాయా? దీనికేమీ ప్రతీకారం చేయలేవా?" అని ఆడుబెబ్బులిలాగా గర్జించింది.

"నీకు అయిదుగురు భర్త లుండగా నా దగ్గిర గోలబెట్టడమెందుకు?" అని శ్రీకృష్ణు డంటాడేమోనని "కృష్ణా! నాభర్తలు పౌరుషహీనులు! ధర్మరాజు ఎప్పుడూ అహింస అహింస అంటూ ముక్కుమూసుకొని కూచుంటాడు. భీముడు ఎప్పుడూ గదను మొయ్యలేక అవస్థపడుతున్నాడు. అర్జునుడు గాండీవం అనే వెదురుముక్క దొరికిందేచాలు నని అస్తమానమూ చంకకు తగి

లించుకొని తిరుగుతుంటాడు. నకులసహదేవులకు అసలు యుద్ధస్వరూపమే తెలియదు. ఇక నాస్థితి చూచేవా రెవరు? భార్యకు పరాభవం జరిగితే ఓర్చుకున్న వీళ్లకు పౌరుష మెక్కడిది? ఖండఖండాలైన దుశ్శాసనశరీరమునూ, దుర్యోధనకళేబరాన్నీ నాకు చూపించి, నా దుఃఖాగ్నిని చల్లార్చకుంటే వీళ్ల బాహుబలాలు కాల్చడానికా? "రక్కస, తాల్మి, చిచ్చొడిం గట్టినయట్లు" ఈక్రోధానలాన్ని భరించాను. ఇది నాలో పాతుకొనిపోయింది. "జగంబులుగాచు తోబుట్టువు నీవు–తేజమున బొల్చినభర్తలు" కల్గినా యీ అగ్నిచల్లారేమార్గం కనపడలేదు. కురుకుమారులు నామావశిష్టులైతేనేగాని నాకు శాంతి లేదు." అని వీరావేశంతో, ఊపిరాడకుండా, తనకు కురుకుమారులపై నున్న క్రోధాన్నీ, భర్తలయందుండే తృణీకారభావాన్నీ, శ్రీకృష్ణునియందుండే గౌరవాన్నీ, తన మనోనిశ్చయాన్నీ వెడలగ్రక్కింది. దేనికైనా తయారు అనే స్థితిలో ఉంది. ప్రతీకారమే ఆమెవాంఛ. యుద్ధం స్వయంగా చేయడానికైనా వెనుదీయదు. క్షత్రియరక్తం నాళాల్లో ప్రవహిస్తున్నవాడైతే, ఆమెమాటలు విని కరవాలం దూసి యుద్ధరంగంలో దుముకవలసిందే! శ్రీకృష్ణునికి గూడా ఆమె వైఖరి అద్భుతమైంది. సాక్షాత్తూ శక్తిస్వరూపం దాల్చింది. పగతురను చంపితేనే గాని ఆమెకు శాంతి లేదు. అందువల్లనే శ్రీకృష్ణుడు సంధి కుదరకుండా చేయవలసిన అవసరం ఏర్పడింది. కడకు "నీమెచ్చుగ శత్రుసంక్షయము మేకొని చేసెద!...వేళోకం దచ్చు పడంగనేర్చునె" అంటూ "నీవు కోరిన ప్రకారం శత్రు సంహారం చేస్తాను. సంధి ఎన్నటికీ కుదరనివ్వ"నని వాగ్దానం చేశాడు శ్రీకృష్ణుడు ద్రౌపదికి. అప్పుడు శాంతించింది ద్రౌపది!

ఇదీ తిక్కనద్రౌపదితత్త్వం. మంచి పరువు దశలో ఉంది. నన్నయచేతుల్లో మెలగినప్పటి బాల్య చాపల్యాన్నీ, ముగ్ధత్వాన్నీ, లజ్జాసంకోచాలనూ, లోకవిషయానభిజ్ఞత్వాన్నీ వదలి సంపూర్ణ ప్రౌఢ అయింది. అలాంటి మార్పుకు వయస్సు కూడా తోడ్పడింది. శరీరంతోపాటు మనస్సు కూడా కాఠిన్యాన్నీ, తీవ్రత్వాన్నీ దాల్చింది. పగ సాధించడంలో తిక్కనద్రౌపదిది అగ్రతాంబూలం. తలచుకున్నపని అయితీరాలి. చెప్పదలచినమాట లక్షమందిలోనైనా ముఖాన అనే స్వభావంగలది. భర్తలు తనకోరిక నెరవేరిస్తే వారిని గౌరవిస్తుంది. లేకుంటే వారిని నీచాతినీచంగా చూస్తుంది. అవసరాన్నిబట్టి తానే విజృంభిస్తుంది. ఇతరులమనస్సు మార్చడంలో ఆమె ముందంజవేసింది. పగపడితే రక్తం కండ్లచూచేదాకా వదలదు.

## ❋ పోతన ❋

"బాలురచావును" వినిపిస్తూ ప్రవేశపెట్టాడు ద్రౌపదిని పోతన్న. కేవలం మూర్తీభవించిన కరుణాధిదేవత ద్రౌపది. దాని కనుగుణంగా వైరాగ్యవాతావరణాన్ని కల్పించాడు కవి.

"బొమ్మలు చెక్కుల రాలగా, నేలబడి జాలిగా" ఏడుస్తూవుంటే, క్రీడి ఆమెను ఓదార్చి, "ద్రౌణి శిరమును ఖండించి" తెస్తానని వెళ్లాడు. కడుపునబుట్టిన బిడ్డలు హతులైనారు. ఒకరు గాదు ఇద్దరుగాదు, ఏకకాలంలో అయిదుగురు చచ్చారు. యుద్ధంలో మడిసినా యింత దుఃఖం ఉండదు. యుద్ధమంతా పూర్తిఅయి శిబిరంలో సుఖనిద్రలో ఉండగా, అన్యాయంగా హత్యచేయబడ్డారు. అయిదుగురూ ముక్కుపచ్చలారని బిడ్డలు. ఒక్కొక్క భర్తకు ప్రతిబింబ మొక్కొక్కడు. ఆఖరు చూపులుగూడా లేవు. శేషజీవితంలో ఆమె చూచుకొని ఆనందించడానికి ఒక్కణ్ణీగూడా మిగల్చలేదు అశ్వత్థామ. ఇక యీజన్మలో మళ్లీ వాళ్లను చూడడందుర్లభం. తలచుకొన్నకొలదీ ద్రౌపదికి కడుపు చెరు వయింది. గర్భగోళంలో కార్చిచ్చు పెట్టినట్టుంది ఆమెకు. నేలమీదబడి పొర్లి ఏడవడంగూడా అనుచితమనిగూడా ఆమె గమనించే స్థితిలో లేదు.

అశ్వత్థామను బద్ధుణ్ణి చేసి అర్జునుడు ద్రౌపదివద్దకు తెచ్చాడు. "బాలవధజనితలజ్జాపరాఙ్ముఖుడై కృపి కొడుకు" ద్రౌపదియెదుట నిలువబడ్డాడు. ఆదృశ్యంలో ద్రౌపదికర్తవ్య మేమి? తిక్కనగారి ద్రౌపది ఏం చేస్తుందో ఆలోచించండి! తనలో మండుతూవుండే

(౭౮౩-వ పుట చూడుడు.)

# మా చిట్టితల్లి



[కథానిక]

శ్రీ మునిమాణిక్యం
నరసింహారావు

మా విజయకు ఆరేండ్లు వెళ్లినాయి. మా అమ్మాయి అని అనటంకాదు గాని అది చక్కనిపిల్ల. కోటేరుపోసినట్లు ముక్కూ, చెంపకు చారెడేసి కళ్లూ, నీటి బుడగల్లాంటి బుగ్గలూ, అదీ, జాతిబొమ్మలాగుంటుంది! దాని తరువాత పిల్లలు లేకపోవటంమూలాన అది ఆడింది ఆటా, పాడింది పాటా మాఇంట్లో. ఒక విధంగా దానికి అందరమూ దడుస్తూ ఉంటామనుకూడాను. దానికి కాస్త చిన్నదెబ్బ తగిలిందాఅంటే ఇక ఇంటిల్లిపాదీ దానిచుట్టూ చేరి, "మాఅమ్మ! ఎంతపెద్దదెబ్బ తగిలిందే తల్లికి! అబ్బా! ఎంతదెబ్బ తగిలిందే అమ్మకూ" అంటూ భజనచేయాలె. ఎవరన్నా, అదేమంత పెద్దదెబ్బకాదు అన్న భావంతో నవ్వినా, దాన్ని ఓదార్చకపోయినా విజయ వాళ్ల మీద పడి రక్కి, ఏడ్చి నానాగోల చేస్తుంది. పెద్దబాధకలిగినా గొప్పఓర్పుతోనూ, ధైర్యంతోనూ అది భరిస్తున్నదని మనం అనుకోవాలె. అదీ అల్లాగే అనుకొంటుంది. దాని స్వభావం అల్లాంటిది.

కష్టాలలోనే కాకుండా సుఖాలలోనూ అంతే. అది మొగపిల్లలతో కలిసి గోడిబిళ్ల ఆడుతుంది. ఆసమయంలో అది బిళ్లను పట్టుకొన్నదా అందరూ చప్పట్లు చరిచి, అరిచి దాన్ని గొప్పచేసి మెచ్చుకోవాలె. అల్లాగ చెయ్యకపోయినారో వెంటనే కర్ర బిళ్లా అక్కడ పారేసి వాళ్లమ్మను కౌగలించుకొని ఏడుస్తుంది. దానికి వచ్చిన కష్టం గొప్ప కష్టం! దానికొచ్చిన జయం అఖండవిజయం!!

ఒకరోజున నేను నిద్ర లేవకముందే విజయ వచ్చి నన్ను లేపి "చూడు నాన్నా, ఒళ్లంతా ఎట్లా ఐందో" అన్నది బిక్కముఖంతో, జాలిగా నావంక చూస్తూ. నేను కళ్లు నులుపుకొని చూశాను. వంటినిండా సందు లేకుండా దద్దుర్లుపోసినై. తెల్లనిశరీరంపైని ఎర్రగా ఉన్న ఆదద్దుర్లను చూసేసరికి నాకూ కొంచెం భయంవేసింది ఏమిటూ ఇది అని. ఒక్కొక్క దద్దురు ఎత్తుగా ఉబ్బి విచ్చిన గులాబిపూవు అంత ఉంది. వాళ్ల అమ్మను పిలిచి చూపాను. "ఇవేమిటండీ ఇల్లా పోసినై దద్దుర్లు? ఇదేమైనా అమ్మవారా" అన్నది ఆవిడ. "అమ్మవారు అయితే ఇల్లా ఉండదు" అన్నాను నేను. ఆవిడా చాలాభయపడ్డది. ఇంతలోకే పిల్లలంతా వచ్చారు. వచ్చి దాని చుట్టూ మూగి, "ఎంతపెద్ద దద్దుర్లే! ఎర్రగా ఉన్నాయి ఏమిటే! ఏమన్నా 'మంటా అమ్మా? దురద ఏమన్నా ఉందిటే" అని ప్రశ్నలు వేయసాగారు. అది ఒక్కొక్క ప్రశ్నకే సమాధానం ఇస్తున్నది. ఎంతో ఓర్పూ, ధైర్యమూ గలదానివలె నటిస్తూ అది మాట్లాడుతున్నది.

"ఎంత పెద్ద దద్దుర్లే!"

"ఇందాక ఇంకా పెద్దవిగా ఉన్నాయే. ఇప్పుడు కాస్త నయం. ఇంకా నాన్న నడుగూ. ఏం నాన్నా?"

"ఇందాకా ఒక్కొక్క దద్దురు ఇంతింత ఉందమ్మా" అన్నాను నేను.

"అయ్యబాబో" అన్నారు అంతా.

"ఎర్రగా ఉన్నాయి ఏమిటే" అన్నాడు అబ్బాయి.

"ఇదేమి ఎరుపే! ఇందాకా నీవు చూడ లేదు. మందారపూల్లాగ ఎర్రగా ఉన్నాయి. కాదుటే, అమ్మా?"

"అవునమ్మా, నాతల్లీ. ఇదేం కర్మమే! ఏమన్నా మంటగా ఉందా అమ్మా?"

"అబ్బో ! కారంపూసినట్లు భగభగ మండుతున్నదే అమ్మా"

"నాతల్లీ, ఇదెక్కడి విపరీతమే! ఇల్లాం టిది నే నెప్పుడూ ఎరగనూ! దురదకూడా ఉన్నదా అమ్మా?"

"అబ్బ! తగనిదురద. గోకితే పుండు అవు తుందని ఊరుకొంటున్నాను" అన్నది విజయ ఒక్కక్షణం ఆలోచించి.

"అమ్మతల్లీ! ఎంత బాధపడుతున్నావే" అన్నారు అంతా.

ఇంతలో మాఇంటి ప్రక్కనున్న మున లమ్మగారొచ్చి "ఏమిట్రా" అంది. "బామ్మ గారూ, ఇల్లా రండి, పిల్లను చూడండి" అన్నది మా ఆవిడ. ఆవిడా ఒక నిమిషం చూచి—

"ఎప్పటినుంచి అమ్మా ఇల్లాగా?"

"ఏమోనండి, ప్రొద్దున్నే అదే వచ్చి వాళ్ల నాన్నకు చూపిందాకా మా కెవ్వరికీ ఏమీ తెలియనే తెలియదు. ఏమండీ బామ్మ గారూ, ఇది ఏమిటి అంటారు?"

"ఇవి దద్దుర్లే అమ్మాయి"

"అవును లెండి. ఎందు కొచ్చినట్లు? ఏం చేయమంటారు?"

"ఏం ఫరవాలేదమ్మా"

"మీ కేం, అలాగే అంటారు" అన్నది మా విజయ కొంచెం కోపంగా. ఆవిడకూ మా విజయతత్వం తెలుసు. అందుకని చప్పున మళ్లీ అన్నది:

"అవునమ్మా, పాపం, నీవు బాధపడుతు న్నావు తల్లీ. ఏం జేస్తామమ్మా! వీటి దుంప తెగ! ఇవి ఒక్కతీరాన పోవు. పాపిష్టివి! దురద ఉండదు కాని మంట మాత్రం బాగా ఉంటుంది"

"అవునండీ బామ్మగారూ. దురదన్న మాట లేదుకాని మంటగా ఉందండి. వళ్లు అంతా" అన్నది మా విజయ.

"ఏదైనా కుటితే ఇలాగు వచ్చిందో, లేక పోతే ఏదైనా గాలిచేష్ట ఏమైనా సోకిందో" అని మా ఆవిడ భయపడి పక్కఇంటివాళ్లకు నలుగురికీ కబురంపింది. ఒకావిడ వచ్చి "చింతపండుపులుసు పట్టిస్తే ఆదద్దుర్లు మాయ మౌతాయి" అన్నది. ఈమాట విజయకు కష్టం కలిగించింది. "ఏమిటి నాన్నా, వెధవ చింతపండుతో నయమవుతాయా ఇవి? మంచి డాక్టరును తీసుకొని రావాలె గాని"

అన్నది, ఎంతో చిన్నబుచ్చుకొని. ఆదద్దుర్లు చింతపండు పులుసుతో నయం అవ్వటం తటి స్వల్పవిషయంగా పరిగణించటం దానికి ససేమిరా ఇష్టంలేదు.

ఇంతలోకే ఇంకో ఆవిడ వచ్చి, "మంట ఉంటే చింతపండుపులుసైనా, నిమ్మకాయ రసమైనా పూస్తే ఇట్టే అణగిపోతై. మంట గనక లేకపోయినా ఇవి కొంచెం ప్రమాదమే" అన్నది.

"మంట ఉంటే నేనయమా అండీ? అయితే మంటఉందనే అంటున్నదండీ పిల్ల" అన్నది మా ఆవిడ.

"మంటలేదే! మంటాలేదు దురదాలేదు" అన్నది మా చిట్టితల్లి.

"ఇందాకా భగభగ మండుతున్నది, తగనిదురద అంటివిగదే?" అన్నాను నేను.

"మంటగా ఉందనుకున్నా నాన్నా" అన్నది విజయతల్లి తెల్లబోయి.

"మీరూరుకోండి, చిన్నపిల్ల కేంతెలుస్తుంది" అని మా ఆవిడ నన్ను కోప్పడుతున్నట్టు నటిస్తూ, అది చూడకుండా నా వైపు తిరిగి నవ్వింది.

నేను తెలివితక్కువగా పైకే నవ్వాను. చిట్టితల్లికి కోపంవచ్చి, "నాకుజబ్బుగా ఉంటే మీకు నవ్వులాటగా ఉందేం?" అని అంటూ మూతి మూరెడుపొడుగు చేసుకొంది. అది ఇక ఏడ్పు మొదలుపెడుతుందని కనిపెట్టి మా ఆవిడ "చాల్లే ఊరుకోండి. మీకు అభం తెలియదు, శుభం తెలియదు. అవతల దాని వొళ్లుఅంతా కందగడ్డ అయిపోయి ఉంటే చూస్తూ ఊరుకోవటమేకాకుండా పైగా నవ్వుతున్నారూ! బాగానే ఉంది లక్షణం. ఇప్పుడైనా పరుగెత్తండి డాక్టరు దగ్గరకు" అన్నది విసుగ్గా.

"వెళ్లుతానే. దాని బాధ ఏమిటో తెలియాలా?"

"ఏమిటి తెలిసేది? కనపడటంలేదూ?"

"అదికాదు నేననటం. దానికి దురదా, మంటా ఉన్నట్లూ, లేనట్లూ ఇంతకూ" అని పసిదానివంక చూశాను. చిట్టికూడా ఏమీ సమాధానం చెప్పలేక బిక్క ముఖంతో బాధపడుతున్నదానిలాగ తలొంచుకుని ఊరుకొన్నది.

"ఏం, అమ్మా! ఏమిటీ బాధా?" అని అడిగాను.

"ఏమిటో నాన్నా! నాకేం తెలియటం లేదు. వికారంగా ఉంది నాన్నా" అన్నది.

"పైత్యాన వచ్చిందేమో సుమా, వికారంగా ఉందని అంటూఉన్నది" అన్నాను.

వట్టి మామూలు పైత్యంవల్ల వచ్చిన దద్దుర్లే అని నేను అనుకొంటే దానికి చాలా కష్టంగా ఉంటుం దని కాంతానికి తెలుసు. అందుకని ఆవిడ "పైత్యమనీ, వికారమనీ మీరు ఊరికే నీళ్లు నములుతూ కూర్చోక పరుగెత్తండి డాక్టరుదగ్గరకు. పిల్ల బొత్తిగా కూరాకు అయిపోతుంటేనే" అన్నది.

ఇంతలో చిట్టి నిజంగా నీరసం కలిగినదానికి మల్లె చాపమీద వాలి కళ్లు మూసుకొంది. నాకు నవ్వువస్తున్నది. మా ఆవిడ పళ్లుబిగించి ముఖం విసుకుగా తిప్పింది, నవ్వవద్దు అని సూచనగా.

"సరేలేవే. అమ్మాయీ! డాక్టరు దగ్గరకు వెడుతున్నాను. చూడూ, కాంతం, దాన్ని ఆచాపమీదినుంచి తీసికెళ్లి మేడపైన మంచంమీద పడుకోపెట్టు. ముఖం కడుక్కున్నదిగా. కాస్త కాఫీ ఇయ్యి ముందు" అనిచెప్పి నేను క్రిందికి దిగటం మొదలుపెట్టాను.

నేను వెళ్లిపోతుంటే నన్ను ఒకసారి పిలిచి మా ఆవిడ "మీరు బజారులో కాఫీత్రాగుతూ కాలం గడపక వేగిరం డాక్టరును తీసుకురండి" అని గట్టిగా చెప్పింది. సరేనని నేను వెళ్లబోతుంటే అమ్మాయి "నాన్నా" అని పిలిచింది. "అమ్మాయి ఏమిటో చెప్తున్నది, వినిపొండి" అని ఆమెకూడా అన్నది.

"ఏమిటమ్మా" అన్నాను.

"ఎవరిని తీసుకొస్తావునాన్నా" అని నీరసంగా అంది విజయ. అప్పుడే దానికి నీరసం కూడా వచ్చేసింది.

"చలపతిరావుగారిని తీసుకొస్తానమ్మా" అన్నాను. చలపతిరావుగారిమీద మా ఇంటిల్లిపాదికీ విశ్వాసం. ఆయన చాలా నెమ్మదైనవాడూ, చాలా సమర్థుడూ కూడాను. అయితే ఆరోజున మాఅమ్మాయి "ఎప్పుడూ ఆయనేనా నాన్నా" అన్నది. మామూలు జబ్బులకు వచ్చే డాక్టరుగారు తనకు ఇప్పుడు పనికిరాడని దానిఉద్దేశం. ప్రత్యేకమైన క్రొత్త డాక్టరు వస్తేనేగాని దానికి తృప్తిలేదన్న సంగతి, వాళ్లతల్లి వెంటనే గ్రహించి "చూడండి, ఆవీధిలోకి జోసిఫ్ అని ఒక క్రొత్త డాక్టరు వచ్చాడు. కారులో తిరుగుతుంటాడు, ఎరగరండీ? ఆయన్ను పిలుచుకురండి" అన్నది.

"అబ్బో! ఆయన మనబోటివాళ్ల ఇండ్లకు వస్తాడుటే?"

"ఎట్లాగో బ్రతిమిలాడి తీసుకురండి. ఎంత అడిగితే అంతా ఇస్తానననండి. రాకేం జేస్తాడు? ఇటువంటి సమయంలో మనము డబ్బుకోసం చూసుకొంటే ఎట్లా? తప్పుతుందా? వెళ్లండి వేగిరం" అని మాపిల్లల తల్లి అన్నది. ఈమాటలు వింటున్న విజయ తల్లిముఖం చేటంత అయింది.

౨

"ఎందుకైనా మంచిది క్రొత్త డాక్టరుతో పరిచయం కలుగజేసికొనటం. పిల్లలు గల వాళ్లం మనము" అనుకొంటూ ప్రక్కవీథిలోకి వెళ్లాను. వెళ్లి తలుపునెట్టి "జోసిఫ్‌గారు ఉన్నారా" అని అడిగాను.

"ఆ!" అంటూ ఒకాయన తలుపు తీశాడు. పొడుగాటిమనిషి. బిళ్లగోచీ పెట్టి, బెంగాలీ పద్ధతిలో పంచకట్టాడు. తెల్లనిశరీరం. గడ్డంమాత్రం దుబ్బుగా పెరిగిఉన్నది. మనిషి చూపులకు దర్జాగా ఉన్నాడు. కళ్లుమాత్రం పెద్దవిగా ఉండటమే కాకుండా ఏదో తమాషాగా ఉన్నాయి. బెంగాలీ లాల్చీ తొడుక్కున్నాడు.

"జోసిఫ్‌గారి కోసం వచ్చానండీ" అన్నాను.

"ఆ, నేనే. ఏంకావాల చెప్పండి" అన్నాడు ఆయన.

"తమరేనాండి? తమ దర్శనం నేను ఎప్పుడూ చేయలేదు" అన్నాను.

ఆయన తల ఊపి, గడ్డంలోకి నాలుగు వేళ్లూ పోనిచ్చి దువ్వి 'ఆఁ' అని దగ్గాడు.

నేను మళ్ళీ అన్నాను, "తమరు ఒక్కసారి మా ఇంటికి దయచెయ్యాలె. పిల్లదానికి అస్వస్థతగా ఉంది" అని.

"అల్లాగా? ఇప్పుడే వస్తాను." అని బల్ల పైనున్న స్టెతస్కోపు తీసుకొని ఆయన బయటకు వచ్చాడు.

"బండి తెమ్మంటారా" అన్నాను.

"వద్దు వద్దు. నడవటమే నాకు అలవాటు. దక్షిణఆఫ్రికాలో నే నున్నపుడు రోజుకు వందమైళ్లు నడిచేవాణ్ణి" అన్నాడు.

వందమైళ్లు ఎల్లాగసాధ్యమా అని సందేహం తోచింది. కాని, ఎందుచేతో నేను ఆవిషయమై ఆయనతో వాదన పెట్టుకోక, ముందు నడిచి దారితీశాను. ఇంకో అయిదు నిమిషాలలో ఇల్లుచేరుకున్నాము. ఈ స్ఫురద్రూపిని చూచి మా చిట్టితల్లికూడా సంతోషించింది.

"ఈ బిడ్డకేనండి కులాసాలేకపోవట." అన్నాను.

"అల్లాగా? ఏం?"

"శరీరం చూడండి. వంటిమీద ఎర్రని మచ్చలు. దద్దుర్లుపోసినై" అన్నది మా ఆవిడ.

"ఎల్లాగ వచ్చాయి ఇవి? ఇవి ఈ దేశంలో లేవే! దక్షిణ ఆఫ్రికాలో పిల్లలకు తరుచు ఇల్లాంటి దద్దుర్లు పోస్తుంటాయి. ఈపిల్లకెల్లాగు వచ్చినై అబ్బా!" అని డాక్టరు ఆశ్చర్యపోయినాడు.

ఈయనకు దక్షిణ ఆఫ్రికా పిచ్చి చాలా ఉన్నట్లుందే అనిపించింది.

"ఏమోనండి. నిన్న ఏమీ లేదు. తెల్లవారేసరికి శరీరం అంతా ఇల్లాగ అయిపోయింది. చూడండి, ఎర్రగా ఉబ్బి, ఎల్లాగున్నదో. భయంకరంగా ఉన్నాయండి" అన్నాను.

ఆయన దద్దుర్లను చక్కగా పరీక్షించాడు. స్టెతస్కోపుతో గుండెదడ విన్నాడు. చూచిచూచి చివరకు ఆయన "ఎట్లా వచ్చిందండీ ఈజబ్బు మీ అమ్మాయికి?" అని అన్నాడు.

అనేటప్పటికి మాకు భయంవేసింది. అందుకని "ఇదేమైనా ప్రమాదం చేస్తుందా అండీ" అని అడిగాను. "ప్రమాదం కాకేమండీ? ప్రమాదమే. మంటా, దురదా కూడా ఉన్నాయి కదూ?" అన్నాడు.

"ఆ" అన్నది అమ్మాయి భయంతో.

నేనూ, మా కాంతం కూడా ఆయన మాటలు విని బిక్కముఖాలతో నుంచున్నాము. మాస్థితి చూచి చివరకు డాక్టరుగారు "చూడండి, మీరేం దిగులుపడాలిసిన అవసరం లేదు. మీ ఇంట్లో బూడిదరంగు కాయితం ఉందా?" అన్నాడు.

"ఆ, ఉందండి" అన్నది మా ఆవిడ.

"బూడిదరంగు కాయితంతో ఈ అమ్మాయిశరీరం అంతా కప్పివేయండి. ఎక్కడా గాలిదూరే సందుఅయినా లేకుండా కప్పిసెయ్యండి. ఆ కప్పినకాయితం ఎగిరిపోకుండా పైన దారం చుట్టండి. తెలిసిందా? పిల్లను కాయితంతో ఒక పొట్లంలాగ చుట్టివేయా లన్నమాట. అల్లాగ చుట్టి, పరుపుపైన పడుకోబెట్టి, పైన రగ్గు కప్పండి. ఒకగంటసేపు అల్లాగ ఉంచి దానితరువాత కాయితం, రగ్గూ అన్నీ తీసెయ్యండి. చూడండి, అప్పుడు ఒక్కదద్దురైనా ఉంటే అనండి" అన్నాడు ఆడాక్టరు.

ఆమాటలు విని మాఆవిడ తెల్లపోయింది. నాకూ ఈవిధానం విచిత్రంగానే ఉంది. పైత్యాంతకమో, లేకపోతే ఆర్సెనిక్‌తో కూడిన ఏదైనా మందో ఇల్లాంటి దద్దుర్లకు వాడటం కద్దుగాని ఇల్లాగ బూడిదరంగు కాయితంతో వైద్యం చేయటమనేది నాకూ క్రొత్తగానే ఉండి, ధైర్యంచేసి చివరకు "బూడిదరంగు కాయితమా అండీ" అని సందేహాన్ని వెలిపుచ్చాను. ఆయనా నావంక చురచురా చూచి, "బూడిదరంగు కాయితంయొక్క మహాత్యం నీకేం తెలుసు? నేను దక్షిణఆఫ్రికాలో ఉన్న రోజులలో రకరకాల జబ్బులకు, మొత్తంమీద ౭౦ వేల గజాల బూడిదరంగుకాయితం ఉపయోగించాను. మరి నా అనుభవమంతా మట్టి గలిసిపోయినట్లేనా? నేను చెప్పినట్లు చేయండి" అని గట్టిగా అనేసరికి మే మేమీ మాట్లాడటానికి వీలులేకపోయింది. కాని నే నూరుకోక "చిత్తం అల్లాగే చేస్తాము. అయితే ... ఇది ఉమాపతివైద్యం ... అలాంటి దేదైనా కొత్తరకం వైద్యమా అండీ" అన్నాను.

"ఏవిధానమైతే మీకెందుకూ? నేను చెప్పినట్లు చెయ్యండి. గంటా అంటే సరిగ్గా గంటలో అన్నీ మాయమౌతాయి."

"చిత్తం. ఇదేదో చిట్కావైద్యం అనుకుంటా" అన్నాను మళ్లీ నేను. మళ్లీ ఇల్లాగ అనటం విని ఆయన విసుక్కొని, "ఏవైద్యమైతే నీకెందుకయ్యా? దక్షిణఆఫ్రికాలో నేను ఇటువంటివి ఎన్నో నయంచేశాను." అని అంటూ వెనక్కు తిరిగాడు. పెద్దవాడు చెప్తుంటే వాదించకూడదని నాకూ తోచింది. అందుకని "క్షమించండి డాక్టరుగారూ! అల్లాగే చేస్తాము. అయితే, పిల్లను సాంతం, ఒక పొట్లంలాగ బూడిదరంగు కాయితంలో చుట్టేయమంటారూ?" అన్నాను.

"ఆ."

"వేరే గాలేమీ తగలకూడ దన్న మాట!"

"ముక్కూ, నోరుకూ మటుకు కంతలు వదిలెయ్యాలి. సరిగ్గా అల్లాగ చెయ్యండి బిడ్డ వంటికి నొప్పిలేకుండా సన్నని దారం కాయితంపైన చుట్టండి."

"ఇంత ఎందుకూ, మిఠాయిపొట్లంలాగ పిల్లను ఆకాయితంలో చుట్టేయమంటారందుకూ?"

"అవునయ్యా" అని ఆయన విసుక్కున్నాడు.

"అయితే డాక్టరుగారూ! ఇంతేనా ఇంకేమైనా మందు ఇస్తారా?" అని అడిగాను.

"అవునవును. వేరే మందుకూడా ఇస్తాను. పిల్లను ఇల్లాగ పడుకోబెట్టి ఆసుపత్రికి రండి. మందు తయారుచేసి ఉంచుతాను. తెలిసిందా? వస్తాను"

అని ఆయన వెళ్లబోతుంటే నేను - "అయితే, సార్! ఇదేం జబ్బు అండీ? దీని పేరూ?" అన్నాను. కాంతం, అమ్మాయీ కూడా ఈజబ్బును ఏంపేరో తెలుసుకొందామని ఆసక్తిగా ఉన్నారు.

"జబ్బుపేరు నీకెందుకయ్యా? అయినా నీవు అడిగావు కాబట్టి చెబుతున్నాను. దీనిని ఇంగ్లీషులో ఇప్సో-ఫాక్టో-గ్రానికో-క్రిమాగో-సాంగ్‌టమ్-డామినిషో-కాలికో అంటారు"

అని ఆయన గిరుక్కున వెళ్ళిపోతుంటే నేనూ వీధిగుమ్మందాకా వెళ్ళి సాగనంపి వచ్చాను.

మా అమ్మాయి అంత పెద్దపేరు విని ముఖం చేటంత చేసుకొంది. "నన్ను పొట్లం లాగ కడతారా నాన్నా" అని అది చాలా సరదాపడటం మొదలుపెట్టింది. "ఇది వట్టి పిచ్చి వైద్యంలా గున్నదే" అన్నాను నేను కాంతం వంక తిరిగి.

"అల్లాగ అనకండి, చూద్దాం పోనీ. ఇందులో మనకొచ్చిన ఖర్చు ఏమీ లేదుగా" అంది కాంతం.

"లేకపోతేమటుకు ఏమిటీ పిచ్చి చేష్టలూ? బూడిదరంగు కాయితం కప్పట మేమిటి?"

"అల్లాగ కొట్టేయకండి. అందులో ఏమి మహాత్యం ఉందో. చూద్దాం పోనీ" అన్నది ఆవిడ.

"సరే, కానియ్యి" అన్నాను నేను.

ఈవైద్యవిధానం పిల్లకుమటుకు బాగా తృప్తిగా ఉంది. అది హాలులో ఎగురుతూ, "అక్కయ్యా! నాజబ్బుపే రేమిటే? చాలా తమాషా అయిన పేరు చెప్పాడాయన, ఏమిటనీ? నాకైన బూడిదరంగు కాయితం కప్ప రేం?" అంటూన్నది.

"మన ఇంట్లో ఏమైనా అల్లాంటి కాయితం ఉందా" అని నేను అడిగాను. కొద్దిగా ఉన్నట్లు తేలింది. అది ఒకకాలుకైనా సరిపొయ్యేట్లు లేదు. అందుకని బజారునుంచి ఒక అరవీసెడు కాయితం తెప్పించాను.

దానితరువాత ఆకాయితం దానిమీద కప్పాము. పిల్లలంతా సాయంచేశారు, ఒకరు కాయితం కప్పారు, మరొకరు ఎగిరిపోకుండా పట్టుకొన్నారు, ఇంకొకరు దానికాళ్ళకూ, వేళ్ళకూ, చేతులకూ గుండ్రంగా దారాలు పోసి చుట్టారు. మాచిట్టితల్లి బుట్టబొమ్మలాగ తయారైంది. పిల్లలంతా దాని చుట్టూ చేరి దాన్ని నవ్వించారు. ఇదంతా దానికో ఆటగా ఉంది.

"మీరంతా వెళ్ళిపోం"డని పిల్లల నందరినీ క్రిందికి పంపేశాను. దాన్ని మంచంమీద పడుకోబెట్టి, దానికి తోడుగా పెద్దదాన్ని కూర్చోమని నేనుకూడా క్రిందికి వచ్చేశాను.

"మీరు సీసాపుచ్చుకొని డాక్టరుదగ్గరకు వెళ్ళండి" అని నన్ను తరిమింది మా ఆవిడ. సరే నని నేను సీసా తీసుకొని వెళ్ళక తప్పింది కాదు.

నేను వెళ్ళేసరికి ఆయన మందు తయారు చేసి సిద్ధంగా ఉంచాడు.

నేను వెళ్ళటంతోనే ఒకమందుసీసా నాకిచ్చి "ఇది తీసికెళ్ళి ఇయ్యండి" అన్నాడు డాక్టరు. ఆసీసా ఒక పెద్దకూజాఅంత ఉంది. "ఇంతమందు ఎందుకండీ" అన్నాను. "ఇదంతా ఇవ్వాల" అన్నాడు. ఆమాట వినేసరికి నాకు నిజంగా అనుమానం గలిగింది—ఇది వైద్యమా, లేక మరేమన్నానా అని. "డోసు ఎంత అండీ" అన్నాను. "తాగినంత ఇయ్యండి" అన్నాడు. ఆమాటవల్ల నాకు అనుమానం ఇంకా ఎక్కువైంది.

ఇంతలో మేడమెట్లు దిగి ఎవరో వచ్చారు. ఆయన పచ్చగా, దబ్బపండులాంటి శరీరచ్ఛాయలో ఉన్నాడు. సూటు వేసుకొన్నాడు. అప్పుడే క్షవరం పూర్తిచేసుకొని

వచ్చాడేమో ముఖం నిగనిగలాడుతూ ఉన్నది.

ఆయనను చూచేసరికి ఈ డాక్టరుగారు ముడుచుకొనిపోయినాడు-మాస్టరును చూచి భయపడిన కుర్రవాడిలాగ. ఆ క్రొత్తగా వచ్చినఆయన "ఇక్కడ మీ కేంపని? పైనుంచి క్రిందికి రావద్దని చెప్పలేదూ మీకు? వెళ్లండి. వెళ్లండి మరి, తక్షణం" అని ఇంగ్లీషులో ఈయనను కోప్పడ్డాడు. నాకు మందిచ్చిన డాక్టరుగారు, అంతమనిషీ పిల్లి అయిపోయి, మెల్లగా జారిపోయినాడు. ఆ తరువాత ఆయన నావంక తిరిగి "ఏం కావాలండీ మీకు? ఎవరికోసం?"అన్నాడు. ఈ క్రొత్త మనిషి ఎవరో నాకు తెలియదు. కాని మా డాక్టరును కోప్పడటంచేత ఆయన కంటె గొప్పవాడైయుంటాడని ఆలోచించి, వినయంగానే అన్నాను — "డాక్టరుగారి కోసం అండీ" అని.

"ఏం కావాలె?" అన్నాడు.

"డాక్టరు జోసిఫ్‌గారి కోసం అండీ" అన్నాను.

"అవును నేనే; మరి ఏంకావాలో చెప్పండి" అన్నాడు ఆక్రొత్తమనిషి.

"మీరా అండీ" అన్నాను నేను ఆశ్చర్యంతో.

"అవును నేనే"

"చిత్తం. మరి ఆడాక్టరుగారు మీరు అసిస్టెంటు గాబోలు. ఆయన మా ఇంటికొచ్చి బిడ్డను చూచి మందు కూడా ఇచ్చాడండీ" అన్నాను.

"మందు కూడా ఇచ్చాడూ?" అని ఆయన ఆశ్చర్యంతోనూ, ఆదుర్దాతోనూ అడిగాడు.

"ఇచ్చాడు" అన్నాను.

"ఆమందు బిడ్డకేమైనా ఇచ్చారా?"అని ఆయన మరీ ఆదుర్దాగా అడిగాడు.

ఆ ప్రశ్నకు జవాబుగా నేను "లేదు" అని అనటం విని స్వస్థత జెంది, "యింకా అదృష్టవంతులు, ఆమందు యివ్వారుకారు" అన్నాడు.

"ఏమండీ?" అని అడిగాను నేను.

"ఆయన దక్షిణ ఆఫ్రికాలో కొన్నాళ్లుండి వచ్చాడు. ప్రస్తుతం ఆయనకు పిచ్చి ఎత్తింది. నేను ఆయనకు మందిస్తూ అట్టిపెట్టుకున్నాను." అని నవ్వాడు. నవ్వి" మీ అమ్మాయికి ఏంజబ్బూ?" అని ప్రశ్నించాడు.

"వంటినిండా ఎర్రని దద్దుర్లు పోస్సినైయండీ. భయంకరంగా ఉన్నాయండీ" అన్నాను నేను.

"ఊఁహు" అని డాక్టరు విని ఊరుకున్నాడు. "దురదా, మంటా కూడా ఉందని అంటుందండి" అన్నాను నేను, మళ్లీ. నా మాటలు విని, "ఎప్పుడైనా ఇల్లాగ రావటం కద్దా ఆ బిడ్డకూ?" అన్నాడు.

"ఎబ్బే, ఎప్పుడూ లేదండీ" అన్నాను నేను.

"అయితే, ఆబిడ్డ తల్లితండ్రులకు కాని, మరి మీ కుటుంబంలో ఎవరికైనా కాని ఇల్లాంటి దద్దుర్లు తరుచు రావటం కద్దా?"

"ఎబ్బే, మే మెవ్వరమూ ఎరగమండీ. ఇదేదోతమాషాగా ఉందండీ"అన్నాను నేను.

డాక్టరు బాగా ఆలోచించి "ఎర్రనిదద్దుర్లా? సరే, నడవండి చూద్దాము." అని ముందుగా నడిచాడు.

పదినిమిషాల్లో ఇంటికి వచ్చాము. డాక్టరుగారిని మేడపైకి తీసికెళ్లాం. పిల్ల పడుకొనే ఉంది. బూడిదరంగుకాయితం చెక్కుచెదరకుండా ఉంది.

"ఈ బిడ్డకేనండి" అన్నాను అమ్మాయిని చూపుతూ. "ఇదంతా ఏమిటి? ఈ కాయితం చుట్టారేమిటి?" అని అడిగారు డాక్టరుగారు.

"ఆయన ఇల్లాగ చుట్టమన్నారండీ. చుడితే దద్దుర్లు పోతయ్యి అన్నాడు" అన్నాను నేను. డాక్టరుగారు పెద్దగానవ్వాడు. నేనూ నవ్వాను.

"సరే, కాయితాలు తీసివెయ్యండి చూద్దాం" అన్నాడు డాక్టరుగారు.

దారాలన్నీ ఊడదీసి, కాయితాలన్నీ ఒక్కొక్కటే తీసివేశాము. తరువాత డాక్టరుగారు పిల్లదేహ మంతా పరీక్షించారు గాని ఎక్కడా ఒక్కదద్దురైనా లేదు.

"ఏమండీ, అంత ఆదుర్దాపడ్డా రెందుకూ? పిల్లఒళ్లు బంగారంలా గున్నది ఏమీ లేదే" అన్నాడు. నేనూ చూశాను. ఒక్కదద్దురైనా లేదు. మా ఆవిడా చూచింది. వళ్లు నిగనిగలాడుతుందేగాని ఒకదద్దురైనా లేదు. మాపిల్ల లంతా చూశారు. దద్దురన్నమాటలేదు. మేమంతా తెల్లపోయి "పోయినాయండీ, దద్దుర్లన్నీ మాయమైనవి" అన్నాము. "ఎల్లాగ పోతయి, కాయితం చుడితే పోయే జబ్బుకాదే ఇది?" అన్నాడు డాక్టరు. అని, నిజంగా చాలా ఆశ్చర్యపోయినాడు.

"ప్రొద్దున మీరు చూచినపుడు నిజంగా ఉన్నవా దద్దుర్లూ?"

"అయ్యో, ఉండకపోవటం ఏమిటండీ! ఎర్రగా వంటినిండా ఉన్నాయి. నాకళ్లతో నేను చూశాను. మాఆవిడ ఆమెకళ్లతో చూచింది. పిల్ల లంతా చూశారు. ఇరుగూ పొరుగూకూడా చూశారు. కావాలంటే అందరిచేతా సాక్ష్యం ఇప్పిస్తాను. ఉన్నమాట నిజం. మరి ఇప్పుడు కనిపించటంలేదు. మీ పేసంటు తానే డాక్టరు నని మాకు చెప్పి చాలా తమాషా చేశాడండీ. బూడిదరంగు కాయితం చుడితే గంటలో మాయమౌతాయన్నాడు. అక్షరాలా ఆలాగే జరిగింది."

"సరే, కానీండి. ఎల్లాగయితే నేం, మీకు ఆదుర్దా తీరింది. సరే. యిక నేను వెళ్లుతాను" అనిఅంటూ ఆయన బయటికి దారితీశాడు. నేనూ కొంతదూరం ఆయనతో నడిచి "ఆ, ఎల్లాగు పోయినాయండీ ఆదద్దుర్లు, మందూ మాకూ లేకుండానూ" అన్నాను.

ఆయన ఏదో నీళ్లు నమిలి చప్పరించి ఊరుకొన్నాడు. నేను ఇంటికొచ్చి మొదట వచ్చిన ఆయన డాక్టరుకాదనీ, పిచ్చిఎక్కిన పెద్దమనిషి అనీ ఆసంగతులన్నీ చెప్పాను మా ఆవిడతో. కాంతం సంగతి అంతా విన్నది.

"అయితే ఇందాకా వచ్చి మన అమ్మాయికి ఆ దద్దుర్లన్నీ పోయే ఉపాయం చెప్పిన ఆయనా...??"

"ఆయన డాక్టరు కాదు, పిచ్చివాడు. ఇప్పుడొచ్చిన ఆయన డాక్టరు." అని విశదంగా చెప్పాను. అంత విడదీసి చెప్పినా మా ఆవిడకు అర్థం కాలేదట.

"ఏమోనండీ, ఇందులో ఎవరు పిచ్చివాళ్లో అన్న సంగతిలో మీరు చెప్పిన మాటలు నేను నమ్మలేకుండా ఉన్నాను" అన్నది మా ఆవిడ వెంటనే.



తిరువనంతపురములోని పద్మనాభస్వామి ఆలయతటాకాలు

# అయ్యలరాజు కవిత్వము

[రకరకాల పణాలతో బహిరంగసభలయందు కవుల వాదనలు—భట్టుమూర్తి అయ్యలరాజుల మధ్య తగాదా—ఉభయుల కవిత్వాల తారతమ్యములు—అయ్యలరాజు కవిత్వములోని అందాలు—ఆయన రచనలోనిస్వాతంత్ర్యాలు—ముద్దు పళనికవిత్వములోని కమ్మదనము]

శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి

అయ్యలరాజుకవిత్వం అంటే రామభద్రకవి కవిత్వమన్నమాట. యీమహాకవినిగూర్చి "రామరాజవిభూషణరత్నఖచిత, చారుమస్తకలాపాదిహారివాక్య, గౌరవము పెక్కుభంగుల గణన చేసి" అని అప్పకవి ప్రశంసించాడు. రామరాజభూషణుఁడంటే వసుచరిత్రగ్రంథకర్త. అతనికిన్నీ, యితనికిన్నీ యేదో వాదం వొచ్చి అతణ్ణి అయ్యలరాజు వోడఁబుచ్చి అతని శిరస్సుమీఁద వుండే మణిభూషణాన్ని సభలో లాగినాఁడని లోకప్రవాదం వొకటి వుంది. యింకా కొందఱు మణిమయూలంకారంమీఁద తన్నినాఁడని చెప్పడమున్నూ వుంది. వోడిపోతేమాత్రం తన్నేడ మెందుకంటారేమో? ఆ వాదానికి ప్రారంభంలో ఆ విధమైన పందెం పెట్టుకోవడంచేత అలా జరిగిందనుకోవాలి. అయ్యలరాజు వోడిపోతే అతఁడేం చేయవలసి వుండేదో ఆ తపిసీలు విన్నట్టు లేదు. యీలాటి పణాలు పెట్టుకొని సభలలో కవులు వాదించుకోవడం పూర్వకాలంలో వుండడానికి యెన్నో గాథలు జనపరంపర చెప్పకుంటూ వుంటుంది. "పసులఁ గొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టుకంచుఢక్క" మొదలైనగాథలు కొన్ని యథార్థాలుగానే కనపడతాయి గాని కొన్ని పుక్కిటిపురాణాలు కూడా వుంటాయి. సంస్కృతనైషధాన్ని రచించిన శ్రీహర్షుని తండ్రి శ్రీహీరుఁడికిన్నీ, మేనమామ (పేరు తెలియదు)కున్నూ వాదోపవాదాలు జరగడమున్నూ, అందులో శ్రీహీరుఁడు వోడిపోవడమున్నూ, ఆవాదంలో మొదట నిర్ణయించుకున్న ప్రకారం తన స్యాలకుని బంగారుపావుకోళ్లు శ్రీహీరుఁడు తన దేవతార్చనపీఠంలో ఆసాదించి సాలగ్రామాలతోపాటు ఆరాధించవలసిరావడమున్నూ, ఆయీ అవమానాన్ని శ్రీహర్షుఁడు తనతండ్రి జీవితానంతరం తన మేనమామని జయించి పోఁగొట్టడమున్నూ పండితులు చెప్పకోవడం అంతా యెఱిఁగిందే. అయీ గాథలలో కొన్ని నిజాలైనా, కొన్ని అబద్ధాలైనా వీట్లవల్ల తేలే సారాంశం ఆరోజుల్లో వోడిపోయిన పండితులు తమ వోడును వొప్పుకోవడమే వుండేది గాని "కిందఁబడ్డా మీఁదవాఁడనే" అని పరాక్రమించడం వుండేదికాదని తేలుతుంది. యింకా పూర్వకాలంలో యెవరేనా తప్పుచేస్తే ఆతప్పును ధర్మజ్ఞులతో స్వయంగా వచ్చి చెప్పకోవడమున్నూ, వారు విధించిన శిక్షను అనుభవించడమున్నూ వుండేదఁట!

ఆరోజుల్లో వుండే రాజులు క్షత్రియులు, వేదశాస్త్రానుయాయులు. పైఁగా వారిలో అందఱూ కాకపోయినా కొందఱేనా మహాకవులు, మహావిద్వాంసులు. ఆయీ భాగ్యం మనదేశానికి అంతరించి యెంతోకాలం

కాలేదు. సుమారు నలభైయేళ్లు కావచ్చింది. శ్రీవిజయనగరప్రభువు శ్రీమదానందగజపతి తర్క-వ్యాకరణాలలో దిగ్గజాలవంటి పండితులు వాదించుకుంటూ వుంటే మాధ్యస్థ్యం చేసి, జయాపజయాలు నిర్ణయించి జయించినవారికి వెండిచెంబులూ, బంగారుభూషణాలూ బహుమానించడం బహుమంది యెఱిఁగిందే. యింకా యిప్పటికి ఆలా బహూకరింపఁబడ్డ పండితులబాపతు శేషం ఆ ప్రాంతంలో నిల్చి వుంటే వుంటుందేమో? వారు వుండకపోయినా ఆ పదార్థాలను అనుభవిస్తూ వున్న ఆవంశీకులు వుంటారు. యీ మహారాజుదర్శనం మేము స్వయంగా చేసే వున్నాము. మమ్మల్ని "శ్వపుచ్ఛమవనామితం" అనే భర్తృహరిశ్లోకంలో "శ్వపుచ్ఛం" అనే చోట "శేషపుచ్ఛలాంగూలేషు శునః" అనేసూత్రం యెందుకు ప్రవర్తించదో చెప్పవలసిందని ప్రశ్నించినది యీవిద్వద్రాజశిఖామణియ్యేనే. ఆ భాగ్యం మళ్లా యెప్పుడేనా భవిష్యత్తులో పట్టితే పట్టుతుందేమో గాని ప్రస్తుతం లోపించినట్టే అని విచారిస్తూ వుండఁగా "ఫర్వా లేదు నేను వున్నాను" అని జయపురప్రభువు అభయహస్తం యిచ్చినట్టు ఆయీవిద్వత్ప్రభువు చేయుచున్న పండితకవిసత్కారాలవల్ల వెల్లడి అవుతూవుంది. యీయన సంస్కృతాంధ్రాలలోనే కాక వారిమాతృభాషా వోఢ్రంలోకూడా మంచి కవి.

విషయం విషయాంతరంలోకి దూఁకింది. అయ్యలరాజు భట్టుమూర్తితో వాదించి నెగ్గడం మనకు ప్రస్తుతం. యేదోవొక శబ్దందగ్గిరో, అర్థందగ్గిరో భట్టుమూర్తి ప్రస్తుతకవికి వోడిపోయినంతలో తక్కువవాఁడని ప్రాజ్ఞులు అనుకోరు. ఇద్దరున్నూ మహాకవులే; పండితకవులే. యిద్దరికీ శ్లేషంటే యిష్టమే. కాని వసుచరిత్రశ్లేష ప్రయత్న పూర్వకంగా సమకూర్చినట్లు వుంటుంది. ఆకారణంచేతనే, సర్వే సర్వత్ర కాకపోయినా కొన్నిచోట్ల చదువరులకు కొంచెం విసుగు పుట్టిస్తుంది. యెప్పుడూ కవి వర్ణించే విషయం కొంత కష్టం చేయడంలోనే సొగసు కనిపిస్తుందిగాని విపులం చేయడంలో సొగసంతగా వుండదు. చూడండీ—మనుచరిత్రలో చాతుర్వర్ణ్యాన్ని "అచటి విప్రులు మెచ్చరఖిలవిద్యాప్రౌఢి ముదిమదిదప్పిన మొదటివేల్పు" అని యెత్తుకొని వొక్కొక్క చరణంలో వొక్కొక్క వర్ణాన్ని ముగించాఁడు. వసుచరిత్రలోనో? వొక్కొక్క వర్ణానికి వొక్కొక్క పద్యంచొప్పున విస్తరించాఁడు. వసుచరిత్రలో స్వప్రయత్నశ్లేషలే కాక అప్రయత్నశ్లేషలున్నూ బోలెఁడు వున్నాయి; తేలికలో ముగించిన భాగాలున్నూ వున్నాయి. వున్నప్పటికీ ప్రతీవిషయాన్నీ విపులంచేయడమే అతనికి యిష్టం. పాండిత్యంలో వసుచరిత్ర కవిని రామాభ్యుదయకవి జయించినట్టు ప్రతీతయితే వుందిగాని రామాభ్యుదయానికి యితని కవిత్వానికి వచ్చినంత వ్యాప్తి రాలేదు. రసవంతం కాదేమో అంటే, యెంతో రసవంతంగా వుంటుంది. చూడండీ వొక పద్యం—

"సీ. ఎంత గడ్డం బైన వింతలే దొసపరి
తీరుగా బవిరి దిద్దింపవచ్చు,...

తే.గీ. కోరసిగ వేయుచోటనే కొప్పు పుట్టి
చెలిచినది గాని యెంతేనిఁ జేయవచ్చుఁ
గడపట భుజంగవేషంబు వడసినప్పు
డుండుఁబో గంతుమీఱి యిమ్మిండతపసి."

ఋష్యశృంగుణ్ణిగూర్చి వేశ్యలు వేళాకోళంగా అనుకొనేమాటలు యెంతఔచిత్యపోషకంగా, యెంత జాతీయంగా వున్నాయో చూచారా? ఆఘట్టంలోదే మఱోపద్యం—

"ఉ. చాఁగలుదేరు మంజులకు
చంబులు హృద్యము లిందు ముఖ్యముల్
పాయనిసౌఖ్య మీఁగలుగు
పాటిరుచుల్ దఱుకొత్తుమోవిపం
డ్లేయెడ లేని ద్రవ్యము ల
భీష్టము లైనవి యిందు నందుకొ
మ్మీయిమునీంద్రచంద్ర యని
యుత్పలగంధు లొసంగి రయ్యెడన్."

యీపద్యంలో తనుమాత్రం తేలికలోనే తెలుసుకొనే శ్లేష వుంది. విశేషంగా యితేఁడు శ్లేష వాడినట్టు కనపడుతుంది గాని దానికోసం ప్రయత్నించినట్టుండదు.

"చ. బలియుఁడ నీరయోదాటమునఁ
బక్షినిగాఁ బ్రతిపక్షవృత్తి నీ
తల లవనీతలంబునెడఁ
దాళఫలాకృతి రాల లీలమై
జలజల డుల్తు నిల్తు నని
చక్కఁ బతంగకులీనుభార్య ని
ర్మలతరచర్య డించి చను
మా! మనుమా! మనజాళనాథమా!"

యీమాటలు జటాయువు రావణుణ్ణిఁగూర్చి పల్కినవి. యిందులో పతంగశబ్దము "పతంగః పక్షి సూర్యయోః" అని వుంది కనక పక్షికులసంజాతుని భార్యను చెఱఁబట్టిన నిన్ను నేను పక్షినై వుండి యెట్లు వూరకుందును అని వ్యంగ్యార్థము. అసలర్థం సూర్యవంశస్థుని భార్యను అన్నది. యింతతేలికలో వసుచరిత్రకూడా కొన్ని శ్లేషలు వాడింది.

"తే. గీ. విమలమధురమనోహరవృత్తి పెలయు
వారిఁ బోఁడగన బుధు లెంతవారలైనఁ
బోవుదురు గాన నేను నీపొంకు దలఁచి
దవ్వనక వచ్చితి నశేషతాపశమని."

యిందులో వారిశబ్దముమాత్రమే శ్లిష్టం. ఏకొక్కప్డు సంస్కృతపదం, వేఱొకప్డు అచ్చతెలుఁగుపదం. ఈలాటి శ్లేషలు శ్లేషలే కావు. అంటే, నిఘంట్లు దగ్గిఱ పెట్టుకొని పాట్లఁ బడితేగాని పద్యార్థం తెలియకుండా చేసేవి కావన్నమాట. విజయవిలాసప్వోకడ అంతా యీమాదిరిదే.

(౧) రామరామా యటంచు నారాజసుతుఁడు, కృష్ణ కృష్ణా యటంచు నాకీరవాణి, (౨) మరుఁడో యనఁగా నరుఁ డుండె, (౩) మలయజగంధిమండలను నేలె—ఇత్యాదులు విజయవిలాసప్వోకడలు.

ఇతని శబ్దాలంకారాలుకూడా అప్రయత్న సిద్ధాలుగానే వుంటాయి— క. "విూ రింద్రప్రస్థము గనినారా?... అందంద నరుగ నరుఁ గానరుగా?"

రామాభ్యుదయంలో విశేషించి యీలాటి శబ్ద పొందిక వున్నది—

"క. ...రా జిల్లుఁ జేర్చె దీప్తిక్
రాజిల్లుమణీమయాసనం బిడి కూర్మిక్.

క. ...ఇపు డ, య్యసురహితుఁ బంక్తికంధరు
నసురహితుం జేయుదునుక్

క. పాలింపు మిజ్జగంబులఁ
బా లింపుగఁ ద్రావి చలము వాటింపకు మా
పాలింటివాఁడవై రే
పా లింటికి వచ్చినప్పు డరయుము మమ్మున్."

ఇందులో నాల్గోచరణంలో వున్నసొగసు కేవలస్వభావోక్తి. చంటిపిల్లలనుగూర్చి "నీపెళ్లాం వచ్చాక మాయందు నీకు భక్తిప్రపత్తు లుంటాయా? మేము నీకు జ్ఞాపకం వుంటామా?" అంటారు. దాన్నే కవి అనుసరించాఁడు. శబ్దాలంకారంతో పోషిం చాఁడు—

"క. శీతలతాన్వీతలతా
జాతలతాంతాతిసురభి జంబీరజపా
చూతలవలీ—"

యీలాటి పదాలపొందిక గల పద్యా లెక్కడ పడితే అక్కడే కుప్పతెప్పలు. యిఁక సంస్కృత సమాసా లందుకొంటేనో, నల్లేరుపై బండి.

"సీ. తాపసోత్తమదత్త దర్భచర్వణమత్త
కుంభత్కురంగికాడింభకంబు"

సంస్కృతంలో యితని కెంత స్వాతంత్ర్యం వుందో తెలుఁగులోనూ అంతే వుంది. యితనికేకాదు, వెనుకటికవు లందఱికీ యీశక్తి యిలాటిదే.

"సీ. బల్లిద్రాఁచురాచకూనలు వోలె నిగనిగ
జడిగొన్న నిడుదకెంజడలు గదల"

యీపద్యం పద్యమంతా యిదేశైలిలో నడిచింది. తత్సమపదాలు స్వల్పంగా వున్నాయి. ఒకొక్కొక్క చోట రెంటుభాషలకూ మైత్రి కల్పుతాఁడు.

"క. నీలోపల వెగడొందకు, నీలోపలచికుర!

క. వేదాదుల నెడఁ బాయఁడు
వేదాదుల మరగినాఁడు వీఁ డౌరా!"

యీ మాదిరిపద్యాలు పెక్కులు.

యీపద్యద్వయంలో మొదటిదాని పూర్వార్థం భాగవతకవిత్వమార్గదిగిగా వుంటుంది.

"......వీని నేలం గూలన్
దూలింతు నొక్కకోల న
రాళతరక్రోధు సాపరాధు విరాధున్.

చ. దొరసి ప్రభాసురం గొరుఁ జ
తుర్దశలోకధరున్ మహాత్ము నే
కరణిని గోసలేంద్రసుత
గాంచెనొకో యని, నాభిపంకజాం
తరమునఁ జిక్కుబ్రహ్మలఁ
గనంగలవేల్పున కెట్లు బొడ్డుగో
సిరొ యని పల్కిరర్యమకు
చిన్ రఘునందనుఁ జూచి చూపరుల్."

యీపద్యంలో వున్న సొగసుమాదిరి సొగసులు యితనికవిత్వంలో సర్వత్రా వుంటాయి. యీపద్యంలో తుట్టతుదను వున్న 'చూపరుల్' అనేశబ్దాన్ని (బహుమహాకవిసమ్మతమైనదాన్ని) తప్పనుకొనే వారికి యితని కవిత్వం రుచిస్తుందో లేదోగాని తక్కిన విద్వత్కవుల కితఁడు శిరోధార్యుఁడు కదా!

"అకట! నా కిపు డొక్కవర్షాగమంబె
పెక్కువర్షంబులై తోఁచె."

చూచారా, యీశ్లేష యెంతసుళువుగా నెఱవేఱిందో? యిట్టి మంచికవిత్వానికి లోకంలో వ్యాప్తిమాత్రం చాలా తక్కువగానే వుంది. ప్రాచీనపు తెలుఁగుగ్రంథాలలో నన్నా భారత భాగవత రామాయణాల తరవాత మనువసుచరిత్రలకే కనపడుతుంది ఎక్కువవ్యాప్తి. సంస్కృతానికి పంచకావ్యాలనేవి రఘువంశ కుమారసంభవ మేఘసందేశ భారవి మాఘాలలాగ తెలుక్కి విజయవిలాస, మనుచరిత్ర, వసుచరిత్ర, రాఘవపాండవీయ, ఆముక్తమాల్యదలు ఆలాగే యేర్పడ్డాయి. సంస్కృతంలో పంచకావ్యపఠనానంతరం "నైషధం విద్వదౌషధమ్" అని చెప్పి నైషధాన్ని పఠిస్తారు. తెలుఁగులోకూడా క్వాచిత్కంగా శ్రీనాథుని నైషధాన్ని పూర్వం చదివేవారేమో? యిప్పుడంతగా దాన్ని పాఠంగా చదువుతూ వున్నట్టు లేదు. దాన్నే కాదు, విజయవిలాసాదులుకూడా చదివేవారు కనపడరు. విజయవిలాసానికి టీక లేదుగాని తక్కిన వాటికి సంపూర్ణవ్యాఖ్యానాలే వున్నాయి. కాని సంస్కృతాంధ్రాలలో మంచిప్రవేశం వుంటేనే తప్ప ఆయాగ్రంథాలు వ్యాఖ్యానసహాయం వున్నా అవగతం కావు. వ్యాఖ్యానం చూచేటప్పటికి మూలం మఱుపు తగులుతుంది; మూలం చూచేటప్పటికి వ్యాఖ్యానం మఱుపు తగులుంది. సంస్కృతభాషాప్రవేశం అంతో యింతో వున్నవాళ్లకితప్ప మనువసుచరిత్రలు గాని, తదితరాలుగాని అవగాహన కావు. సంపూర్తిగా ఆయా ఆంధ్రకావ్యాలు సవ్యాఖ్యానంగా పాఠం చెప్పిన గురువులుగాని, చదివిన శిష్యులుగాని మా రోజుల్లో వున్నట్టు నేను చూడలేదు.. గ్రంథారంభపద్యాలు పూర్తిచేసి కథారంభానికి వస్తే అక్కడికి అదే గొప్ప. స్వయంగా చదువుకోతగ్గ సాహిత్యజ్ఞానం వున్న వాళ్లల్లోకూడా ఆయాగ్రంథాలు సంపూర్తిగా చదివిన వాళ్లు యెందఱో వుండరు. ఆయాసందర్భం ముఖ్యంగా వసుచరిత్రకూ, ఆముక్తమాల్యదకూ అనువర్తిస్తుంది. యేమైనా పట్టుమని పదిపద్యాలు నోటికిరావడం ఆయా పుస్తకాలలో నేకాని యితరగ్రంథాలలో కనపడదు. ఆయా రామాభ్యుదయంలోదంటూ వొకపద్యమూ నోటికి వచ్చినవా రెక్కడా కనపడరు. ముక్కుతిమ్మన్నగారు వ్రాసిన పారిజాతాపహరణాని కున్నంత వ్యాప్తిగాని, ధూర్జటి వ్రాసిన కాళహస్తి మాహాత్మ్యాని కున్నంత వ్యాప్తిగాని దీనికి వున్నట్టులేదు. పుణ్యకథకాదా, కవిత్వం రసవంతం కాదా, అంటే ఆలాంటిలోపం కనపడదు.

"మ. కొడుకు న్నొచ్చి దశాననుం డనిలజున్
గోపమ్ముతోఁ జూచి 'యే
యడవిన్ ద్రిమ్మరుచుండుకోఁతివిర రా
రా! యెవ్వ డంపంగ ని
క్కడికిన్ వచ్చితి వేల చొచ్చితివి లం
కారాజధానిన్ నిజం
బడుగం జాచెద నంతయున్ దెలియ నొ
య్యన్ జెప్పరా!' నావుడున్"

యీపద్యం పురాణపాకంలో నడిచింది. రావణుఁడు ప్రభులక్షణముంతా పుట్టిపడేటట్టు ఆంజనేయుణ్ణి ప్రశ్నిస్తూన్నాఁడు. యిప్పటికాలపు విమర్శకాభాసులు యీపద్యంలో 'చెప్పు' (పాదరక్ష) వచ్చిందని వ్రాస్తారేమో అని భయపడవలసిందేగాని యింకెందుకూ శంకించవలసింది లేదు. గ్రంథంలో యెక్కడా చెప్పుధాతువే ప్రయోగించకూడ దనుకోవడంకన్న ప్రమాదం వుండదు. యింతటి ప్రబుద్ధులను భగవంతుఁడు అక్షరాస్యుల నెందుకు చేయాలో అనుకుంటూ వుంటాను న్నేను. తత్తథాస్తాం.

"చ. అనిలజుఁ డోరి రావణుఁడ!
అల్లన నేటికి బెట్టు చెప్పెదన్
విను రఘురాముదూత, నర
విందహితాత్మజుమంత్రి, నేఁ బ్రభం
జనతనుజాతుఁడన్, జనక
జన్ వెదకన్ జనుదెంచి కాంచితిన్
నను హనుమంతుఁ డండ్రు భువ
నంబులు మా కిల నెల్లకొనలున్"

యివన్నీ పురాణపాకపద్యమే. వోకపాకమేమిటి, స్వయంపాకం తప్ప తక్కిన పాకాలన్నీ యీ అయ్యలరాజువారి కవిత్వంలో కనపడతాయి.

"ఉ. ఎక్కడివారు మీరు జగ
దేకమనోహరు లుగ్రకాననం
బిక్కడి కేల వచ్చితిరి?
యీజటివేషము పూన నేమి? యీ
యెక్కటిజోదు బాగులు వ
హించితి రేల? వెలుంగఁ జేయు నల్
దిక్కులు మీశరీరపటు
దీధితి చోద్యము తెల్పుఁ డిన్నియున్."

యీపద్యాన్ని యెందుకు వుదాహరించా నంటే దీని రెండోచరణంలో మధ్యమపురుషకారానికి సంధి చేయకుండా వుండడాన్ని గూర్చి కొంచెం విచారిద్దామనియ్యేవే. అచ్చుపొరఁబాటు కాదు. ఏకదేశపతితమున్నూ కాదు. ఎన్నిచోట్లనో యీకవి దీన్ని విసంధిగానే వాడి వున్నాఁడు. ఆచోట్లు కొన్ని వుదాహరించి మఱీ చర్చిస్తాను.

౧. "అ, సూనులఁ జేసితివి యిట్టి సూక్తులు చాలున్."

౨. "ఏ, లా చెడుత్రోవపట్టితివి యామునవంశమునన్ జనించియున్."

యింకా మఱికొన్ని మధ్యమపురుషకారానికి సంధిచేయని చోట్లు చూచినట్టే జ్ఞాపకంగాని యిప్పుడు మూఁడుచోట్లుమాత్రమే కనపడ్డాయి. యీలాటివి కనపడితే యిప్పటిసంస్కర్తలు కవి యేదో తెల్వితక్కువపని చేసినట్టున్నూ, లేదా ప్రమాదపడినట్టున్నూ అది క్షంతవ్యంగా చదువరులు భావించి అనుగ్రహించవలసినట్టున్నూ కొన్ని మాటలు ఆగ్రంథపీఠికలలో వ్రాస్తూ వుంటారు. యీలాటి కవి అసకృదావృత్తిగా వాడిన ప్రయోగానికి అట్టిదుర్గతిని పట్టించడానికి నే నిష్టపడేది లేదు. యీప్రయోగం యితఁడుమాత్రమే వాడి వున్నాఁడా? కవికర్ణరసాయనగ్రంథకర్తకూడా వాడివున్నాఁడు. భాగవతం సరేసరి. విషయమేమేనా గురవగాహంగా వుండేదేమో అంటే, కంతికూస కూడా తెలిసేది. "మధ్యమపురుషకారమునకు సంధి నిత్యము"-పూర్వోదాహరణాలకు సంబంధించిన కవులు యీసూత్రాన్ని కూడా అర్థంచేసుకోలేనివారా? అంతటితప్పుమాట యేవిశాలహృదయుఁ డనఁగలఁడు? అందుచేత యీ సంధ్యభావము శ్రవణకటువుగా వుండకపోవడంచేత యిందఱు మహాకవులు పై సూత్రాన్ని పాటించలే దనిన్నీ, ఆకారణంచేత ప్రథమపురుషకారంతో పాటు దీని కూడా వైకల్పికత్వం అంగీకరించి వ్యాకరణాన్ని సవరిస్తే బాగుంటుం దనిన్నీ నేను చెప్తాను. ఉకారానికి సంధిని మానితే వున్నంత శ్రవణకటుత్వం దీనికి కనపడడం లేదు. ప్రథమపురుషకారం (పలికిరి + అనఘులు, పలికిరి యనఘులు) సంధిని పొందకపోతే యెంత శ్రుతికటువుగా వుంటుందో, మధ్యమపురుషకారం (వచ్చితిరి + యీజటి)సంధిని పొందకపోయినా అంతే అని నాకు తోస్తుంది. అనఁగా ఉభయత్రా కూడా శ్రవణకటుత్వం లేనేలే దని నేను అనుకుంటాను. వస్తుతః సంధులు శ్రవణసుఖానికే పుట్టి వుంటాయి. కాని కొన్నిచోట్ల శ్రవణసుఖరో మా టాలా

వుండఁగా విపరీతార్థాన్ని తెచ్చిపెడతాయి. అలాటి చోట్ల విసంధిగానే వ్రాయడం యుక్తమని (యీ మాటను వైతండికు లంగీకరింప రని నాకు తెలుసును) నాఅభిప్రాయం. అలాటిస్థలాలు కొన్ని చూపుతాను– (౧) నాకుఁ దనుజుఁ డతండు (౨) నాకుఁ జారుఁ డతండు. యీలాటిచోట్లనే సంధి విపరీతార్థకదోషాన్ని తెచ్చిపెడుతుంది. సంధిచేసినప్పుడూ, చేయనప్పుడూ కూడా అర్థం స్ఫురించే పదాలవల్లనే యీచిక్కు కలగడం. భవతు.

వొకమంచికోసం చేసే పని వేఱొక చెడుగును ఆపాదించడం సర్వానుభవసిద్ధమే. మధ్యమ పురుషేకారసంధినిత్యతావిషయంలో యింకోమాట వ్రాయాలి. ఆయీక్రియకు రెండురూపా లున్నాయి యేకవచనంలో (నీవు వండితివి, నీవు వండితి). ఇందులో మొదటిరూపానికి సంధి చేస్తే శ్రవణకటువుగా వుండదు(వండితివి + ఈవు=వండితివీవు). రెండోదానికి సంధిచేస్తే శ్రవణకటువుగానే వుంటుంది (వండితి + ఈవు=వండితీవు). సమానాచ్చరకత్వంలోకంటె అసమానాచ్చరకత్వంలో ఈతుట్టతుదిదానిసంధి యెక్కువ కటువుగా వుంటుంది (వండితి + అనఘుఁడవు=వండితనఘుఁడవు). యీకష్టసుఖాలన్నీ పరిశీలించి కవి రచన సాఁగించడం అసంభవంగాని వొక్కొక్కని నోటంట కటుత్వదోషానికి విశేషంగా తావుండదు. ఛందోమయమైన కావ్యంలో అసలే ఆదోషానికి అవకాశం వుండ దని చెప్పడం పొసఁగదు. వచనంలో ఆయీ పీడ కవకాశం లేకుండా ధార నడిపించడానికి యేమాత్రమూ జంకవలసివుండదుగాని కొందఱి రచన వచనంలోకూడా పద్యంలోకంటె యెక్కువ పవడుగా వుంటుంది. దాని క్కారణం నిరూపించడానికి మనవశంకాదు. అది దృష్టం కాదు గనకనే దానికి అదృష్టమని నామకరణం వచ్చింది. తత్తథా஽స్తామ్.

మధ్యమపురుషసంధి మానడం యీ మహాకవి ప్రమాదంగా కాక బుద్ధిపూర్వకంగా అసకృదావృత్తిగా చేసివుండడం వల్లనేమి, యితనికంటె పూర్వుఁడు పోతరాజుగారున్నూ, తరువాతివాఁడు కవికర్ణరసాయనకవి లోనైనవారున్నూ బాహాటంగా దాన్నే అనుకరించడంచేతనేమి అది దోషం కాదనిన్నీ, యిటీవల లక్షణగ్రంథకర్తలు ఆయీవిషయం పరిశీలించకపోవడమే దోషమనిన్నీ నే నభిప్రాయపడతాను. పరిశీలించే వున్నట్టయితే వీట్లఁగూర్చి హేరో అచ్యుతో వ్రాయవలసి వుండేది. కూచిమంచి తిమ్మకవి బహుప్రయోగద్రష్ట కనక యీవిషయం తెలుసుకొని దీనికి తనసమ్మతిని చూపివున్నాఁడు. తిమ్మకవిదరిమిలా వ్యాకర్తసూరిగారు తిమ్మకవిమతాన్ని పాటించకపోవడం శోచ్యం. బహులక్ష్యలక్షణవేత్త అప్పకవి ప్రథమపురుషేకారానికిఁ గూడా వైకల్పికత్వాన్ని వొప్పక యేదో మాటుతోవను పడ్డాఁడు. ఆపద్ధతిని భారతమంతా పొల్లు గావలసివస్తుంది. పొరఁబడ్డవాళ్లూ వుంటారు, పొరఁబాట్లూ వుంటాయి (భ్రాంతేః పురుషధర్మత్వాత్). కాని యీవిషయంలో అప్పకవిపడ్డ పొరఁబాటు భారతం యావత్తుకూ వుద్వాసన చెప్పేదిగా పరిణమించడంచేత మిక్కిలీ శోచ్యం. యిటీవల నిన్నమొన్న కల్లూరివారు దీన్నిగుఱించి కొంత చర్చ వ్రాసి ఆయీప్రయోగాలు 'అనాకరంబులు' అంటూ తేల్చారు గాని వారు యిన్ని ప్రయోగాలు యిందఱు దిగ్దంతులు వాడివున్నారని కనిపెట్టినట్టు లేదు. కనక అవసరమైతే వ్యాకరణాలు సవరించుకోవలసిందేగాని ఆయీప్రయోగాలు దిద్దరానివి కావడంచేత తోసివేయఁదగ్గవి కావని నే నభిప్రాయపడతాను. చిరకాలంనాఁడే "విలువగల కవులకుక్ష్యమ్ములె తా మీభార మెల్లమోయఁగవలయున్" అని నేను దేవీభాగవతపీఠికలో వ్రాసివున్నాను. నేను దీన్నిగూర్చి వుదాహరించిన మహాకవులకంటే విలువగల కవు లెక్కడ దొరుకుతారు ? యిట్టి మహాకవుల లక్ష్యాలు (ప్రమాదప్రయుక్తాలు కావు; బుద్ధిపూర్వకాలు) తోసివేసి వ్రాసే వ్యాకరణాలవల్ల తేలే సారాంశం "త్రిదోషహరం తిప్పతీఁగ" అనే కథకు దీటుగా వుంటుందని వేఱే చెప్ప నక్కఱ లేదు కనక విస్తరించేది లేదు

యింకోటికూడా దీని సజాతీయాన్ని యీమహాకవి అసకృద్ధావృత్తిగానే వాడివున్నాఁడు. దాన్ని గూర్చికూడా వుదాహరించి నాతాత్పర్యాన్ని కొంత వ్రాస్తాను.

౧. "బలిములపాట్లు దాయతలపాటును జూచివు డిడ్డపాటు."

(౨) "వేలాలవలీలతో వలికెలంకుల నుండిటు వచ్చి వచ్చి."

(౩) "మోమెఱుక మానిసిఁ జేసిటఁ దెత్తు మమ్మనిన్."

ఆయీ క్త్వార్థకేకారసంధులుకూడా బుద్ధిపూర్వకాలేగాని ప్రమాదప్రయుక్తాలు కావు. కాని వొకవిశేషం వుంది. ఇకారం పరంగా వున్నప్పుడే కాని యీసంధిని యీమహాకవి చేసినట్టు లేదు. విజయవిలాసకర్త అన్యత్రకూడా "అనవలసంటికాక" అని సంధి చేసి యున్నాఁడు. బాగా పరిశీలిస్తేమాత్రం యీసంధి వొక్క 'ఏమనందును' (అని+అందును) అనేచోట తప్ప అసమానాచ్ఛరత్వంలో హృదయంగమంగా వుండదు. నామకః నిషేధం వుందన్నమాటే కాని భారతకవులు మొదలుకొని యిటీవలికవులవఱకూ అంతో యింతో యీసంధిని చేసినట్టే కనపడుతుంది. శాస్త్రంలో వున్న నిషేధం రేఫశకటరేఫలపట్ల యెంత అమలుజరిగిందో దీనిపట్లా అంతే. శారదాబిల్లులాగ యిది యెవరినోతప్ప బాధించినట్టులేదు. యిట్టిశాస్త్రం వున్నా వొకటే, వూడినా వొకటే. క్వాచిత్కంగా వుండవచ్చు నని యిటీవల దీన్నిగూర్చి లక్షణంకూడా పుట్టింది. ఆయీలక్షణాన్నీ, లక్ష్యాలనీ వుదాహరించికూడా కల్లూరివారు 'నిరాకరంబులు' అని తోసేశారు. ఆకరమంటే శాస్త్రంకదా! అడిదం సూరకవిగారు "ఇడఁగవచ్చును ల్యప్పపై నిత్యసంధిమాత్రమొక్కొక్కచో" అన్నది శాస్త్రం కాక "క్త్వార్థత్తునకు సంధి లేదు" అన్నదే శాస్త్ర మవుతుందని చెప్పడంలో యేమిన్యాయం వుంది? కొంద ఱాలాగా, కొంద ఱీలాగా అభిప్రాయపడడంచేత 'ఉదితానుదితహోమం' మాదిరిగా వికల్పం ఫలితమయింది కనకనూ, స్వల్పవిషయంలో కొమ్ములు తిరిగిన మహాకవులను అవమానించడంకంటే అవివేకం మఱోటి వుండదు కనుకనూ ఆయీప్రయోగాలను ఆక్షేపించక శిరసావహించవలసిందని నావిజ్ఞప్తి.

యిఁక మఱో విషయం అందుకుంటాను.

(౧) వారు నట్లన యాచరించిరి (౨) సీత నెక్కటి నటులన్ (౩) ఒడ్డగిల్లినట్లనె యుండెన్ (౪) ఈకారుమంట లిటులన్ (౫) ఇట్లనె బొమ్మపోటులన్ సమయున్ (౬) మునీశ్వరుఁడు నట్లన వారల (౭) భాగ్యశాలి యటులం బాటిల్ల (౮) అనిన నట్లన చేసె (౯) వనచరవీరుఁ డానగరివాకిట ము న్నటులన్ (౧౦) ఇటుల నొకకొంత (౧౧) ఎప్పట ట్లన యే నుండక—యింకాకూడా వుంటే కొన్ని వుంటాయేమో యీ (అట్లన్, ఇట్లన్) ప్రయోగాలు. యివి తప్పులనేవారు కొంద ఱున్నారు. యిది ద్రుతాంతంగా వుండకూడదని వా రనుకుంటారు. భారతంలో మట్టుకు పూర్తిగా దిద్దేశారు. యితరకవుల కవిత్వాలలోమాత్రం దిద్దలేదు. అసలు దిద్దడం యెందుకు? నచ శంకా నచోత్తరమ్. శాస్త్రజన్యజ్ఞానమేనా వుండాలి, విశేషించినలక్ష్యజ్ఞానమేనా వుండాలి, ఉభయజ్ఞానమూ వున్నవాళ్లు బహు అరుదుగా వుంటారు గనక ఆజ్ఞానం అందఱికీ లభించదు. అందుచేత వేఱువేఱుగా విడఁదీయవలసి వచ్చింది. అవి లేనివారు వ్రాసే విమర్శనాలవల్ల సామాన్యులు సంశయాత్ములు కావడం తటస్థిస్తూ వుంటుందని యీ స్వల్పవిషయాలను పెద్ద చేసి వ్రాయవలసి వచ్చిందిగాని లేకపోతే యివి వ్రాయదగినంతటి ఆవశ్యకాలు కానేకావు.

యింక మఱోటి ప్రస్తావిస్తాను – (౧) ముఖరఝురీవారి (౨) నక్రూరగ్రహణంబుగా ఝురులక్రిందన్ (౩) ఝురీతరంగఘటలు (౪) గ్రావదరీఝరీ పరిసరంబు (౫) తరులనీడల జాడలఁదరుల ఝురుల. నిర్దుష్టమున్నూ, నిఘంటుసిద్ధమున్నూ, మహాకవిప్రయోగారూఢమున్నూకదా యీ ఝురీశబ్దం— దీన్ని వుటంకించడం యెందుకో అని ప్రతిప్రాజ్ఞుఁడున్నూ శంకాకులుఁ డవుతాఁడని యెఱుఁగుదును. నేఁడు యీశబ్దం తప్పనేవారున్నారు. అంటే అంటారుగాక—యువకవులు భ్రమపడవద్దుసుమండీ– బ్రహ్మ మొదలు పిపీలికపర్యంతమూ 'ఝురీ' ప్రయోగం వాడి వున్నారు అని తెల్పడానికే కాని, నచ శంకా నచోత్తరమే దీనిసాధుత్వం.

"నరవానరు లింక లక్ష్యమే"—యీప్రయోగం తప్పనుకొనేవారు లోఁగడ వుండేవారు, అప్పుడు దీని

సమర్థనం తెల్పడం జరిగింది. కాని మళ్లా దాన్ని బల పరిచే ప్రయోగం దొరకడంచేత వుదాహరించాను. 'లక్ష్యమే' అనకూడదనిన్నీ, 'లక్ష్యాలే' అని దిద్దాలనిన్నీ ప్రతిపక్షుల వాదం. అది శుద్ధతప్పు. 'లక్ష్యమే' అనే వుండాలి.

"వారివృత్తాంతవిధులు సర్వమును దెలిపి"— యిదెందుకు వుదాహరించానంటే 'విధులు' బహు వచనంగదా—'సర్వము' యేకవచనంగదా - సమన్వయం యేలాగ అని శంకించి తప్పనుకొనేవారున్నా నేఁడు (ప్రసిద్ధులలోనే) వున్నారు. అట్టివారు లోలోపల ఆలా అనుకొని వూరుకుంటే దానివల్ల లోకానికి నష్టి వుండదు. ఆలా వూరుకోరు, యేపత్రికకో యెక్కి స్తారు. అది యువకవిలోకాన్ని బాధిస్తుంది కనక వ్రాయవలసి వచ్చింది. సర్వశబ్దము యేకవచనాం తంగా వుండికూడా బహువచనార్థాన్ని యిస్తుంది కనక యీమహాకవి ఆలా ప్రయోగించాఁడని తెలుసు కోండి. ఆప్రయోగం నిర్దుష్టం. వ్రాస్తే చాలా వ్రాయాలి.

(౧) చిన్నఁబోయి (౨) శరాస (౩) పుట్టెను జాలనరోచకంబు (౪) పేదసాదల (౫) ఇల్లటపల్లుని (౬) ఉచ్చరింతుము (౭) సంకేతరవం బొక్కటి (౮) యోజింపు మనుచుఁ జెప్పిన, హాజారంబునకు (౯) అమ్ముగుదఁ జూచి (౧౦) కొండవీటిపుర (౧౧) వినుకొండక్షితినాథు నెన్నఁదగు (౧౨) గొబ్బూరి తిరుమల (౧౩) గట్టురాజల్లుఁడు (౧౪) పరమగురు నైన ముమ్మడి వరదాచార్యాంఘ్రివనజ వందారుఁడనై (౧౫) సురటుల్ వలె (౧౬) బ్రహ్మతనచేయులోక ప్రపంచమునకు (౧౭) ఎల్లిపోవలె (౧౮) ఎక్కడెక్కడ (౧౯) నడిపించె (౨౦) ఇతరత్రచింతలు (౨౧) గాఢాంధతమంబు (౨౨) చంపులుచంపిరి (౨౩) నమ్మినందుకుగ్ (౨౪) తమదు దెస.

ఆయీ నిర్దుష్టప్రయోగాలన్నీ తగినంత పిండి లేని పాండిత్యంతో వ్యాఖ్యానాల కుపక్రమించేవారికి యేదో వొకవిధమైన దోషం వున్నట్టుగానే పొడకడ తాయి. మనయందు తగినంతసత్తా లేకపోవడానికి ఆమహాకవి వుత్తరవాది యేలా అవుతాఁడు పాపం? ఆయీస్థలాలలో వుండే శంకల స్వరూపం యేలా వుంటుందో, సమాధానస్వరూపం యేలా వుంటుందో వ్యాఖ్యానించవలసివస్తే చాలా పెరుఁగుతుంది. యిందులో నల్లా ౨౧ నంబరు గుర్తు గలదాన్ని గురించిమాత్రం శంకించడం యుక్తం. గ్రంథకర్త వేఱొకచోట సమాసాంతప్రత్యయసహితంగా కూడా వాడి వున్నాఁడు. అనిత్యత్వం కవికి తెలుసును.

యీమహాకవి అష్టదిగ్గజాలలోవాఁడు, చతు ర్విధకవితాధురంధరుఁడు, శ్లేష చేదస్తం లేకుండా వాడతాఁడని యిదివఱకే వ్రాశాను. అంతతో తనివి దీరలేదు. "ఆసవవాంఛ వర్తిలు దురాత్ముల కెందును గీర్తి కల్గునే" యీ అర్థాంతరన్యాసలో ఆసవపదం శ్లేషించింది. ఆసవం అంటే మద్యం. రెండో అర్థం— అసువుల (ప్రాణముల) సంబంధమైన వాంఛ అని. దశ రథుఁడు తన దురవస్థకు చింతపడుతూ అనే వాక్య మిది. యీకవి సంస్కృతాంధ్రాలలో యెక్కడా దొరకఁడు. మృదుమధురపదభూయిష్ఠమై శరత్కాల గంగాప్రవాహంలా వుంటుంది ధార. యింతటి మహా కవికవిత్వానికి లోకంలో తగినంతప్రచారం లేక పోవడం శోచనీయం. యిఁక యితని కేలాటిప్రాస యెత్తుకున్నా మంచినీళ్లప్రాయంగానే వుంటుం దన డానికి వుదాహరించవలసి వస్తే చాలా పద్యాలు చూపాలి కనక ఆపద్యాల మొదళ్లుమాత్రం యెత్తి చూపుతాను—

(౧) దృక్త్రితయంబు (౨) హస్తసురారి (౩) స్వర్ఘంటాపథసీమ

యీలాటిప్రాసలవల్ల కవిత్వానికి కలిగే సార స్యం లేకపోయినా కవిపాండిత్యం యెంతపాటిదో తెలుసుకోవడానికి యివి తోడ్పడతాయి. రసజ్ఞం మన్యులు కొందఱు వీట్లకే సంతోషించి ప్రధానాం శాన్ని కనిపెట్టలేకపోవడమున్నూ వుంది. తత్తథాస్తామ్.

పదములపొందికనుగూర్చి లోఁగడ కొంత వ్యాక రించే వున్నాను. యింకోపద్యంకూడా వుదాహరించి వ్యాసం ముగింపుచేస్తాను—

క. "సన్న్యాసిని వన్యాశిని
గన్యా! సీమంతవీథికాసిందూరో
పన్యాసిమృదుపదాంబుజ
ధన్యా! సితకీర్తి! భిక్ష దయసేయఁగదే!"

యివి రావణునిమాటలు. బహుమందికవులు రామాయణాన్ని కథావస్తువుగా పుచ్చుకోవడం యిహపరలోకసాధక మనిమాత్రమే కాదు. ఆకథలో సర్వరసాలకున్నూ బోలెఁడు అవకాశం వుంది. ఆరసములను యీమహాకవి చక్కఁగా చిత్రించాఁడు. కొలఁది మాత్రంగా మార్పు చేసి వున్నాఁడు. మొత్తంమీఁద చాలాభాగం సంగ్రహించి సుమారు ౧౫ వందల పద్యాలలో కథ సంపూర్తి చేసి వున్నాఁడు. యీలాటికవులు అసకృదావృత్తిగా వాడిన పరిశుద్ధ ప్రయోగాలను వాడుకోక చేదస్తంగా వర్తించు నేఁటి కవులకన్న దైవవంచితు లంటూ వుండరు. శబ్దరత్నాకరంలో యెన్నో ప్రయోగాలు యీరామాభ్యుదయం నుంచే యిచ్చివున్నాఁడు. యీకవి పురుషుఁడు మహాపండితుఁడుగా వున్నాఁడంటే ఆకాలంలో అంతగా ఆశ్చర్యపడవలసి వుండదు. ఆకాలంలో స్త్రీలలో కూడా మహావిదుషీమణులైన కవయిత్రులు యెందఱో వున్నట్టు వారివారి గ్రంథాలవల్ల స్పష్టమవుతూ వుంది. ఆకాలందాఁకా యెందుకు? తంజావూరురాజులకాలంలో వుండే ముద్దుపళని (వేశ్య) కవిత్వం చూస్తే ఆమెపాండిత్యం యేలాటిదో తెలుస్తుంది.

ప్రసక్తి వచ్చింది కనక యీమెకవిత్వాన్ని గూర్చి కొంత వివరిస్తాను. తన్నుఁగూర్చి "సాహిత్యవిద్యావిశారద శారద యై ముద్దుపళని నా నమరు" అని వ్రాసికొన్నమాట బూటకం కాదని కవిత్వం సాక్ష్యమిస్తూ వుంది. యీమె విద్వత్కవయిత్రిమాత్రమే కాదు. భగవద్భక్తురాలుగూడాను.

"సీ. ఏనాతి నీరీతి నెంతో భక్తి చెలంగ
వ్రాయించె జయధాటి రామకోటి"

అంతేకాదు, విద్వత్కవులను సమ్మానించిన దాత్రీశిరోమణి. కవిత్వం చెప్పడమేకాదు, కొన్నికృతులనుకూడా కవులచే నంది వుంది. "విద్వచ్ఛ్రేణిఁ దనియించె...ధనము లిచ్చి, కబ్బముల్ చేనంది."

విద్యావతిమాత్రమే కాదు, మిక్కిలి సౌందర్యవతికూడాను.

"సీ. చెన్నొందు రంభ గాకున్న చోను ప్రతాప
సింహేంద్రు పెంపును జెందనేల?"

కొంతగర్వాథముగాఁ జెప్పికొన్నను ఈమె అప్పటి ప్రభువునకు ప్రియురాలై యఖండైశ్వర్యము ననుభవించినట్టు దోఁచుచున్నది. స్వకులవిద్యయైన శృంగారకళయందు మిక్కిలీ అభినివేశ మున్నట్టు రాధికాసాంత్వనంలోని ప్రతీపద్యమూ తెల్పుతుంది. చతుష్షష్టి కళలలోఁ జాలాభాగం యీమె నేర్చిన దని తోఁచుట కాధారం వుంది.

"లలితసకలకళాప్రౌఢి వెలయ నేల ?"

కవిత్వ పాండిత్య రతిరహస్యములయందే కాక బాహ్యకులవిద్యయందుకూడా యీమె మేటి.

"నటియింప నేర్తువు నవరసంబుల నంటి
తగురంభ యనిమిషత్వము వహింప"

దాతృత్వంకూడా సామాన్యం కాదనడాని కింకా ఆధారం వుంది.

"ఈయఁగా నేరుతు విలఁగోరినవరాలు
నగరాజసుకుమారి సగము గాఁగ."

ఆయీ విషయము లితరులు చెప్పినట్టు యీమెయే వ్రాసికొన్ననూ అవి ఆత్మస్తవ మనుకోకూడదు. కవు లందఱూ యీదోషానికి గుఱి కావలసివస్తుంది ఆపక్షంలో. కనక దీనికి వొప్పుకోక తప్పదు. ఉన్నవిశేషాలలో కొంత తగ్గించే చెప్పుకొని వుంటుంది, కాని ఆలా కాకపోతే సమకాలీనులవల్ల అపహాస్యత్వం వస్తుందని తెలుసుకోఁజాలనిదై యుండదు. యీమెకు సంస్కృతభాషయందుఁ గల పాండిత్యం తెలుఁగు కవిత్వరచనకు సరిపడేటంతటిదే కాక సమకాలీనులైన పండితుల కెవ్వరికిని దీసిపోనంత యున్నట్టు కనుపట్టుచున్నది.

"మ. యమునాతీరవిహార, హారసదృశో
ద్యత్కీర్తిసంభార, భా

రమణీయాకృతిమార, మారసికతా
ప్రావీణ్యసంసార, సా
రమరందోక్తివిచార, చారణనుత
ప్రఖ్యాతివిస్తార, తా
రమహీభృత్సమధీర, ధీరమునివా
రాధార, రాధారతా!"

ముక్తపదగ్రస్తయమకమయంగా వున్న యీ పద్యంకూడా నాతికఠినశైలిలో నడపుటకు సంస్కృతమున నేకొంచెమో ప్రవేశ ముంటే చాలదు. చాలా పాండిత్యం వుండి తీరాలి. ఆలా వుండినీ విశేషించి యీమె తెలుఁగే వాడిందిగాని యీపాత్రంలో సంస్కృతం వాడలేదు. కొందఱు పచ్చిగా వర్ణించింది శృంగారాన్ని అని అంటే అన్నారుగాక, యేదీ ఆ విషయంలో యిన్నిమర్మాలు తెల్పిన కవిని మఱొక్కణ్ణి చూపెట్టండి చూదాము. వాడినంతలో సంస్కృత వ్యాకరణదోషాలు కనపడకపోవడంచేత పాణినీయ ప్రవేశంకూడా వున్నట్టనుమానించడాని కవకాశం కనపడుతుంది. తెలుఁగులో యితరకవులెవ్వరూ వాడని పదాలు కొన్ని స్వయంగా కల్పించికూడా యీమె వాడింది.

పింగళి సూరన్న ప్రభృతులు యేవొకటిరెండు పద్యాలలోనో వర్ణించిన బాహ్యాభ్యంతరసురతాది గోష్ఠిని యీమె యావద్గ్రంథమున్నూ తన్మయంగానే నింపివేసింది. ఆవిద్యలో "ననవిల్తు శాస్త్రంబు మినుకులావర్తించు పని వెన్నతోడఁ బెట్టినది మాకు" అనే వాక్యానికి స్మారకంగా యీమెపాండిత్యం కనపడుతుంది. ఆవిద్యనుకూడా ఆరోజుల్లో శుశ్రూష చేసి నేర్చుకోవడం వుండేదేమో అని అనుమానించతగ్గ మాటలు కొన్ని కనపడతవి.

"గణనసేయదొ మరుసాముగమనములకుఁ
దాను నాచేతఁ బడిన బెత్తంపుఁబెట్లు"

రాధికాసాంత్వనంలో గ్రంథకర్త్రి ముద్దుపళనికి సర్వత్రా రాధికాపాత్రలో అంతర్భావం కనపడుతుంది. అంతేకాదు, యీమెకు తానే రాధ నన్నంత అభినివేశంకూడా వుండేదేమో అని అనుమానించడానికూడా యెన్నో ఆధారాలు కనపడతాయి. బహుశః ఆనాఁటి తంజాపురీప్రభువే కృష్ణుఁడుగా యీపె యిందులో చిత్రించినట్టు తోస్తుంది. యీమెకు కవితారచనలో యెంత ప్రజ్ఞ వుందో, అంతప్రజ్ఞా తన కుల విద్యయందుకూడా వున్నట్టు కొంతరచనవల్ల గోచరిస్తుంది.

"సీ. ఆశుకవిత్వంబు లల్లి తేనేసరా,
చిత్రప్రబంధముల్ చేయవలదె?
.......................
తే. గీ. వింతవింతగఁ గలసినయంత సరియె
యెన్మెకాని మనోభావ మెఱుఁగవలదె?"

ఆయీ సీసపద్యంలో వదిలిపెట్టిన చరణాలలో వీణావాద్యం, రాగాలాపనచాతురి, పదవర్ణముల నభినయించడం లోనైన ప్రజ్ఞలు తనకున్నట్టు సూచించింది. ఆయీ పాండిత్యంమాటాలా వుండఁగా యీమెవాడినన్ని లోకోక్తులు యేకవిన్నీ, యేపుస్తకంలోనున్నూ వాడినట్టు లేదు. వొక్కొక్కపద్యంలో రెండు వాడిన పద్యాలుకూడా వున్నాయి. తంజావూరు ప్రాంతంలోనేమో కాని యితరత్ర ఆలోకోక్తులలో కొన్ని వినఁబడడం లేదు.

(౧) ముక్కుపచ్చలు మానకమునుపే బిరుకు పిచ్చుక కొట్లాడ వచ్చింది.

(౨) నిన్న కుప్పా నేఁ డాళ్లా.

(౩) కొన్నంగడిలోపలనే మాఱుబేరమా ?

(౪) అత్తసొత్తినిచేతులూ, అంగడిలో కన్నులూ.

ఆయీ సామెతలు మాప్రాంతంలో వున్నట్టు లేదు. సామెతలూ, న్యాయాలూ యించుమించు వొకటే మాదిరివి. యివి అన్నిభాషలలోనూ వుంటాయి. భాషమాత్రం వేఱుగా వుండి వొకటే అర్థాన్ని యిచ్చేవే వీటిలో చాలాభాగం. మృతిన్నీ శృంగారవిహారాలలో యితరకవులు వర్ణించనివిన్నీ, యీమెవర్ణించినవిన్నీ చాలా వున్నాయి. అందులో వొకటిమాత్రం (అంత పచ్చిగా లేనిది) యిక్కడ వుదాహరిస్తాను—

"ఎదురురెయ్యాలలనెక్కి యెలనాగయును దాను
జిగినోటిమడుపులు చేకొనుచును"

యిందులో కథ యేమీ విస్తరించి లేదు. రాధాకృష్ణుల ప్రేమానుబంధమే ప్రధానం. ఇళ వుపనాయికగా కల్పింపఁబడింది. ఆమెతో రాధే కృష్ణునికి బుద్ధిపూర్వకంగా సంబంధం కల్పింపిమ్మట విచారించడమే యిందులో వున్న కథ. దీన్ని బట్టి చూస్తే యీకవయిత్రికి యిది స్వానుభవాన్ని తెలపడానికి వ్రాయవలసి వచ్చిందేమో ననిన్నీ తోస్తుంది. యీకాలపు విమర్శకులు ప్రతీదిన్నీ గ్రంథకర్తకే అంటఁగడుతూ వున్నారు. నేను దానికి సమ్మతించేవాణ్ణి కాకపోయిన్నీ యీపె రచనను అనుమానిస్తున్నాను. "సహృదయాః ప్రమాణమ్". యీమె యెందుకు వ్రాసిందికాదో గాని వ్రాయడ మంటూ వస్తే వొక శృంగారశాస్త్రం (వాత్స్యాయనంవంటిది) వ్రాయఁదగ్గంతనేర్పు వుంది. వాత్స్యాయనం నేను అనేకసార్లు పఠించినవాణ్ణే. అందులో లేని రతిరహస్యాలుకూడా యీపెరచనలో కనపడతవి. మన కిప్పుడు తెలుఁగులో కవిత్వం చెప్పిన పూర్వకాలపు స్త్రీలు యీపెతో ముగ్గురుమాత్రమే కనపడతారు— (౧) మొల్ల (౨) తరిగొండ వెంకమ్మ. వీరిద్దరున్నూ శృంగారాన్నిగూర్చి యెక్కడేనా వొక వాక్యం భయపడుతూ భయపడుతూ వ్రాసినా లోకం యే మనుకుంటుందో అనేశంక వదిలిపెట్టినట్టు లేదు. యీపె యీమని లక్ష్మణస్వామిగారు (సుప్రసిద్ధనటాగ్రేసరచక్రవర్తి - బందరు) చెప్పినవిధంగా యెదట వున్నలోకాన్ని గమనించినట్టే లేదు. ఆలా గమనించేయెడల తనఅనుభవాన్ని సర్వాన్నీ యీవిధంగా చిత్రించనేలేదు. "సలజ్జా గణికా నష్టా నిర్లజ్జేవ కులాంగనా" అన్న అభియుక్తోక్తికి యీపె ప్రథమోదాహరణం.

యేకొంచెమో ముక్కుతిమ్మన్నగారిని యీపె అనుసరించినట్టు కనపడుతుంది-- "ఏయెడ నాతొమ్మంబాయనివీణ యేపాటలాధర గోట మీటు నొక్కొ?" తగుమాత్రం శ్లేషకూడా యీమె వాడుతూ వచ్చింది కాని యీమెకది అంత యిష్టంలోనిది కాదు. లోకంలో స్త్రీకి సవతియందు వుండే ద్వేషం యావత్తూ యీమె దీనిలో చిత్రించింది. నాయకః యీమె వేశ్యే అయినా మహారాజునుంపుడుకత్తెగా నుండడంవల్ల బహుభార్యాకుని యిల్లాలుగా వుండి ఆ అనుభవాలు వ్రాసినట్టు తోస్తుంది. వర్ణించడానికి అర్హం కాదని కవులందరున్నూ వదలుకొన్నట్టిన్నీ, యేకొందరో మాత్రం వర్ణించినట్టిన్నీ అవయవాన్నికూడా యీమె వదిలిపెట్టలేదు. యెంతో మృదువుగా వర్ణించింది. వర్ణించి వూరకోలేదు. కామశాస్త్రం సమ్మతించినా నీచపురుషోచిత మని జ్యోతిశ్శాస్త్రరీత్యా తేలేసంగతిని (చుంబనాన్ని) కూడా వుటంకించి అది కృష్ణునికి (పురుషోత్తమోత్తమునికి) అంటగట్టింది. ఆయీసందర్భాలు కొన్ని పరిశీలిస్తే యీపెకు కవితారచనలో తన్మయత్వం పూర్తిగా గోచరిస్తుంది. యీపె శృంగారభక్తురాలుగా శ్రీకృష్ణుణ్ణి ఆరాధించినట్టు యీగ్రంథం బాగా తెల్పుతుంది. శృంగారం యెంతఅనుభవించాలో అంతాకూడా విభావాను భావాదులతో అనుభవించిన కవయిత్రి అంటే యీమెయే. సందేహం లేదు. జన్మచేత వేశ్య అయినా వేశ్యకు సంఘటించే దుర్యోగాలు లేశమూ యీపెకు సంభవించనే లేదనిన్నీ, సుయోగాలుమాత్రమే సంభవించినాయనిన్నీ వూహించడానికి అవకాశం చాలా వుంది.

"తారుణ్యం గత మేవ నిష్ఫల మహో శూన్యాలయే దీపవత్" అనే భర్తృహరివాక్యానికి యీపె యౌవనం వుదాహరణం కాలే దని చెప్పడానికి అభ్యంతరం లేదు. యీపుస్తకమంటే యీమె అనుభవించిన శృంగార మే; పేరుమాత్రమే మార్చింది. ఈపె రచనలో యెక్కడా ఐహికసౌఖ్యాన్నిగూర్చిన నింద కనపడకపోవడాన్ని బట్టి చూస్తే అట్టిసన్నివేశం యీపె యెఱిఁగినట్టే తోఁచదు. యీవూహే నిజ మయితే పెద్దన్నగారి "సశరీరస్వర్గసుఖాన్ని" యీపె అనుభవించిం దనడానికి సందేహం లేదు.

యీపె యితరకవులవల్ల అంకితం పుచ్చుకున్న పుస్తకాలపేళ్లు దీనిలో లేవు. యీగ్రంథంకంటే యితరగ్రంథం వ్రాసినట్టున్నూ దీనిలో లేదు. యిదే ప్రథమప్రయత్నమై వుంటుంది. కన్నూ మిన్నూ తెలియని యౌవనం అతిక్రమించాక, సుమారు ముప్పది యేళ్ల లోపు ప్రాయంలో (ప్రౌఢావయస్సులో) దీన్ని వ్రాసినట్టు కొన్నిమాటలు తెల్పుతవి.

"సీ. అధరామృతంబు నీ వానితివో కృష్ణ?
అది లేఁజిగురువగ రంతె రాధ!"

యీపద్యం యావత్తూ ప్రౌఢాసాంగత్యమే మంచిదనే భావాన్ని సూచిస్తుంది. ఇళాసమాగమానంతరం జరిగిన రాధాకృష్ణుల ప్రశ్నోత్తరా లిందులో వున్నాయి. తత్తథాస్తామ్.

నూటికి పది పదాలు తత్సమాలు వుంటే వుంటాయేమోకాని యీమెకవిత్వంలో అంతకంటే యెక్కువగా వుండవు.

"ఉ. మాటలు ముద్దుపద్దులును
మక్కువ లెక్కలుఁ బ్రొక్కుసొక్కులున్
గాటపుఁగౌఁగిలింతలు వ
గల్ గిలిగింతల మీటువింతలున్
మాటికిమాటికిం గలియు
మాలిమిమేలిమిఁ జూచినట్టి యే
యాటద వాని వీడు నక
టా! కడు రక్కసి నన్నుఁ దక్కఁగన్?"

యీపద్యంలో తత్సమపదం వొకటీ లేనే లేదు' గ్రంథ మంతా యీలాటి రచనతోనే ముగిసింది.

ఎంత విలాస మెంత సొగ
సెంత వదాన్యత యెంత రాజసం
బెంత యొయార మెంత కళ
యెంత గభీరత యెంత సోయగం
బెంత నిరూఢ మెంత దయ
మెంత మనోజ్ఞత యెంత ఠీవి నా
యంతటిమందభాగ్య కిఁక
నంతటిచక్కని దేవుఁ డబ్బునే?"

యీపద్యంలో వుటంకించిన వదాన్యత (దాతృత్వం) రాధకు అవసరమైనది కాదు. వేశ్య కనక యెంత మహారాజు చేపట్టినదైనా తనకు అవసరం కనక దాన్ని బట్టి దొర్లిం దని తోస్తుంది.

సంస్కృతవ్యాకరణదోషాలు యీమెకే కాదు. విద్వత్కవులకవిత్వంలో యెక్కడా వుండవు. తెలుఁగు వ్యాకరణదోషాలు మట్టుకు కొంచెం గొప్ప ప్రతికవికీ కనపడతాయి. దాని క్కారణం "తెలుఁగున కున్న వ్యాకరణదీపం" చిన్నది కావడమే. క్త్వార్థకానికి సంధి కలిసిందనో, మధ్యమపురుషకు సంధి కలవలేదనో ప్రతికవినీ అనడం బాహాట మైపోయింది. అల్పవిద్యావంతుఁ డాక్షేపణకు పెద్ద కనక ఆక్షేపణలు ఆబాపతువారి తాలూకే. అలాటివే యీ బిడకున్నూ కనపడతాయి. భావవిషయంలో యే తెలుఁగుమొగకవికిన్నీ యీపెరచన తీసిపోదు. శృంగారం పచ్చిగా వుందంటే, వున్నమాట సత్యమే. యీమె వర్ణించిన విషయా లెత్తుకొని మరో కవి యింతకంటే వీలుగా వ్రాస్తే చూడాలి. అసలు ఆవిషయాలే వర్ణ్యాలు కావనేపక్షంలో చెప్పే జవా బేమిటి? స్త్రీసమాగమమే వదలిపెట్టాలి. కాళిదాసు—

"అత ఆహర్తు మిచ్ఛామి
పార్వతీ మాత్మజన్మనే,
ఉత్పత్తయే హవిర్భోక్తు
ర్యజమాన ఇవారణిమ్"

యీశ్లోకంలో యెంతో పవిత్రంగా శృంగారాన్ని సూచించాఁడు. దీనిలో స్ఫురించే వ్యంగ్యంలో యెంతో అసభ్యత కనపడుతుంది. కాఁబట్టి—

"క. ఏరసము చెప్పఁ బూనిన
నారస మాలించువారి నలరింపని—"

కవిత్వం కవిత్వమే కాదన్న కవికర్ణరసాయనకవిశాసనాన్ని బట్టి చూస్తే యీపె శృంగారకవిత్వాన్ని ఆమోదించే రసికులు యువకులలో ఎందరో వుంటారు. వృద్ధు లామోదించే రచన వేఱు, యువకు లామోదించే రచన వేఱు. వుభయులూ ఆమోదించే రచన వుంటుందో, వుండదో అని సంశయింపవలసిందే.

అయ్యలరాజువారి కవిత్వసందర్భంలో యీ ముద్దుపళని కవిత్వప్రసక్తి వచ్చింది. ఆయన రామభక్తుఁడు, యీమె కృష్ణభక్తురాలు ("కనుఁగవ హరిమోము గనుఁగొననే కోరు వీనులు హరిమాట విననె కోరు"చూ.) ఉభయులూ స్త్రీత్వ పుంస్త్వ, బ్రాహ్మణత్వ బ్రాహ్మణేతరత్వ భేదాలు కలిగి వున్నా కవితావిషయంలో అస్మదాదులకు గణనీయులే.

"శ్లో. జయన్తి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః,
నాఽస్తి యేషాం యశఃకాయే
జరామరణజం భయమ్."

# పేదలు

(LES PAUVRES)

*Emile Verhaeren*

(1855—1917)

అంతేలే పేదల గుండెలు
అశ్రువులే నిండిన కుండలు
శ్మశానమున శశి కాంతులలో
చలి బారిన వెలి రాబండలు

అంతేలే పేదల మూపులు
అనాగార్చ్యగ విధిత్రోద్రోపులు
పయోధితట కుటీరములవలె
భరియించవు బాధల మోపులు

అంతేలే పేదలచేతులు
శ్లథశైశిర పలాశరీతులు
విశుష్కములు పరిపాండురములు
విచలించెడు విషాదహేతులు

అంతేలే పేదల కన్నులు
వినమ్రములు వెతల వ్రణమ్ములు
తుపానులో తడిసిన జడిసిన
గోమాతల కన్నుల తమ్ములు

అంతేలే పేదల బ్రతుకులు
తిరిపెమునకు పిడికెడు మెతుకులు
తెరువెరుగని దీర్ఘరాత్రిలో
తలపగిలెడి తలపుల గతుకులు

* "(Verhaeren began as a symbolist obsessed with the fantastic sadness of the world which he described with the morbid accuracy of a Flemish painter He sang the solitude and the tragic emptiness of the world, the night, the wind, the roads stretching to infinity at dusk through the Belgian land, the calvaries at the cross-roads, the ghostly wind-mills on the hills, the monks chanting vespers at their chapels. Then the hallucination of the great cities came upon him, what he called "les Villes tentaculaires". Nobody eccept Zola had succeeded so well in giving form to the hallucinations of the factories, the machines and the industrial scenery of our days. The forces at play in the modern world could be heard ringing in his verses which resounded like a gong He was the poet of labour, hard life and the struggle for existence His life came to a tragic end which put the finishing touch to his songs when he was crushed to death in a railroad wreck at Rouen in 1917. Before he died he had had time to curse the war and the invadery of his country (Belgium) in some of his most inspired verses."

—Regis Michaud in Modern Thought and Literature in France.

* సంజ్ఞావాద కవిగా వెర్‌హీరన్ రచనాప్రారంభం. భయంకరాద్భుత మగు ప్రపంచ విషాదం ఇతనిని క్రుంగదీసింది. ఈ విషాదాన్ని ఫ్లెమిష్ చిత్రకారుల తు, చ, తప్పని విక్లబత్వంతో ఇతడు వర్ణించాడు. లోకంలోని ఏకాకిత, విషాదమయ మగు విశూన్యత్వం, నిశీథం, సమీరం,

బెల్జియం దేశంలో సాయంత్రపువేళల్లో అంతులేకుండా ఎక్కడికో వెళ్ళిపోయే వీధులు, దారులు కలుసుకొనే చోట సిలువ విగ్రహాలు, కొండలమీద కనబడే భూతాలవంటి గాలి యంత్రాలు, గుడిలో ప్రార్థనలు చేసుకొనే మతగురువులు ఇతని పాటలలో కనబడడం. అంతట ఆధునిక మహానగరాల అరుంతుద విభ్రాంతి ఇతనిని ఆవరించింది ('నగరబాహువులు' అని ఇతని ఒక కావ్య సంపుటం పేరు). ఒక్క ఎమిల్ జోలాను మినహాయిస్తే ఇంకెవ్వరూ ఇతనివలె మనకాలపు ఫాక్టరీలు, యంత్రాలు మున్నగు పారిశ్రామిక దృశ్యాల పరిభ్రాంత స్థితికి ఆకృతి ఇవ్వడంలో కృతకృత్యులు కాలేదు. ఆధునికప్రపంచంలో అనుభవానికి వచ్చిన వివిధ శక్తుల సంఘర్షణ ఇతని గీతాలలో కంచుగంటవలె మారుమ్రోగుతూ వినిపిస్తుంది. కార్మికులు, కష్టజీవనం, బ్రతుకుకై ప్రాణుల నిత్యసమరం ఇతనిని కవిగా చేసిన శక్తులు. ఇతని పాటలకు భరతవాక్యంగా **1917**-వ స.లో రూవెన్‌లో సంభవించిన రైలుప్రమాదంలో ఇతని జీవితం విషాద సమాప్తి పొందింది. చనిపోవడానికి ముందు ఇతడు యుద్ధాన్నీ, తన దేశంమీద దండయాత్ర చేసినవారినీ తీవ్రావేశంతో శపిస్తూ గీతాలు వ్రాశాడు. (**Les ailes rouges de la guerre** - యుద్ధపు ఎర్ర రెక్కలు అనే సంపుటిలో ఇవి ఉన్నాయి.)

**— అనువాదకుడు: శ్రీరంగం శ్రీనివాసరావు.**



# బంగారు పిలక

శ్రీ చింతా దీక్షితులు

"తాతయ్యా, నా కోకథ చెప్పవూ?"

"బువ్వ తిన్నావా?"

"తిన్నా, తాతయ్యా"

"అయితే, ఏంకథ చెప్పమంటావు?"

"పిలకకథ తాతయ్యా"

"అయితే విను—

"అనగా అనగా ఒక ఊళ్లో ఒక బ్రాహ్మ డుండే వాట్ట. ఆ బ్రాహ్మడికి బంగారుపిలక ఉండేదిట—"

"అదేమిటి తాతయ్యా, బంగారుపిలక లుంటాయా ఎవరికేనా?"

"అవునురా— చెప్పడం మరిచిపోయాను. వెనకటికాలంలో ఎవ్వరి కేపిలక కావలిస్తే వాళ్లు ఆపిలక చేయించుకొనేవారట—"

"అదేమిటి తాతయ్యా—పిలకలు చేయించుకొంటారా ఎక్కడైనా?"

"ఆ కాలంలో చేయించుకొనేవారట—ఇప్పటికి మల్లె అప్పుడు పిలకలు తలకు అంటుకొని ఉండేవి కావట. ఎవరి పిలక వారు తీసుకొని మంచి మంచి నూనెలు రాసి దువ్వి జడలు వేసుకొని తలకు అంటించుకొనేవారట. కొందరు బంగారుపిలకలూ, కొందరు వెండివీ, కొందరు రాగివీ చేయించుకొనేవారట. ప్రతీ రోజూ అవి తీసి తోముకొని మళ్లీ అందంగా తలకు తగిలించుకొనేవారట.

ఒకనాడు బ్రాహ్మడు అత్తారింటి కెళ్లాలని ముస్తాబై బంగారుపిలక అంటించుకొని వెడుతున్నాట్ట. తోవలో ఓఅడివి ఉంది. ఆఅడివిలోంచి వెడుతూంటే ఒకచోట ఓ గొర్రెలమందను కాసుకుంటూ ఒక గొల్లవాడు నిలబడ్డాడు. గొల్లవాడు పరధ్యానంగా ఉండడం చూచి ఒకనక్క గొర్రెపిల్ల నొకదాన్ని పట్టుకుపోవడానికి పొంచుండి చూస్తోంది. దాన్ని గొల్లాడు చూడలేదు. బ్రాహ్మడు చూచి "గొల్లాడా గొల్లాడా! నీ గొర్రెపిల్లని పట్టుకుపోవాలని చూస్తోంది ఆ నక్క—చూశావా" అన్నాడు. గొల్లవాడు తిరిగిచూచి కర్ర పుచ్చుకొని నక్కమీదకు విసిరాడు. కర్ర నక్క కాలికి తగిలింది. అది పారిపోయింది. బ్రాహ్మడిమీద నక్కకు కోపం వచ్చింది. గొల్లాడితో చెప్పి తనకు గొర్రెపిల్ల లేకుండా చేశా డనిన్నీ, కర్రతో కొట్టించాడనిన్నీ కోపగించి బ్రాహ్మడిమీద కసితీర్చుకోవా లనుకొంది నక్క.

బ్రాహ్మడు అడివిలోంచి వెడుతున్నాడు. అతనికి కనిపించకుండా నక్క అతనివెనకే వెడుతోంది. ఇంతట్లో సాయంత్రం అయింది.

బ్రాహ్మడు సంధ్యవార్చుకోవా లనుకొన్నాడు. అక్కడో చెరువుంటే ఆ చెరువులోకి దిగి సంధ్య వార్చుకోవచ్చును గదా అనుకొన్నాడు. అనుకొని, బంగారుపిలక ఒడ్డున పెట్టి, కాళ్లు కడుక్కోడానికి చెరువులోకి దిగాడు. దిగి, కాళ్లూ చేతులూ కడుక్కొని, పైకి వచ్చి, మళ్లీ పిలకపెట్టుకొని ఒడ్డున కూచుని సంధ్యవార్చుకోవచ్చుగదా అనుకొన్నాడు.

బ్రాహ్మడు కాళ్లు కడుక్కుంటూంటే నక్క మెల్లిగా వచ్చి బంగారుపిలక పట్టుకొని పారిపోయింది. బ్రాహ్మడు కాళ్లుకడుక్కొని పైకి వచ్చి చూచేసరికి పిలక లేదు.

"అన్నా! ఎంతపని జరిగింది. అత్తవారు పెట్టిన నిక్షేపంలాంటి పిలక పోయింది. ఇంక ఏమొహం పెట్టు

కొని అత్తవారింటికి వెళ్లను? ఎవరు తీసిఉంటారు నాపిలక? ఇక్కడ మనిషిసందడేనా లేదే!" అని అను కొని బ్రాహ్మడు చుట్టుపట్లంతా వెతకడం మొదలు పెట్టాడు. ఎక్కడా పిలక చిక్కలేదు కాని చెరువు ఒడ్డుమీద తాను పిలకపెట్టినచోట నక్కకాలి అడు గులు ఉండడం చూచి "ఈనక్కగానీ పిలక పట్టుకు పోయి ఉంటుందా" అనుకొన్నాడు. గొర్రెపిల్లను పట్టుకుపోకుండా చేసినందుకు కోపంకొద్దీ ఆనక్క వచ్చి యింతపనీ చేసిఉంటుందని అతడు అనుకున్నాడు.

దాని కాలిఅడుగుల జాడనుబట్టి మెల్లిగా వెడు తున్నాడు. భూమిమీద కళ్లుపెట్టుకొని ఇటూ అటూ చూడకుండా వెడుతూంటే అతనికి ఒక చెట్లదుబ్బులో అలుకుడైన ట్లయింది. గాండ్రుగాండ్రుమని శబ్దము వినిపించింది. తటాలున ఆగాడు. ఆ దుబ్బులో నుంచి ఒక పెద్దపులి వచ్చి అతనికి ఎదురుగా నిలబ డింది.

బ్రాహ్మడు గజగజ వణికిపోతున్నాడు. చేతులు జోడించి పెద్దపులికి దణ్ణం పెడుతూ అన్నాడుగదా "పులిరాజా పులిరాజా, నేను బ్రాహ్మణ్ణి; నన్ను వదిలిపెట్టు, నీ కెంతోపుణ్యం ఉంటుంది. నీవు ఈ అడ వికి రాజువు. నీకు కావాలంటే ఎన్నిమృగములు లేవు, ఈ బ్రాహ్మడే కావాలా తినడానికి—నీకు పదివేల దణ్ణాలు. నన్ను వదిలిపెట్టు. నేను అత్తవారింటికి వెడు తూ బంగారుపిలక పోగొట్టుకొని దుఃఖిస్తున్నాను. పులిరాజుగారైన తమ దర్శనం దొరికినందుకు చాలా సంతోషిస్తున్నాను. తమ దర్శనఫలంగా నాపిలక నాకు దొరుకుతుందని నమ్మకం కలిగింది. నన్ను వదిలి పెట్టు" అని బ్రాహ్మడు సాష్టాంగపడ్డాడు. "ఇదేమి ఖర్మం, పిలకకోసం వెదుకుతూంటే పులినోట పడవ లసి వచ్చింది" అనుకొన్నాడు. పెద్దపులి అతన్ని చూచి నవ్వి "లే, బ్రాహ్మడా, లే; నీపొగడ్తలకు పొంగే రోజులు వెళ్లాయి. నే నెవర ననుకొన్నావు? నాకు ఆకలి లేదుకాని దాహం ఎక్కువగా ఉంది. నీ మెడదగ్గిరనరం మెల్లిదిగా కొరికి నీరక్తం తాగి దాహం తీర్చుకొని వెడతాను. తరవాత నీదారిని నీవు వెళ్ల వచ్చు, లే" అంది.

"ధర్మమా, పులిరాజా, బ్రాహ్మడి రక్తం తాగడం? బ్రహ్మహత్యాదోషానికి ఒడిగడతావా ఇంతరాజ్యమూ ఏలుతూ?" అన్నాడు బ్రాహ్మడు.

"అయ్యో వెర్రి బ్రాహ్మడా, మా మనుష్యులకు మల్లె మాలో జాతి మత భేదాలు లేవు. నలుపు తెలుపు భేదాలు లేవు. మాకంటికి అందరూ ఒక్కటే: కాబట్టి నీరక్తం తాగకమానను"

"అమ్మయ్యో! రక్షించు పులిరాజా" అన్నా డు బ్రాహ్మడు. పెద్దపులి కోపంతో బ్రాహ్మణ్ణి సమీపించి మెడ కొరకబోతూంటే అన్నాడుగదా బ్రాహ్మడు "ఆగు ఆగు, పులిరాజా, ఆగు ఆగు" అని.

"ఎందుకు, ఎందుకు" అంది పులి.

"ఒక ధర్మసూక్ష్మం ఉన్నది"

"ఏమి టది?"

"నేను చెప్పనూ చెప్పాను, నీవు చూడనూ చూచావు—నాకు పిలక లేదనే సంగతి. పిలకలేని బ్రాహ్మణ్ణిగాని, యితర కులస్థుణ్ణిగాని పులులు తిన కూడ దని ధర్మశాస్త్రం ఉన్నది. అది నీవు మరిచి ఉంటావు. ఎట్లాగా నన్ను చంప నిశ్చయించావు కాబట్టి ఒక ఉపాయం చెప్తాను విను"

"అవును, బ్రాహ్మడా, ఆమాట నిజమే. చెప్పు, ఆ ఉపాయం ఏమిటో"

"ఏమీ లేదు. నేను కాళ్లు కడుక్కుంటూంటే ఒక మాయనక్క వచ్చి నాబంగారుపిలక ఎత్తుకు పోయింది. మనం ఇద్దరమూ వెళ్లి దానివద్దనుండి పిలక పుచ్చుకొందాము. నే నాపిలక పెట్టుకొంటాను. తర వాత నారక్తంతో దాహం తీర్చుకొందువుగానినువ్వు" అన్నాడు బ్రాహ్మడు.

పులి సరే, పదమంది. పులీ, బ్రాహ్మడూ కలిసి అడివిలోంచి వెడుతున్నారు. ఎంత వెదకినా వాళ్లకు నక్క ఉండే జాడ కనిపించ లేదు. ప్రతీ కన్నమూ, ప్రతీపొదా చూస్తున్నారు. నక్క కనిపించ లేదు. పులికి దాహం ఎక్కువౌతోంది. బ్రాహ్మడికి భయం ఎక్కువౌతోంది.

చెట్టుకొమ్మమీదనుంచి వీళ్లను చూస్తూన్న ఒక కాకి అందికదా "పులిబావా పులిబావా, నువ్వూ, ఆ బ్రాహ్మడూ కలిసి ఏమిటి వెతుకుతున్నారు" అని.

"ఈ బ్రాహ్మడి పిలక నక్క ఎత్తుకుపోయిందిట. దానికోసం వెతుకుతున్నాము" అంది పులి.

"మనకు పగవాళ్లైన మనుష్యులతో స్నేహం చెయ్యవచ్చునా, పులిబావా" అంది కాకి.

"స్నేహం కాదమ్మా, కాకమ్మా! నాకు దాహం వేస్తోంది. ఈ బ్రాహ్మడి రక్తం రవంత తాగి దప్పిక తీర్చుకొందా మనుకుంటే ఆ పాడుపిలక ఎక్కడో పారేసుకొన్నాట్ట, అది లేందే నేను మనుష్యులిని ముట్టుకోకూడదుకదా!"

"అలాగా? అయితే, నే చెబతా విను. ఇందాకా నేను ఆకాశంమీద షికారు తిరుగుతూంటే ఒకనక్క నోటితో పచ్చని వస్తువు ఒకటి కరుచుకొని, పారిపోతోంది. దాన్ని నే నెరుగుదును."

"అయితే అది ఎక్కడ కాపరం?" అంది పులి.

"అదిగో, ఆ కనిపించే కొండదగ్గిర చెట్టు ఉంది. ఆ చెట్టుకింద ఒక పెద్ద బండ ఉంది. ఆబండ కింద కన్నం ఉంది. ఆ కన్నంలో కాపురం నక్క" అంది కాకి.

"నీ మేలు మరవనుసుమా" అంది పులి.

బ్రాహ్మడూ, పులీ కలిసి బండదగ్గిరికి వెళ్లారు. కాకికూడా వచ్చి చెట్టుమీద వాలింది.

బ్రాహ్మడికి గండం తప్పేటట్లు లేదు. ఎలాగ తప్పించుకోవడమూ అని ఆలోచిస్తున్నాడు. ఇంతట్లోకే పులి అందికదా "అలా గుక్కిళ్లు మింగుతూ నిలబడతావేమిటి బ్రాహ్మడా, పిలు, ఆనక్కను పిలు" అంది.

"నేను పిలిస్తే వస్తుందో రాదో, పులిరాజా! పిలకకోసం వచ్చిఉంటా నని అది తెలుసుకొని పలకదేమోనని భయం. మీరు పిలవమంటే పిలుస్తాను." అన్నాడు బ్రాహ్మడు.

"అయితే నువ్వు పిలవవద్దులే, నేనే పిలుస్తాను" అంది పెద్దపులి.

అప్పుడు కాకి అందికదా "పులిబావా పులిబావా, వద్దు వద్దు, నువ్వు పిలవకు. నువ్వుగానే పిలిస్తే భయపడి అసలే కన్నంలోంచి బయటికి రాదు" అని.

"అయితే ఏమిటి ఉపాయం" అంది పులి.

"ఉపాయానికి ఏముంది? నేనే పిలుస్తాను. కాని ఈ బ్రాహ్మణ్ణి నువ్వూ, నక్కా తింటారుకదా, నాకేమిటి లాభం అనుకొంటున్నాను" అంది కాకి.

"నీకుకూడా ఒకభాగం పంచిపెడతాములే" అంది పులి.

కాకి సరేనని కన్నందగ్గిర బండమీద వాలి పిలవడం మొదలెట్టింది:

తలుపుతియ్యి తలుపుతియ్యి నక్కబావా
చుట్టాలు వచ్చారు నక్కబావా
కట్నాలు తెచ్చారు నక్కబావా
కడుపు నిండిస్తారు నక్కబావా

నక్క కన్నంలో ఉండి తనపిల్లాడికి జడవేసుకొంటోంది. జడవేసి బంగారుపిలక ఆపిల్లాడికి పెట్టాలని అనుకుంది. కాకిపిలుపు విని అందికదా—

చుట్టాలు ఎవరమ్మ కాకమ్మా
కట్నాలు ఏమిటమ్మ కాకమ్మా
చెయ్యారుకోలేదు కాకమ్మా
జడ వేస్తున్నాను కాకమ్మా

అంటే కాకి అందిగదా—

చుట్టాలు నేనేను నక్కబావా
పక్కాలు నేనేను నక్కబావా
కట్నాలు యివిగోను నక్కబావా
కడుపునిండా తినవయ్యా నక్కబావా

అంటే, నక్క ముక్కుతో బయట ఎవరున్నారో అని వాసనచూడ్డం మొదలెట్టింది. మొదట మని

వాసన కొట్టింది. ఈమనిషి ఆబ్రాహ్మడేకదా, పిలక కోసం వచ్చిఉంటాడు అనుకొంది. తరవాత పెద్దపులి వాసన కొట్టింది. పెద్దపులితో చెప్పి దాన్ని తీసుకొని బ్రాహ్మడు పిలక నాదగ్గిర్నుంచి పుచ్చుకోడానికి వచ్చాడనుకొని కాకిమాటలు నమ్మరా దనుకొని అంది కదా —

ఘుట్టాలు వస్తేను కాకమ్మా
గుట్టమీద పీటవెయ్యి కాకమ్మా
చెట్టుమీద కూచోమను కాకమ్మా
జడ వేసి వస్తాను కాకమ్మా

అంటే, పెద్దపులి వచ్చి గుట్టమీద కూర్చుంది. బ్రాహ్మడు చెట్టు ఎక్కేడు. కాకి కన్నం దగ్గిర కూచుని చూస్తోంది.

ఎంతకీ నక్క బయటికి రాలేదు. పెద్దపులికి కోపంవచ్చిది. గాండ్రుగాండ్రుమంటూ అరుస్తూ అంది కదా— "నక్కా నక్కా, నీవు బయటికి వస్తావా రావా? నాకు దాహంగా ఉంది; నువ్వు రాకపోతే నిన్ను చంపేస్తాను. జాగ్రత్త"

అప్పుడు నక్క "ఎందు కంతకోపం పులిబావా! దాహంవేస్తే కాఫీ కాస్తున్నా, తెస్తా ఉండు. ఇంకా ఎవరున్నారు అక్కడ" అంది.

"నేనూ, బ్రాహ్మడూ, కాకిని — చప్పున బంగారుపిలక పట్టుకు బయటికి రా" అంది పులి.

అప్పుడు నక్క ఆలోచించి అనుకొందికదా "ఈ ముగ్గురూ పిలకకోసమే వచ్చారు. నన్ను చంపాలనే వీళ్ల ఉద్దేశం. ఈపిలక నాదగ్గిర ఉంటే ఎప్పటికైనా వీళ్లు నన్ను వదలిపెట్టరు. ఎందు కీపాడుపిలక నాకు? ఇక్కడ పారేసి పిల్లలతోకూడా పెరటిదారిని పారి పోతా" అని.

ఇట్లా అనుకొని నక్క పిలక అక్కడనే వదిలి పెట్టి వెళ్లి పోతూ ఇలా చెప్పింది—

వస్తూంటి వస్తూంటి పులిబావా
పల్లుకొరికి ఎగరబోకు పులిబావా
పిల్లలకు జడవేసి పులిబావా
పళ్లూ కాఫీ తెస్తాను పులిబావా

కాకీ, పులీ చాలాసేపు కూర్చున్నారు అక్కడే. బ్రాహ్మడు చెట్టుచివరకొమ్మమీద కూర్చున్నాడు. ఎంతకూ రాకుంటే పులీ, కాకి మళ్లీ పిలిచారు. సమాధానం లేదు. నక్కమీద పులికి కోపం వచ్చి దాని కన్నం గోళ్లతో పెల్లగించి వేసింది. నక్క లేదు. మోసంచేసి పారిపోయిందిగదా అనుకొని ఇంకోమారు దానిపని పట్టవచ్చు ననుకొన్నది. కాకీ, పులీ కలిసి కన్నం అంతా వెదికితే బంగారుపిలక దొరికింది. కాకికీ, పులికీ సంతోషమైంది.

"దొరికింది, బ్రాహ్మడా, నీబంగారుపిలక! అదృష్ట వంతుడివి! పోతే పోయిందిలే వెధవనక్క—రా, దిగు— ఈపిలక పెట్టుకో— నాకు మరీ దాహంగా ఉంది— నాలిక పిడచకట్టుకుపోతోంది. చప్పున పిలక పెట్టుకో" అంది పులి.

బ్రాహ్మడికి సగంప్రాణం పోయింది. ఇలా అన్నాడు:

"నేరక ఈచిట్టచివరకొమ్మమీద కూర్చున్నాను. ఇప్పుడు ఎలాగ దిగడమో తెలియడం లేదు. నేను పిలక గానీ పెట్టుకుంటే దిగగలనేమో? పెద్దలు చెబ తారుగదా—పిలక సగం బలం అని. కాబట్టి కాకమ్మా! ఆపిలక రవంత యిట్లా తెచ్చిపెడితివా నీకు పుణ్యం ఉంటుంది. నే నాపిలక పెట్టుకొని నెమ్మదిగా చెట్టు దిగుతాను."

"దిగకపోతేనో" అంది కాకి.

"దిగక ఎక్కడికి పోతానమ్మా? భూమిమీద పులిరాజూ, ఆకాశంమీద నువ్వూ, మధ్య నేనూను — ఎక్కడికి పోతాను?"

కాకి ముక్కుతో పిలక తెచ్చి బ్రాహ్మడికి యివ్వబోతూంటే బ్రాహ్మడన్నాడు గదా "ఈరెండు చేతులతోనూ ఈ చెట్టుకొమ్మలు పట్టుకొన్నాను. పిలక ఎలాగ పెట్టుకోగలను? నువ్వే ర వం త పెట్టి పెడుదూ" అని.

చెట్టుకొమ్మమీదనుంచి వీళ్లను చూస్తూన్న ఒక కాకి అందికదా "పులిబావా పులిబావా, నువ్వూ, ఆ బ్రాహ్మడూ కలిసి ఏమిటి వెతుకుతున్నారు" అని.

"ఈ బ్రాహ్మడి పిలక నక్క ఎత్తుకుపోయిందిట. దానికోసం వెతుకుతున్నాము" అంది పులి.

"మనకు పగవాళ్లైన మనుష్యులతో స్నేహం చెయ్యవచ్చునా, పులిబావా" అంది కాకి.

"స్నేహం కాదమ్మా, కాకమ్మా! నాకు దాహం వేస్తోంది. ఈ బ్రాహ్మడి రక్తం రవంత తాగి దప్పిక తీర్చుకొందా మనుకుంటే ఆ పాడుపిలక ఎక్కడో పారేసుకొన్నాట్ట, అది లేందే నేను మనుష్యులిని ముట్టుకోకూడదుకదా!"

"అలాగా? అయితే, నేచెబతా విను. ఇందాకా నేను ఆకాశంమీద షికారు తిరుగుతూంటే ఒకనక్క నోటితో పచ్చని వస్తువు ఒకటి కరుచుకొని, పారిపోతోంది. దాన్ని నే నెరుగుదును."

"అయితే అది ఎక్కడ కాపరం?" అంది పులి.

"అదిగో, ఆ కనిపించే కొండదగ్గిర చెట్టు ఉంది. ఆచెట్టుకింద ఒక పెద్ద బండ ఉంది. ఆబండ కింద కన్నం ఉంది. ఆ కన్నంలో కాపురం నక్క" అంది కాకి.

"నీ మేలు మరవనుసుమా" అంది పులి.

బ్రాహ్మడూ, పులీ కలిసి బండదగ్గిరికి వెళ్లారు. కాకికూడా వచ్చి చెట్టుమీద వాలింది.

బ్రాహ్మడికి గండం తప్పేటట్టు లేదు. ఎలాగ తప్పించుకోవడమా అని ఆలోచిస్తున్నాడు. ఇంతట్లోకే పులి అందికదా "అలా గుక్కిళ్లు మింగుతూ నిలబడతా వేమిటి బ్రాహ్మడా, పిలు, ఆనక్కను పిలు" అంది.

"నేను పిలిస్తే వస్తుందో రాదో, పులిరాజా! పిలకకోసం వచ్చిఉంటా నని అది తెలుసుకొని పలకదేమో నని భయం. మీరు పిలవమంటే పిలుస్తాను." అన్నాడు బ్రాహ్మడు.

"అయితే నువ్వు పిలవవద్దులే, నేనే పిలుస్తాను" అంది పెద్దపులి.

అప్పుడు కాకి అందికదా "పులిబావా పులిబావా, వద్దు వద్దు, నువ్వు పిలవకు. నువ్వుగానే పిలిస్తే భయపడి అసలే కన్నంలోంచి బయటికి రాదు" అని.

"అయితే ఏమిటి ఉపాయం" అంది పులి.

"ఉపాయానికి ఏముంది? నేనే పిలుస్తాను. కాని ఈ బ్రాహ్మణ్ణి నువ్వూ, నక్కా తింటారుకదా, నాకేమిటి లాభం అనుకొంటున్నాను" అంది కాకి.

"నీకుకూడా ఒకభాగం పంచిపెడతాములే" అంది పులి.

కాకి సరేనని కన్నందగ్గిరబండమీద వాలి పిలవడం మొదలెట్టింది:

తలుపుతియ్యి తలుపుతియ్యి నక్కబావా
చుట్టాలు వచ్చారు నక్కబావా
కట్నాలు తెచ్చారు నక్కబావా
కడుపు నిండిస్తారు నక్కబావా

నక్క కన్నంలో ఉండి తనపిల్లాడికి జడవేసుకొంటోంది. జడవేసి బంగారుపిలక ఆపిల్లాడికి పెట్టాలని అనుకుంది. కాకిపిలుపు విని అందికదా—

చుట్టాలు ఎవరమ్మ కాకమ్మా
కట్నాలు ఏమిటమ్మ కాకమ్మా
చెయ్యాలేరుకోలేదు కాకమ్మా
జడ వేస్తున్నాను కాకమ్మా

అంటే కాకి అందిగదా—

చుట్టాలు నేనేను నక్కబావా
పక్కాలు నేనేను నక్కబావా
కట్నాలు యివిగోను నక్కబావా
కడుపునిండా తినవయ్యా నక్కబావా

అంటే, నక్క ముక్కుతో బయట ఎవరున్నారో అని వాసనచూడ్డం మొదలెట్టింది. మొదట మని

వాసన కొట్టింది. ఈమనిషి ఆ బ్రాహ్మడేకదా, పిలక కోసం వచ్చిఉంటాడు అనుకొంది. తర్వాత పెద్దపులి వాసన కొట్టింది. పెద్దపులితో చెప్పి దాన్ని తీసుకొని బ్రాహ్మడు పిలక నాదగ్గిర్నుంచి పుచ్చుకోడానికి వచ్చాడనుకొని కాకిమాటలు నమ్మరా దనుకొని అంది కదా —

చుట్టాలు వస్తేను కాకమ్మా
గుట్టమీద పీటవెయ్యి కాకమ్మా
చెట్టుమీద కూచోమను కాకమ్మా
జడ వేసి వస్తాను కాకమ్మా

అంటే, పెద్దపులి వచ్చి గుట్టమీద కూర్చుంది. బ్రాహ్మడు చెట్టు ఎక్కేడు. కాకి కన్నం దగ్గిర కూచుని చూస్తోంది.

ఎంతకీ నక్క బయటికి రాలేదు. పెద్దపులికి కోపంవచ్చిది. గాండ్రుగాండ్రుమంటూ అరుస్తూ అంది కదా— "నక్కా నక్కా, నీవు బయటికి వస్తావా రావా? నాకు దాహంగా ఉంది; నువ్వు రాకపోతే నిన్ను చంపేస్తాను. జాగర్త"

అప్పుడు నక్క "ఎందు కంతకోపం పులిబావా! దాహంవేస్తే కాఫీ కాస్తున్నా, తెస్తా ఉండు. ఇంకా ఎవరున్నారు అక్కడ" అంది.

"నేనూ, బ్రాహ్మడూ, కాకీని — చప్పున బంగారుపిలక పట్టుకు బయటికి రా" అంది పులి.

అప్పుడు నక్క ఆలోచించి అనుకొందికదా "ఈ ముగ్గురూ పిలకకోసమే వచ్చారు. నన్ను చంపాలనే వీళ్ల ఉద్దేశం. ఈపిలక నాదగ్గిర ఉంటే ఎప్పటికైనా వీళ్లు నన్ను వదలిపెట్టరు. ఎందుకీపాడుపిలక నాకు? ఇక్కడ పారేసి పిల్లలతోకూడా పెరటిదారిని పారిపోతా" అని.

ఇట్లా అనుకొని నక్క పిలక అక్కడనే వదిలిపెట్టి వెళ్లిపోతూ ఇలా చెప్పింది—

వస్తూంటి వస్తూంటి పులిబావా
పళ్లుకొరికి ఎగరబోకు పులిబావా
పిల్లలకు జడవేసి పులిబావా
పళ్లూ కాఫీ తెస్తాను పులిబావా

కాకీ, పులీ చాలాసేపు కూర్చున్నారు అక్కడే. బ్రాహ్మడు చెట్టుచివరకొమ్మమీద కూర్చున్నాడు. ఎంతకూ రాకుంటే పులీ, కాకీ మళ్లీ పిలిచారు. సమాధానం లేదు. నక్కమీద పులికి కోపం వచ్చి దాని కన్నం గోళ్లతో పెల్లగించి వేసింది. నక్క లేదు. మోసంచేసి పారిపోయిందిగదా అనుకొని ఇంకోమారు దానిపని పట్టవచ్చు ననుకొన్నది. కాకీ, పులీ కలిసి కన్నం అంతా వెదికితే బంగారుపిలక దొరికింది. కాకికీ, పులికీ సంతోషమైంది.

"దొరికింది, బ్రాహ్మడా, నీబంగారుపిలక! అదృష్టవంతుడివి! పోతే పోయిందిలే వెధవనక్క—రా, దిగు—ఈపిలక పెట్టుకో—నాకు మరీ దాహంగా ఉంది—నాలిక పిడచకట్టుకుపోతోంది. చప్పున పిలక పెట్టుకో" అంది పులి.

బ్రాహ్మడికి సగంప్రాణం పోయింది. ఇలా అన్నాడు:

"నేరక ఈచిట్టచివరకొమ్మమీద కూర్చున్నాను. ఇప్పుడు ఎలాగ దిగడమో తెలియడం లేదు. నేను పిలకగానీ పెట్టుకుంటే దిగగలనేమో? పెద్దలు చెబతారుగదా—పిలక సగం బలం అని. కాబట్టి కాకమ్మా! ఆపిలక రవంత యిట్లా తెచ్చిపెడితివా నీకు పుణ్యం ఉంటుంది. నే నాపిలక పెట్టుకొని నెమ్మదిగా చెట్టు దిగుతాను."

"దిగకపోతేనో" అంది కాకి.

"దిగక ఎక్కడికి పోతానమ్మా? భూమిమీద పులిరాజూ, ఆకాశంమీద నువ్వూ, మధ్య నేనూను - ఎక్కడికి పోతాను?"

కాకి ముక్కుతో పిలక తెచ్చి బ్రాహ్మడికి యివ్వబోతూంటే బ్రాహ్మడన్నాడు గదా "ఈరెండు చేతులతోనూ ఈ చెట్టుకొమ్మలు పట్టుకొన్నాను. పిలక ఎలాగ పెట్టుకోగలను? నువ్వే రవంత పెట్టి పెడుదూ" అని.

అంటే, కాకి బ్రాహ్మడి తలకు పిలక తగిలించింది. తగిలిస్తూంటే బ్రాహ్మడు తటాలున దాన్ని పట్టుకొని తన బట్టలో మూట గట్టి కింద పడవేశాడు. పిలక బాగా తగిలించుకొని కూర్చున్నాడు.

"అదేమిటి, బ్రాహ్మడా, ఆ కాకిని మూటగట్టి కింద పడవేశావు. నీవు మోసగాడివలె ఉన్నావే" అంది పులి.

"రామరామా! నేను మీపట్ల మోసం చేస్తానా? చేసి ఎక్కడికి వెడతాను? మీకు దాహం ఎక్కువగా ఉన్న దన్నారు గదా, నేను దిగేలోపుగా ఈ కాకి రక్తం కొంచెం పీల్చి దాహం తీర్చుకుంటారని పడవేశాను. ఇష్టం లేకుంటే మూట విప్పివెయ్యండి." అన్నాడు బ్రాహ్మడు.

"నీ రక్తం కావాలి నాకు, కాకిరక్తం కాదు" అంది పులి.

"అయితే దిగుతున్నా; కాని ఒకసందేహం మనస్సుని బాధిస్తోంది. ఇప్పుడు రెండుజాముల రాత్రి అయింది. పొద్దున్న పంచాంగం చూశాను. సరిగ్గా ఇది వర్జ్యసమయం. ఈవర్జ్యసమయంలో చెట్టు దిగడానికి కాళ్లూ చేతులూ అడ్డంలేదు. అంతేకాకుండా ఈ వర్జ్యసమయంలో మీరు నారక్తం తాగితే ఏం కడుపునొప్పి వచ్చి బాధపడతారో అని నాకు దిగులుగా ఉంది"

"అన్నా! ఎంతమోసగాడివి నీవు—ఉండు నీ సంగతి చూస్తాను. చిరతపులిని పిలిచి నిన్ను కిందకు లాగించకపోతే నాపేరు పెద్దపులి కాదు."

"ఎందుకు పులిరాజా! నామీద నీలాపనిందలు వేస్తారు—ఇక నాలుగుగడియలకు వర్జ్యం పోతుంది. పోయీపోవడంతోనే నేను చెట్టు దిగుతాను, తరవాత నారక్తం మీరు తాగవచ్చు"

"సరే, నే నీచెట్టుమొదటే కూర్చుంటాను. నీవు ఎక్కడికి పోతావో చూస్తానుగా" అంది పులి. చెట్టుమీద బ్రాహ్మడూ, చెట్టుకింద పులీ చాలాసేపు కూర్చున్నారు.

కొంతసేపైనతర్వాత అన్నాడుకదా బ్రాహ్మడు "ఏదో దూరాన్ని అలుకు డొతోంది పులిరాజా, వినిపిస్తోందా ?" అని.

"చెట్టుమీద ఉన్నావుకదా—అదేదో చూచి చెప్పు" అంది పులి. అప్పు డాబ్రాహ్మడు అన్నాడు—

మందలు మందలు జింకలమందలు
మందలు మందలు లేళ్లమందలు
పచ్చనివళ్లూ చుక్కలవళ్లూ
సన్నటికాళ్లూ గుండ్రనికళ్లూ
అన్నీ మందలు అవిగో మందలు
మందలు మందలు జింకలమందలు
మందలు మందలు లేళ్లమందలు
మందలు మందలు మందలు మందలు.

"ఎక్కడ, ఎక్కడ? ఆమంద లెక్కడ, బ్రాహ్మడా? సరిగ్గా చూచి చెప్పు" అంది పులి ఆశతో బ్రాహ్మ డన్నాడుగదా—

కొండలదాపున సరస్సుదగ్గిర
లోయల్లోపల పొదలచాటునా
సూటికొమ్ములూ కొమ్మలకొమ్ములూ
పదునుగిట్టలూ నిండుపొట్టలూ
మందలుమందలు జింకలమందలు
మందలు మందలు లేళ్లమందలు
మందలు మందలు మందలు మందలు.

"నిజంగానేనా, బ్రాహ్మడా?" అంది పులి తొందరగా.

"నిజమేనయ్యా, ఎంత కన్నులపండుగ, ఎన్ని జింకలు, ఎన్ని జింకలు!

ఉత్సాహంతో ఉరుకుతున్నవి
గబగబ గబగబ గంతుతున్నవి
గిరగిర గిరగిర తిరుగుతున్నవి
చంగు చంగునా ఎగురుతున్నవి

తళతళ కళ్లు గిరగిర తిరగా
పచ్చిక కొంచెం కొరుకుతున్నవి
మేమే అంటూ అరుస్తున్నవి
సరస్సు నీళ్లు తాగుతున్నవి
మందలు మందలు జింకలమందలు
మందలు మందలు లేళ్ల మందలు
వేలూ లక్షలు కోట్లు మందలు
మందలుమందలు మందలుమందలు.

బ్రాహ్మడు పాడుతూంటే పులికి నోరూరుతోంది. ముక్కుతో వాసనచూచింది. కొంచెం జింకల వాసన కొట్టినట్లయింది. చెవులు నిక్కించి విన్నది. కొంచెం అలికిడుకూడా వినిపించినట్లయింది.

బ్రాహ్మడు మళ్లీ—

ఆకాశంలో చుక్కల మిలమిల
కొండదాపులో జింకల మిలమిల
అడివి అంతటా జింకల కలకల
దుబ్బుల్లోనూ చెట్లపక్కనా
బండలమధ్యా సరస్సుదరినీ
మైదానంలో చరియల్లోనూ
కిందా మీదా ముందూ వెనకా
ఔరా మందలు జింకలమందలు
ఆడజింకలూ పిల్ల జింకలూ
పొడలజింకలూ పొట్టిజింకలూ
మందలుమందలు జింకలమందలు
మందలుమందలు లేళ్ల మందలు
మందలుమందలు మందలుమందలు.

పెద్దపులి బ్రాహ్మడు పాడిన పాట విని చెట్టు కింద ఉండలేకపోయింది. రంయిన బయలుదేరి ఉరుకుతూ కొండలకేసి పరుగెత్తుకుపోతూంటే బ్రాహ్మడు గట్టిగా —

మందలుమందలు జింకలమందలు
మందలుమందలు లేళ్లమందలు
ఒకటా రెండా మూడా నాల్గా
వందలు వేలు లక్షలు కోట్లు
కొండలచుట్టూ కెరటాలా అవి
సుడిగుండాలా సముద్రంపోటా
మందలుమందలు జింకలమందలు
మందలుమందలు లేళ్లమందలు
మందలుమందలు మందలుమందలు.

అని పాడుతూనే ఉన్నాడు. పెద్దపులి మాయమయింది.

తెల్లవారింది. జాముపొద్దెక్కేదాకా బ్రాహ్మడు చెట్టుమీదే కూర్చుని, తరవాత చెట్టు దిగి, మూట విప్పి కాకిని వదిలిపెట్టి, కండువా తీసికొని, బంగారుపిలక సరిగ్గా ఉందో లేదో చూచుకొని అత్తారింటికి నడిచిపోయాడు."

*　　*　　*

"అయిందా, తాతయ్యా, కథ?"

"అయిందిరా, ఇంక పడుకో."

"మరి పెద్దపులి ఏమయింది?"

"జింకల్ని వేటాడి కడుపునిండాక తన గుహలో నిద్రపోడానికి పోయింది."

"బ్రాహ్మడున్న చెట్టుదగ్గిరికి రాలేదూ?"

"పగటివేళ పులులు తిరగవు. వాటికి నిద్ర వస్తుంది. గుహలోకి పోయి నిద్రపోతాయి"

కథ కంచికి వెళ్లింది. తాతయ్యపక్కలో అబ్బాయి నిద్రపోయాడు.

# మేఘసందేశము: కళాప్రతిభ

[పూర్వమేఘమునకు సౌందర్యవ్యాఖ్యానము]

పూర్వమేఘముపట్ల పండితుల ఉదాసీనత—మేఘదూతము ఖండకావ్యమా?—గానము లేనిది 'లిరిక్కు' ఎట్లగును?—మేఘదూతలోని అమృతమయసృష్టి—యక్షపత్ని సౌందర్యము—యక్షుని ఐశ్వర్యము—యక్షుడు చేసిన తప్పిదము—విరహశిక్షకు అనువైన రామగిరి స్థలనిర్దేశము—రామగిరిలో యక్షుడు పడిన పాట్లు—దిఙ్నాగుని ఉదంతము—మూలవశబ్ద నిర్వచన

## మహామహోపాధ్యాయ శ్రీ హరప్రసాదశాస్త్రి

సంస్కృతసాహిత్యమందు కాళిదాస భవభూతులు నిరుపమానులు. కల్పనామహిమ, భాషాప్రయోగము, సౌందర్యప్రకటన, శిల్పనైపుణ్యము—వీటియందు అతులనీయులు. వీరి రచనలయం దైదుగ్రంథములు సర్వోత్కృష్టములు. మహా మహిమాన్వితమగు హిమాలయపర్వతరాజము గౌరీశంకర్, కాంచనగంగ, ధవళగిరి, ముక్తినాథము, గోసాయిగిరి యను పంచశిఖరముల విరాజిల్లుచుండువిధముననే సంస్కృతసాహిత్యము రఘువంశము, ఉత్తర రామచరితము, శాకుంతలము, మేఘసందేశము, కుమారసంభవము నను వానితోడ అలరారుచున్నది.

ఈ యైదు గ్రంథముల కనేక వ్యాఖ్యానములు గలవు. కాని యవి భావము తెలిసికొనుట కుపయోగకరములు. అందు కొన్ని భావమును వెలువరించుటకు బ్రయత్నించినవి కలవు. కాని సౌందర్య వ్యాఖ్యానమునకు గడంగుట వాని ముఖ్యోద్దేశ్యము కాదు. అందువలన నే నా సౌందర్యవ్యాఖ్యానమునకు గడంగదలచితిని. ఇందుకు దాదాపు ముప్పది వత్సరములనుండియు ప్రయత్నించుచు, సంసిద్ధ మగుచుంటిని. ప్రత్నతత్త్వ విషయములను అనుసంధాన మొనర్చితిని. పలుదేశముల సంచరించితిని. పలుగ్రంథముల బఠించితిని. క్రమక్రమముగ సౌందర్య మొకింత వికసింపజొచ్చెను. దృష్టిమండలము విశాల మైనకొలదిని సౌందర్యసౌకుమార్యముకూడ విపులము గాజొచ్చెను. అందువలన నన్నిటికంటెను చిన్న దగు మేఘసందేశమునకు సౌందర్యవ్యాఖ్యాన మొనర్ప దలచితిని. కాని యది యన్నిటికంటెను కఠిన కార్యము. అందలి ప్రాచీనభూగోళసంబంధమున ననేకజటిలసమస్యలు ఇమిడియున్నవి. వాని విషయమున నొకవిధముగ మీమాంసకు వచ్చితిని. దేశకాలభేదముల ననుసరించి పాఠకులకు రుచిభేదము కలుగుచుండును. కాని సౌందర్యముమాత్రము మార్పు చెందదు. నేను వ్యాఖ్యాతనుమాత్రమే యగుటవలన కాళిదాసుమార్గమునే యనుసరించుట న్యాయముగదా! అనేకవిషయములు నేటి మానవులకు రుచిసంగతములు గావని బాగుగ గ్రహించితిని. ఆందోళనపడజొచ్చితిని. నేటికాలమున కేది రుచిసంగతమో, ఏది రుచిసంగతము కాదో నుడువగలవా రెవ్వరు? చివరకు సురసికులు, విచక్షణులు నగు ఇర్వురుపండితుల హస్తమందు నా వ్రాతప్రతి నర్పించితిని. అం దొకరు రామేంద్రసుందర త్రివేది; రెండవవారు పార్జిటల్ దొరగారు. వీరిర్వురును పరిశ్రమ యొనర్చి, మూలముతోడ వ్యాఖ్యానమును పోల్చి చూచి యనేకసదుపదేశము లొనర్చిరి. వారి

యుపదేశముల ప్రకారము కొన్నిటిని దీసివైచితిని. మరి కొన్నిటిని మార్చితిని. అందువలన సౌందర్యమునకు హాని సంభవించెను. కాని రుచికొరకు మార్పులు చేయక తప్పినదికాదు. సంస్కృతకావ్యమునకు బంగాళీ వ్యాఖ్యానమే నూతనము. భావము, వ్యాకరణమును, అలంకారములను వీడి విశుద్ధసౌందర్యవ్యాఖ్యానమునకు గడంగుట మరింత నూతనము. సౌందర్యమును ప్రదర్శించునప్పుడు భూగోళము, ఇతిహాసము, పురాతత్వము, స్వభావము, నరచరిత్ర మొదలగునవి పేర్కొనుటయు నూతనమేను. కావున నీనూతనప్రయత్నమందు భ్రమప్రమాదము లుండుట సహజము. పాఠకులు మన్నింతురుగాత.

*        *        *        *

ఈ గ్రంథమునుగూర్చి లోకుల వాడుకయందున్న విమర్శన మొందు గలదు. అది యిది: "కాళిదాసు మేఘదూతను రచించునప్పు డందలి శ్లోకములను క్రమముగ నొక మానినికి వినిపించుచుండెను. గ్రంథము పూర్తియైనపిమ్మట ఆమె యంగీకార మొసగినచో గ్రంథమును ప్రచారములోనికి దెచ్చుటకును, లేకున్న మానుకొనుటకును నిర్ణయించుకొనెను. ఆమె గ్రంథ మంతయును పూర్తియైనపిమ్మట పూర్వమేఘము స్వర్గసోపానతుల్యమనియు, ఉత్తరమేఘము సంపూర్ణముగ రసగుళికయనియు నుడివెను. ఇం దెంతవరకు సత్యము గలదో గమనింపవలయును. పూర్వమేఘమును సోపానప్రాయముగ దలచుట భావ్యము గాదు. కాని యీవిమర్శవలననే యనేకవత్సరములనుండి నేటికిని పండితులు పూర్వమేఘవిషయమున నశ్రద్ధ చూపుచున్నారు. మరియు పూర్వమేఘమును చదివినగాని యుత్తరమేఘము సరిగ బోధపడ దని తలచి, దీనిని చదువుచుందురు. కాని వాస్తవమునకు లోకుల యపరాధమిందు గానరాదు. ఇం దుదాహరించిన దేశము లెచ్చట గల్గవను విషయము వారి కవిదితము. వరుసగ నొకదానితర్వాత మరియొకటి చిత్రింపబడెనా, లేదా యనువిషయ మంతకంటెను తెలియదు. అందువలన

**పూర్వమేఘముపట్ల పండితుల ఉదాసీనత**

పూర్వమేఘమును చదువునప్పుడు నిరుత్సాహులగుచుందు రనుట యసంగతము కాదు. మల్లినాథసూరి వ్యాఖ్యగూడ నటులనే యున్నది.

పూర్వమేఘము కాళిదాసుకవిత్వమందలి యొక భావమయతరంగము. అం దామహాకవి జడప్రకృతిని చైతన్యమయముగ నొనర్చెను. యథార్థమునకు మేఘము జడమైనను, చైతన్యమయ మగుటయేగాక మేఘ మాకాశమునుండి జడప్రకృతిని గాంచగలిగినంత దూరమును చైతన్యమయమాయెను. ఈవిధముగ జడమును సుసుందరభావమున చైతన్యమయముగ నొనర్చుటను నే నేగ్రంథమందునను గాంచియెరుగను.

కాళిదాసుగూడ మిగతరచనలయం దెచ్చటను నిట్లొనర్చియుండలేదు. కుమారసంభవ రఘువంశములందు బాహుళ్యముగ వర్ణనలు గలవు. కాని యందలి జడము జడమేను. కుమారసంభవ, రఘువంశములందారవసర్గయందుమాత్రము హిమాలయమును జడముగను, చైతన్యముగను వర్ణించెను. కాని యా వర్ణనలయం దైక్యము లేకుండుటవలన నవి ద్విరూపములుగ నున్నవి. కాని మేఘదూతయం దట్లు గాదు. జడమగు పూర్వమేఘము చైతన్యమయము, భావమయము, ప్రేమమయము నగు రూపమును దాల్చినది.

అలంకారశాస్త్రమందు మేఘసందేశము ఖండకావ్య మని నుడువబడియున్నది. ఇంగ్లీషువారు దీనిని 'లిరిక్' అని పిలుచుచున్నారు. కాని దీనియం దెంతవరకు సత్యముండగలదు? ఖండకావ్య మనగా ఏదియో యొకదానినుండి తీసిన ముక్క, లేక తునుక యని ద్యోతకమగును. కాని అట్లు తలచుట కాళిదాసు నవమానపరచుటయే యగును. మేఘదూత యొక ముక్క కాదు; సంపూర్ణము, సర్వాంగశోభితము, అప్రమేయము. కావున మేఘదూతమును ఖండము-తునుక-ముక్క యని యెప్పుడును నుడువజనదు. చిన్నకావ్య మని నుడివిన నుడువవచ్చును. చిన్నదైనను ఫలమత్యధికము సుమా! అందువలన ఖండకావ్య మనునప్పుడు తునక యని భావింపరాదు.

**మేఘదూతము ఖండకావ్యమా?**

'లిరిక్' అని నుడువుటకు కారణము ఉత్తర మేఘమందు గాన్పించును. కాని యంతమాత్రమున నుత్తర మేఘమును 'లిరిక్' అని నుడువుటకు వీలు లేదు. బాహ్య కారణములవలన 'లిరిక్' అని యన దలచిన అనవచ్చును. మరియు, ఉత్కృష్ట మగు 'లిరిక్' కావ్యములయందలి భావతన్మయత్వము ఉత్తర మేఘమం దుండుటవలన దానిని 'లిరిక్' అని పిలువదలచిన పిలువవచ్చును. కాని యపార కల్పనామయమును, అత్యంత రమణీయమును నగు సృష్టిని 'లిరిక్' అని నుడువుటెట్లో నామనమునకు గోచరింప కున్నది. ఇంతేకాక మేఘదూత గానపూరితము కాదు. గానము లేనిచో 'లిరిక్' ఎట్లగును?

**గానము లేనిది 'లిరిక్కు' ఎట్లగును?**

ఖండ మనునప్పుడు నవనీతఖండ మనుడు, చక్కెరఖండ మనుడు, లేక యమృతఖండ మనుడు. అప్పు డర్థము సరిగ నుండును. అందు పరిత్యజింపవలసిన దుండదు; కలుపవలసిన దంతకంటె నుండదు. అంతయు మధురమే, సుస్వాదువే!

తన్మయకావ్యమే ఖండకావ్య మని నుడువదలచుచో కొంతవరకు రాజీ యున్నది. అక్కాలమున ఖండశబ్దమును కవు లేవిధముగ నుపయోగించుచుండిరి? త్రయోదశశతాబ్దమందు నైషధకారుడు 'ఖండనఖండ ఖాద్యరచన' నొనర్చెను. ఆరవశతాబ్దమందు బ్రహ్మగుప్తుడు జ్యోతిషవిషయమగు 'ఖండఖాద్యము'ను రచించియున్నాడు. కాని నే నిప్పుడు చెప్పునది అక్కాలమున ఖండకావ్యార్థమున చైతన్యచరిత్ర యెట్లు మధుమయము, అమృతమయము నగు కావ్యమో, యట్టిదే మేఘసందేశము కాని మరియొకవిధమున బలుకుటకు వీలులేదు. తలచుటకును వలనుపడదు.

మేఘదూతము 'లిరిక్' కావ్యము గాదు, ఖండము - ముక్క - తునుక కావ్యము కా దనుట నిశ్చయము. ఇంతవరకు రచింపబడిన యే మహాకావ్యమును గూడ దీనితో బోల్చుటకు వీలులేదు. మహాకావ్యములని నుడువబడు వానియందు నూతనసృష్టి యుండును. కాని మేఘదూతసృష్టి యపూర్వము; నిరుపమానము. పృథ్వి-ఆకాశము-మానవులు - మనుష్యచరిత్ర - చెట్టుపుట్టలు మొదలగువానిని ఇటునటు త్రిప్పి, అంగీకరించి నూతనవిధముగ జూపవచ్చును. లేదా యొకరిద్దరు వ్యక్తులను నూతనముగ సృష్టింపవచ్చును. కాని మేఘసందేశమో—అంతయు నూతన సృష్టియే. పృథ్వి, చెట్లు, పుట్టలు, లతాగుల్మములు, నదీనదములు, మహారణ్యములు, స్త్రీపురుషులు, సంఘము, సంఘపరిస్థితుల నతిక్రమించిన నూతనసృష్టియే మేఘదూతము. మేఘదూత సృష్టి నతిక్రమించిన దని నుడువదలచిన నుడువుడు. కాని కవిసృష్టి యని తెలిసిగ నుడువజెల్లదు. అలకానగర మొక యపూర్వసృష్టి. అత్యంత విశాలమగు భారతవర్ష మందు కాళిదాసునకు నచ్చిన నగరమే కన్పింపకుండెను. ఆత డనేక దేశము లెరుగును. పారసీక, యవన మొదలగు దేశములేకాక భారతవర్షమునకు లవంగములు వచ్చు ద్వీపముల విషయముగూడ నాయనకు తెలియును. కాని యొచ్చటను తగు స్థానమాయనకు గోచరింపకుండెను. అందువలన హిమాలయపర్వత శృంగములయం దత్యంతదీర్ఘమును, మానవుల కగమ్యమును, కేవలము స్వీయకల్పనకు మాత్రమే గమ్యమును నగు స్థానమందు అలకానగరమును నిర్మించెను. అచ్చట భారతవర్షములోని నగరములయందలి కట్టుబొట్లు లేవు. స్వీయస్వేచ్ఛానుసారముగ నానగరమును సుఖమయముగను, ఆనందమయముగను నొనర్చెను. అందలి మానవులుగూడ నట్టివారలే. భూమండలమందలి మానవు లెప్పుడును వారిని చూచి యెరుగరు. ఇకముందు చూడబోరు. వారి సమాజనీతి, శాసనపద్ధతి నూతనము. అవి యన్నియు మహాకవియొక్క కల్పనాప్రవాహము యొక్క యమృతమయఫలములు.

**మేఘదూతలోని అమృతమయ సృష్టి**

బహుకాలమునుండి యూరపునందు మహాపండితులు సంసార మెట్లు సుఖమయ మగునని యోచించుచుండిరి. ప్లేటో రిపబ్లిక్కను గ్రంథమును రచించెను. మిల్టను, థామసు మొదలగువారు కొన్ని గ్రంథములను రచించిరి. అం దనేకచరిత్రలను సృష్టించిరి. అందు మానవుడు సుఖస్వచ్ఛందముల విహరించు మార్గములను

సూచించిరి. ఆప్రయత్నము లెంతవరకు సఫలమాయె నను విషయముతోడ నిట బనిలేదు. కవితావతంసు డగు కాళిదాసు వారి ప్రయత్నముల నతిక్రమించి సుఖమయమును, ప్రేమమయమును నగు సంసారమును సృష్టించి మన సమ్ముఖమం దునిచియున్నాడు. ఆహా! యెట్టి నూతనసృష్టి! కవిసృష్టియం దింతటి విపులలీలయా? ఇట్టి మహాకావ్యమును ఖండ మనియు, 'లిరిక్' అనియు తలచుచు తృప్తినొందు టెట్లు? నే నొకప్పుడు మేఘదూతను ఎడిసనుకు నకలుగ మధురకబళ మని నుడివియుంటిని. ఆఁ, యెంతటి భ్రమ! తదనంతరము నాభ్రమను నేను దెలిసికొంటిని. మేఘదూత యుత్కృష్టతనుగూర్చి యాందోళన మొనర్చితిని. అందలి యసీమ సృష్టినైపుణ్యమును భావమయ, చైతన్యమయ, ఉచ్ఛ్వాస సమయ, ఆవేగమయ కవిత్వలహరి మనోమధ్యమున బ్రవహించిన కొలదిని కాళిదాసుయొక్క యత్యద్భుతకవితాశక్తికి ముగ్ధుడను గాజొచ్చితిని.

మేఘసందేశమందు ప్రధానాకర్షణమంత్రము యక్షపత్ని. ఆమె సౌందర్యరాశి యనదెల్లును. కాని

**యక్షపత్ని సౌందర్యము**

కృశాంగి. శరీరచ్ఛాయ తప్తకాంచనతుల్యము. 'శిఖరిదశనా' — తీర్చిన పలువరుస గలది—దాడింబబీజములవంటి దంతపంక్తిగలది 'పక్వబింబాధరోష్ఠీ'—ఆమె యధరోష్ఠము పండిన దొండ పండును ధిక్కరించుచుండును. 'మధ్యేక్షామా'—సన్నని నడుము గలది. సన్ననినడుము సౌందర్యద్యోతక మని మన కవుల ధారణ. అందువలన 'పరమాణుమధ్య' 'సదసత్సంశయగోచరోదరి' అని వర్ణించియున్నారు. కాని కాళిదాసుమాత్ర మిట్టి యుత్కటవర్ణనల పక్షపాతి గాడు. 'చకితహరిణీప్రేక్షణా'—బెదరిన ఆడులేడి చూపులవంటి దృక్కులు గలది. హరిణనేత్రములు ముఖమున నుండవలసినంతకంటెను పెద్దవిగ నుండును. అందు దెలుపుగ నుండవలసిన భాగముగూడ జలమును బోలి తళతళలాడుచుండును. ఇక భయపడినప్పుడో, మిక్కిలిగ తళతళలాడుచుండును గదా. 'నిమ్ననాభిః'—గభీరమగు పొక్కిలి గలది. 'శ్రోణీభారాత్ అలసగమనా'—పిరుదులు పెద్దవగుటవలన గమనము మందము. 'స్తోకనమ్రా స్తనాభ్యాం'—అందువలన నామె యొకింత వంగుచున్నదా యని తోచును. ఆమె మిక్కిలి మితభాషిణి. అవసరము ననుసరించి బహుసంక్షిప్తముగ మాటలాడు ననియేగదా భావము. విధాత రమణీయమగు ఉపకరణముల నన్నిటిని నేర్చికూర్చి సౌందర్యసృష్టికి ప్రారంభమందు స్వీయభార్యను సృష్టించెనని యక్షుని నమ్మకము. మరియు నామె నాతడు ద్వితీయప్రాణముగ తలచుచుండెను. అందువలన భ్రమప్రమాదములకు లోనగుచు కర్తవ్య కార్యములనే మరచుచుండెను.

యక్షుడు చాల గొప్పవాడు; మహాధనికుడు. అట్లనుటవలన నొకటిరెండుకోట్ల రూప్యములు గలవారితోడ నాతనిని బోల్పజనదు.

**యక్షుని ఐశ్వర్యము**

కోటి, అర్బుదము, బృందము, ఖర్వము, నిఖర్వము, శంఖము, పద్మము—ఈ సంఖ్యల యం దీతని ధనము పద్మము, లేక శంఖము. ౧౧౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦ ఇంతకు పైబడిన ధనికుడు. అలకానగరమందు దొంగల భయమే లేదుగదా. అందువలన నాయనద్వారమం దొక శంఖమును, పద్మమును చిత్రించియుండెను. దీనివలన నాతని యైశ్వర్యము లోకులకు గోచరించుచుండెను. ఇక్కాలమున వర్తక కంపెనీలవారు రిజర్వుఫండు లక్షలు, లేక కోట్లని ప్రచురించుట లేదా? కాని యక్కాలమునం దీపద్ధతి లేదు. శంఖమును, పద్మమును పెద్ద గంగాళముల మీద చిత్రించి వానిని సింహద్వారమున కిరుప్రక్కల బెట్టుచుండిరి. మానవుల దృష్టియం దీతడు మహాధనికుడు. ఈతని ధనపరిమితి మిక్కుటము. కాని కుబేరుని రాజధానియం దీతని ధన మొక లెక్కలోనిదా? అందువలన నీతనిని ప్రథమశ్రేణిధనికులయందు బరిగణించుటకు వీలులేదు. కారణమా, ఈతడు కుబేరుని కొలువునం దొక యుద్యోగి. అదియును అంతపెద్ద యుద్యోగము కాదు. స్వల్పోద్యోగమును కాదు. ఏలయన, నీతడు కుబేరుని దృష్టియందున్నవాడు. మంచి రెయిజింగు ఆఫీసరు. అభివృద్ధిలోనికి వచ్చుచున్న యుద్యోగి. కర్తవ్యనిర్వహణమం దశ్రద్ధ చేయుచున్నా డని యీతడు శిక్షింపబడెను. కాని కారణము సరిగా వర్ణింపబడలేదు.

కాని, మనము చెప్పవచ్చును. ధనైశ్వర్యముల మాట యటుండుడు. ఈతని వయసే ముఖ్యకారణము. యౌవన మీతనిని తల్లక్రిందు లొనర్చుచుండెను. వయసు స్వల్పము. సుసుందరియగు భార్య లభించుటవలన ధన్యుడనని యీతని తలంపు. అందువలన నాఫీసునకు ఆలస్యముగ వచ్చుచుండెను. కర్తవ్య కార్యము లను మరచు చుండెను—మరవకున్నను సరిగ నిర్వహింప జాలకుండెను. శంఖము – పద్మములకంటెను అమూల్య నిధి లభించె నని ఉబ్బి తబ్బిబ్బులగుచు సమస్తమును మరచుచుండెను. అట్టిచో, కుబేరుని కర్తవ్య మేమి? ప్రథమమున కుబేరుడు యక్షుని మంచిమాటలతో మందలించి చూచెను. లాభము లేకుండెను. తదనంతరము గద్దించెను—భయపెట్టెను. కాని యణుమాత్రమైనను ప్రయోజనము కలుగలేదు. అందువలన యక్షుని యసాధారణరోగమునకు ప్రతిక్రియ యొనర్చుట కర్తవ్యమాయెను. అపరాధమా, చాలగొప్పది. ఎట్టిశిక్షను విధింపనగును? యోచించెను. పరిపరివిధముల పరికించి చూచి చివర కొక నిర్ణయమునకు వచ్చెను. కాని యది జుల్మానా కాదు—ఖైదుకాదు—విరహశిక్ష. వత్సర కాలము విరహశిక్ష.

**యక్షుడు చేసిన తప్పిదము**

వృద్ధుడగు కుబేరుడు మిక్కిలి దుష్టుడు. అందువలన కపటహాస మొనర్చుచు యక్షుని గాంచి యిట్లనియెను: "ఓయి యక్షుడా! నీ కొక వత్సరకాలము విరహశిక్షను విధించుచున్నాను. శ్రీమద్రామాయణము చదివియే యుందువు. కావున నీవు రామగిరి కరిగి అచ్చట శిక్షాకాలము ముగియువర కుండుము" మరియు "వీడు పిచ్చివాడు. సందు దొరికిన తిరిగి రావచ్చును." అని భావించి వాని 'మహిమ'ను ఆకర్షించెను. అనగా దేవతలబోలి యక్షుడు అణువై, లఘువై, నలుదిక్కుల వ్యాపించి తిరిగి భార్యకడకు వచ్చుమార్గమును బంధించివైచెను. భారతవర్షమందలి యేయితర పట్టణములకు బంపించినను వ్యాపారమందు దగుల్కొనవచ్చు ననియు, కేదారము, కాశి మొదలగు పుణ్యతీర్థము లైనచో ధర్మకర్మలయందు మనమును

**విరహశిక్షకు అనువైన రామగిరి**

జొప్పించవచ్చుననియును దలచి తాను విధించిన విరహశిక్ష సఫలత నొందుటకు తగు స్థానము రామగిరి యని తలచెను.

విరహశిక్ష ననుభవించుటకై యక్షుడు ఉత్థానైకాదశి మరుసటిదినమున, దుఃఖించుచు, అలకానగరమందలి సుఖసౌఖ్యములకు జలాంజలి యొసగి బయలుదేరి రామగిరిని చేరుకొనెను. ఆ ప్రదేశ మంతయు సీతారామమయము. అది సీతారాములు నివసించిన యాశ్రమము. అల్లవి వారు నిర్మించిన నూతన కుటీరపు గుర్తులు. ఆ నికుంజములయందే సీతారాములు విహరించుచుండిరి. ఆ లతామండపమందు వారు విశ్రమించుచుండిరి. ఆ మహామహీరుహముల ఛాయల దిరుగుచుండిరి. ఆ ప్రకాండవృక్షములు వారు నాటిన మొక్కలే. ఈ తటాకమందు వారు జలక్రీడ లొనర్చిరి. ఈ సరస్సునందలి జలమును పానము చేయుచుండిరి. ఆ మార్గమున వారు తిరుగుచుండిరి. ఈ బండలమీద విశ్రమించుచుండిరి. ఇట్టి స్థితియందు యక్షుడు కదలు టెట్లు? స్థలజలములు, పర్వతారణ్యములు, రాళ్లుపుట్టలు మొదలగున వన్నియు సీతారాముల లీలలను జ్ఞప్తికి దెచ్చుచుండుటవలన నిలుచుండుటకు గాని, కూర్చుండుటకు గాని, శయనించుటకు గాని వీలు లేక అగ్నియందు దాజ్యము పోసిన భంగి నచ్చట చిహ్నములు, గుర్తులు, కథలు మొదలగునవి యక్షుని విరహవేదనాగ్నిని ద్విగుణీకృత మొనర్పజొచ్చెను. ఆస్థితియందు మానవు డేమి చేయగలడు? పిచ్చి యెక్క నని నుదువుటయందాశ్చర్య మేమున్నది? దినములు గడచినకొలదియు నాతనిశరీరము శుష్కింపజొచ్చెను. చేతికంకణములు జారి పడిపోయెను. కాని యావిషయ మాత డెరుగడు. బుద్ధి తల్లక్రిందులాయెను. ఉత్తరదిక్కునుండి వచ్చు వాయువును పరుగుపరుగున నేగి యెదుర్కొని కౌగిలించుకొనజొచ్చెను. ఆగాలి తన ప్రాణప్రియ నాలింగన మొనర్చుకొని వచ్చుచున్న దనియే యాతని తలంపు. నాతిఫలకముమీద భార్యచిత్తరువును చిత్రించి యా

**రామగిరిలో యక్షుడు పడిన పాట్లు**

చిత్తరువు పాదములకు సాగిలబడుచుండెను. రాత్రుల యందు వృక్షతలమున శయనించి స్వప్నమందు భార్యను గాంచి గాఢాలింగన మొనర్చుకొనుచుండెను. కాని ప్రియురా లెచ్చట? నిద్రాభంగమై భగ్నమనోరథు డగుచుండెను. వనదేవి యతని విరహమును గాంచి జాలిపడి కన్నీరు విడుచుచున్నదాయని తలచునట్లు మంచుబిందువులు నేలమీద బడజొచ్చెను.

ఈవిధముగ నెనిమిది మాసములు గడచెను. ఇంతవర కెట్లెటో కాలమును గడపెను. కాని యిక కాలము గడపుట దుర్ఘటమగు

**ఆషాఢ మేఘ సందర్శనము**

చుండెను. ఆషాఢమాస మందలి ప్రథమ మేఘము గానవచ్చెను. చిన్నచిన్న మేఘములు పర్వతనితంబముల (సానువులు) గప్పి గాలివలన నొకింత కదలుచు నడచుచుండెను. ఆదృశ్యము నల్లని యేనుగుల తండము దంతములతోడ పర్వతసానువులను కోరాడుచున్నట్లు తోచుచుండెను. యక్షు డున్మాది. అతనికి చేతనాచేతనజ్ఞానము శూన్యము. మేఘసందర్శనమువలన నెల్లర మనములు వికారమునకు లోనగుచుండును. ప్రియపదార్థములు పార్శ్వమం దుండువారిమనములే కలవరము చెందు చుండ ప్రియపదార్థము దూరమందుండువానినిగూర్చి చెప్పవలె నేమి? ఉన్మాదము సంభవించు నని నుడువ జెల్లును.

యక్షుని యున్మాదము సామాన్యజనుల యున్మాదమువంటిది కాదు. అతడు నోటికి వచ్చినట్లు మాటలాడుచు, కేకలు బొబ్బలిడుచు

**యక్షుని ఉన్మాదము**

వెర్రిచేష్టలు చేయువాడు గాడు; మితభాషి, వినయి. అతని యందు సాంఘికముగను, వైషయికముగను సకలవ్యాపారములకును సామరస్య మున్నది. కాని యొక్క విషయమందు — ప్రేయసివిషయము మనమునకు వచ్చెనా, అంతయు తలక్రిందులే. సమస్త జడపదార్థములును చైతన్యమయ మగును. అవి యన్నియు మిత్రము లగును. కాని జడజ్ఞానమే యుండదు.

మేఘములను గాంచి అత డిట్లు భావింపదొడగెను: "శ్రావణము వచ్చినది. ప్రేయసి జీవించి

**మేఘునితో మైత్రి**

యుండునా? పరదేశములయందుండి పరుల స్మృతిచిహ్నములను గాంచినకొలదియు నా కీదశ సంభవించినది. కాని యలకాపురమం దాయిల్లు, తోట, ఉద్యానవనము, జలక్రీడాసరోవరము మొదలగున వన్నియు నున్నవి. లేనిది నేనొక్కడనుమాత్రమేగదా! అందువలన నాగృహిణియవస్థ మిక్కిలి శోచనీయముగ నుండును." అని చింతించి ప్రేయసికి సందేశమును పంపుట భావ్యమని నిర్ణయించుకొనెను. "మేఘ ముత్తర దిక్కున కరుగుచున్నది. కావున నాసందేశమును దీసికొని యరుగును." అని యనుకొనునంతలో నాతని మనము మేఘములకేసి పరువిడజొచ్చెను. నలుదిక్కుల దిలకించెను. కొండమల్లెపువ్వులు వికసించి ప్రకాశించుచుండెను. వర్షముయొక్క ప్రథమసంపదయే గదా కొండమల్లెపువ్వులు! కొన్ని పువ్వులను చేతధరించి "మేఘుడా! నేనొసగు నీ ప్రీతిబహుమతిని గైకొనుము." అనుచు తా నొసగిన బహుమతికి మేఘము మిక్కుటముగ సంతసించె నని సంతృప్తి నొందెను. మరియు "అయ్యా, దయచేయుడు. క్షేమముగ వచ్చినారా?" యని కుశలప్రశ్న లడిగెను.

మేఘుని చేత నేదైన కార్యమును జేయించుకొనవలయు ననిన నాతని సంతోష పెట్టవలయును.

**మేఘప్రశంస**

సంతోషపెట్టుట కనేక మార్గములు గలవు. కాని యందు వంశవర్ణనము మిక్కిలి కార్యకారి. ధనికుడవు— విద్వాంసుడవు— కీర్తిమంతుడవు— దాతవు— భోక్తవు — వివేచకుడవు— మహావక్తవు అని నుడువుటవలన గలుగు ఫలముకంటెను చతుర్గుణఫలితము "మీరు మహోన్నత వంశమందు జన్మించితిరి. మీపూర్వీకులు మహత్తర కార్యము లొనర్చియున్నారు..." మొదలగువానివలన గలుగును. అందువలన యక్షు డిట్లు నుడువజొచ్చెను: "మేఘుడా, నీవు మహిమోపేతమగు మహావంశమందు జన్మించియున్నావు. పుష్కలము, ఆవర్తకము మొదలగు మేఘమాలలు నీపూర్వపూరుషులు. నీవంశము జగత్తంతయు వ్యాపించియున్నది. మీ వంశముతోడ బోల్పదగిన వంశము భూమండలమందు మరి లేదు.

దేవేంద్రుని ముఖ్యోద్యోగులయందు నీవు ముఖ్యుడవు. స్వేచ్ఛానుసారము దేహపరివర్తన మొనర్చుకొనగల శక్తి నీకపారము. నీ వత్యంతసూక్ష్మరూపమును దాల్చ గలవు. మరు నిముసముననే బృహత్తరరూపమును దాల్చి దేశదేశాంతరముల వ్యాపింపగలవు. అంతే కాదు. చిత్రవిచిత్రరూపములగూడ ధరింప గలవు. నేనో దుఃఖితుడను, విరహసంతప్తహృదయు డను, నీ శరణుచొచ్చుచున్నాను. మహానుభావులను యాచించుటవలన కార్య సాఫల్యము గాకున్నను చింతింపవలసిన పని యుండదు. సామాన్యులను యా

**శరణాగతి**

చించుటవలన నాశాభంగ మైనచో చిన్నబుచ్చుకొనవలసి వచ్చును. నీయందొక మహాగుణమున్నది. సంతప్తుల తాపమును నివారించుచుందువు. భూలోకభువర్లోకములు తీవ్రమైన వేడిమికి లోనైనతరి అందలి మానవులకు తాపనివారణ మొనర్చుచుందువు. నేను ప్రేయసి విరహాగ్నివలన దగ్ధుడను. కావున నా హృదయ తాపమును చల్లార్పుము. కుబేరుని శాపమువలన నాకీ దుర్గతి సంభవించినది. నాసందేశమును గైకొని ప్రియురాలికడ కరుగుము. నాభార్యను కలసికొనుటకు మరి వేరుమార్గము లేదు. కావున దయయుంచి నా ప్రార్థన నంగీకరించుము.

"నీ విప్పుడే బయలుదేరుము. నీ వేగవలసినది మహాతీర్థస్థానము. ఆ మహానగర ప్రాంతమందలి

**ప్రయాణమునకు ప్రోద్బలము**

యుద్యానవనమందు మహాదేవు డున్నాడు. ఆయన శిరమునధరించిన చంద్రుని ధవళకాంతుల వలన నా నగరమంతయు ప్రకాశించుచుండును. నీవు గాన్పించినంతనే ప్రవాసమందుండు భర్తలు గల విరహిణుల కొకింత మనశ్శాంతి కలుగును. భర్తృసమాగమము త్వరలో కలుగునని సంతసించుచుందురు. నావంటి పరాధీనుడు గానివాడెవ్వడైనను నీ వాకసమున నుదయించునప్పుడు ప్రేయసి నుపేక్షించి యుండగలడా?" యక్షున కెంత యైశ్వర్యమున్న నేమి? ఎంతమర్యాద ఉన్న నేమి? పరాధీనుడనను విషయ మాతనిని కలవర పెట్టుచుండెను. నే నుద్యోగమందుండనియెడల- దాసత్వమంగీకరింపనిచో నాకీ దుర్దశ సంభవింపదు గదా అని తలచుచుండెను.

యక్షుని యున్మాదమునందొక సూత్రము కలదని నుడివియుంటిని. అందుల కొక యుదాహరణము

**శుభశకున ప్రదర్శనము**

నిత్తును. మేఘుని కైలాసయాత్ర యొనర్పవలయునని ప్రార్థించెను గదా! ప్రయాణమునకు కాలము మొదలగునవి అనుకూలముగ నున్నవా యని విచారించి మేఘుని గూర్చి యిట్లనియె: "గాలి దక్షిణమునుండి యుత్తరమునకు వీచుచుండుటవలన నీ ప్రయాణమునకు మిక్కిలి యనుకూలము. వామభాగమందు చాతకము లెగురుచున్నవి. అట్లెగురుచుండుట ప్రయాణమునకు మిక్కిలి శుభశకునము. మార్గమందు బలాకములు మాలాబద్ధమై నీకు సేవయొనర్చుచుండును. బకపంక్తులుగూడ శుభమును సూచించుచున్నవి. ఇట్టి మహేంద్రయోగ మిక కలుగదు. బయలుదేరుము."

ఆమెను గుర్తించుటెట్లను శంక కలుగవచ్చునను తలంపున నిట్లనియెను: "మేఘుడా! నా భార్యను గుర్తిం

**వైయర్థ్యశంకా నివారణ**

చుట యంతకష్టము గాదు. సులభముగనే గ్రహింపనగును. ఆమె కేవలము దినములు గణించుచు కూర్చొనియుండును. ఆమెకు సపత్నులు లేరు. సపత్నులుండినచో భర్తృవిరహ మంతగా నుండదు. భర్త ప్రవాసమందుండుటవలన, సపత్నులు లేకుండుటవలన నామె కాశ మిక్కుటము. అందువలన నామె మరణించి యుండదు. నీవు దర్శింపగలవు, నీ యాత్ర విఫలముకాదు. నీ భ్రాతృజాయ మరణించలేదు, మరణించదు. ఆమెకు నన్ను గాంచవలయునను ఆశ మిక్కుటముగ గలదు. అందువలన నామె యెట్లు మరణించును? పూవును రాలిపోకుండ బట్టుకొనునది తొడిమ. అటులనే ప్రేయసిహృదయమును నాశ పట్టుకొని పడిపోకుండ జూచుచున్నది. తొడిమ యెండిన యెడల పుష్పము జారిపోవును. నిరాశ కలిగినంతనే రమణీమణిహృదయము కర్పూరమువలె నెగిరిపోవు ననుటకు సందియములేదు.

"దీర్ఘపథము — మిక్కిలి దుర్గమము — అంత దూర మొంటరిగ నేసు బెట్లని శంకింపకుము. యోచింపకుము.

**అనుయాత్రికుల తోడు**

నీగర్జనములు చెవులకు మిక్కిలి యింపుగా నుండును— భూమి పగిలి నేలయరటులు పుట్టును. పృథ్వి సస్యశ్యామల యగును. అందువలన పృథ్వి నీ కనుకూలముగ నున్నది. మార్గము దుర్గమముగ దోచదు. నిన్ను గాంచగనే హంసలు మిక్కిలి యుత్కంఠితములై మానససరోవరమునకు బయలు దేర్తును. మార్గమందు దొరకు తామరతూండ్ల మొనలను భక్షించుచు ని న్ననుసరించుచుండును. ధనవ్యయమునకు లోనై మానవులను వెంట దోడ్కొనిపోవలసిన పని లేదు. మేఘుడా! సర్వవిధముల నీప్రయాణమను కూలముగ నున్నది. ఆలస్య మెందుకు? బయలుదేరుము.

"ఈ శైలరాజమును కౌగలించుకొని సెలవు గైకొనుము. ఈతడు నీకు పరమమిత్రుడు. అనేకదినముల తర్వాత నిన్ను గాంచుటవలన పాపవిదూరుడైనాడు. గాత్రమునుండి యావిరి పుట్టుచున్నది. నీశరీర స్పర్శవలన నీయెడల నీతని స్నేహము వర్ధిల్లుచున్నది. అందువలననే పర్వతగాత్రమునం దెల్లెడలను శిశిరబిందు తుల్యములగు జలకణములు గాన్పించుచున్నవి. నీస్నేహితుడు పరమపవిత్రుడు. ఈతని ప్రతియొక్క నితంబమునందును, మేఖలమునందును జగత్పావనుడగు శ్రీరామచంద్రమూర్తి పదచిహ్నము లంకితములైయున్నవి."

ఈపర్వతము 'సరంగుజా' రాజ్యమధ్యమందున్నది. ఇదియొక సమతలమున నున్న పెద్దపర్వతము.

**రామగిరిస్థల నిర్దేశము**

మహోన్నతమగు దీని శిఖర మాకసమును చుంబించు చుండును. శిఖరాగ్రమందు సమతలభూమి మిక్కుటముగ గలదు. పర్వతశిఖరము పెరుగు చుండిన చతుర్దిక్కుల సానుప్రదేశము. పర్వతము నెక్కుటకు మూడుమార్గములుమాత్రమే కలవు. ఉత్తర దిశనుండుమార్గము మిక్కిలి ప్రశస్తము. పశ్చిమమార్గ మంతమంచిది కాదు. పూర్వదిక్కున నిమ్నస్థితమగు సమతలములయం దచ్చటచ్చట ఆశ్రమములు గలవు. ఆయాశ్రమములయందు రామచంద్రుడు కుటీరములను నిర్మించియుండెను. కాని యక్షు డిం దెచ్చట నుండెనో నుడువుటకు వీలులేదు. కాని ప్రథమ మేఘమును గాంచి పిచ్చివాడైనదినమున దక్షిణదిక్కున, దక్షిణ తూర్పుదిశలు కలియుకోణమునకు సమీపమున, ఉత్తరాభిముఖుడై కూర్చుండి యుండెననిమాత్రము నుడువవచ్చును. అలకాపుర మత్యంతదూరము — అచ్చటి కేగుట యసంభవమని యెరిగియు, సర్వదా యుత్తరదిక్కును గాంచుచు కాలము గడపుచుండెను.

"మేఘుడా! వినుము. నీకు సరియగు మార్గమును నిర్దేశించెదను. అందువలన నీవు సులభముగ నలకాపురమును చేరగలవు. కొన్ని

**అలకానగర మార్గనిర్దేశము**

మార్గములు మిక్కిలి దుర్గములు. ఆ మార్గములయందు పర్వతములు నిన్నడ్డగించును. విశాలమగు మార్గము కానియెడల విపులమగు నీశరీరము కదలజాలదు. అందువలన నీవువంగి యనేకవక్రగతుల ప్రయాణమొనర్పవలసి యుండును. నీ విప్పుడు మిక్కిలి జలపూరితుడవు. శరత్కాలమందువలె చప్పున పై కెగురజాలవు. కావున నీ విప్పుడు రెండుమూడువేలయడుగుల మధ్యముననే నడచుచుండవలయును. అందువలన చిన్నకొండలుగూడ ని న్నెదుర్కొనును. కావున నానిర్ణయముప్రకారము ప్రయాణమొనర్పుము. తదనంతరము నాసఖివిషయమును చెప్పెదును. అది వీనులవిందుగా నుండును. నీవు అలసినప్పుడు పర్వత మస్తకములయందు విశ్రమించుము. మిక్కిలి దప్పిగొనునప్పుడు మహాప్రవాహముల నుండి జలమును గ్రోలుచుండుము. ఆజలము మిక్కిలి తేలిక యగుటవలన సులభముగ జీర్ణమగును. నీ శరీరము బరువెక్కదు.

"నీవు మృదుమధురరవ మొనర్చుచు నుత్తరదిక్కుగా నిర్గమించునప్పుడు సరళస్వభావ లగు సిద్ధ కన్యలులికిపడి ని న్నాతురతతో గాంచుచుందురు. ఏలయన, గాలి పర్వతశృంగములను బడగొట్టుకొని తీసికొనిపోవుచున్నదా యని వారి యనుమానము." ఇచ్చట నొక విషయమును జెప్పుట మంచిది. హిమాలయపర్వతముల పాదదేశములయందలి వనములు, వింధ్యపర్వతమునకు దక్షిణ దిక్కున నుండు వనములు సిద్ధగణ నివాస

స్థానము లని ప్రసిద్ధి. ఇప్పటికిని ఆప్రాంతమందు సిద్ధు లున్నా రనియు, అప్పుడప్పుడు కనుపడుచుందు రనియు లోకుల విశ్వాసము. వీరు తపమువలన సిద్ధు లను నామమున దేవగణమున జేరినవారలు. వీరి కిండ్లు సంసారము లుండును. "మేఘుడా! అచ్చట నుండు నేలప్రబ్బలి చెట్లు(నిచులములు)మిక్కిలి సుందర ములు. నీవచటనుండి యుత్తరముఖమున బయలుదేరుము. కాని మార్గమందు దిఙ్నాగముల తొండపు విసరులను దప్పించుకొని పోవలయునుసుమా" మల్లినాథసూరియిచట నిచుల, దిఙ్నాగులను నిర్వురు పండితుల నామముల నుదాహరించియున్నాడు. నిచులకవి కాళిదాసుపక్ష పాతి; దిఙ్నాగుడు కాళిదాసుకు విరోధి. ఆయన

**దిఙ్నాగుని ఉదంతము**

మతానుసారము వా రిర్వురును కాళిదాసుకు సమకాలీనులు. నిచులములనునిచులకవియనియు, దిఙ్నాగములను దిఙ్నాగకవి యనియు తలచెను. ఈవిష యముమీద నాధారపడి కాళిదాసునకు దిఙ్నాగుడను బౌద్ధపండితుడు సమకాలీను డనియు, ఆరవశతాబ్దము వా డనియు నిర్ణయించియున్నారు. బౌద్ధసన్యాసియగు దిఙ్నాగుని నివాసస్థలము కాంచీనగరము. మేఘము రామగిరియందున్నది. సరగుజా రాజ్య ప్రదేశాంతర్గతము గదా రామగిరి! కాంచియందలి దిఙ్నాగుడు మేఘమును తొండముతోడ గొట్టు టెట్లు? రామగిరికి దక్షిణమున ౫౦౦ మైళ్ల దూరమందు కాంచీపురి యున్నది. కావున కాళిదాసు నుడివిన దిఙ్నాగమునకును, కాంచియందలి దిఙ్నాగసన్యాసికిని సంబంధ ముండదు. "ఇటు చూడు. నీ యెదుట నింద్రధనుస్సు వల్మీకమునుండి బయల్వె డలి పద్మరాగాదిమణిప్రభల నొక్కుమ్మడి విరజల్లుచు దర్శనీయముగ బ్రకాశించుచున్నది. శ్యామలదేహుడ వగు నిన్నది యంటియుండునప్పుడు నీవు తలను నెమలిపురి దాల్చిన శ్యామసుందరు డగు శ్రీకృష్ణుని బోలి శోభిల్లుచుందువు.

"వర్షము గురిసినగాని సేద్యము ప్రారంభము కాదు. అందువలన నీదర్శన మైనంతనే పల్లీవధూటికలు నిన్ను అతితృష్ణతోడ ప్రేమరసస్నిగ్ధలోచనముల గాంచుచుందురు. వా రమాయ

**మాలవశబ్ద నిర్వచనము**

కురాండ్రగు సామాన్యస్త్రీలు. అందువలన వారి దృష్టియందు హావ ముండదు, భావ ముండదు, చాతుర్య ముండదు, విలాసముండదు, విభ్రమ ముండదు; కేవలము ప్రీతిమాత్ర ముండును. మధురిమము మాత్రము వికసించుచుండును. వారి తొందరను, సరళత్వమును, హృదయావేగమును గాంచిన నిన్ను పానమొనర్చెదరా యని తోచుచుం డును. కావున నీవు వ్యవసాయ భూములకు పైగా నెగురుము. క్రింది భూములమీద నుండి పర్వతములమీదికి బొమ్ము వానిమీద సమతలభూము లుండును. ఆభూములను 'మాలభూమి' యందురు. 'మాలభూమి' యెక్కుడుగల ప్రదేశము మాలవ మని పిలువబడుచున్నది. మాలభూమి సూర్యుని యెండవలన మిక్కుటముగ తప్తమైయుండును. అట్టి భూమిమీద వర్షము పడినంతనే యొకవిధమగు సువాసన బయలు దేరును. నీ వాగంధము నాఘ్రాణించుచు అటనుండి యొకింత పశ్చిమముఖముగ నరుగుము. అటనుండి తిరిగి యుత్తరమునకు బయలుదేరుము. (సశేషము)

అనువాదకుడు:
ఆర్. రంగనాథశాస్త్రి





## మనోహరత్వము స్త్రీయొక్క మొదటివలపు

సౌందర్యమునకు ఇవ్వబడునటువంటి శ్లాఘనను ప్రతి స్త్రీ కోరును. నిజముగా అందమునకు మనోహరమైన చర్మము అత్యావశ్యక మనునది చాలజనులు మరచి పోవుదురు. శుభ్రముగా శ్రేష్ఠమై మృదువుగా ఉన్న చర్మము స్నేహితులయొక్కయు, బంధువులయొక్క శ్లాఘనను పొందును.

చర్మము వాడకుండ లేతగా నుంచుకొనుటకు ప్రతియొకస్త్రీ జాగ్రత్తపడ నవసరము. వట్టికడుగుటతో రంధ్రములలోనుండు మురికిని తొలగించజాలదు.

పాండ్సుక్రీమ్, రంధ్రములలో దూరి, దానినుండు అల రోజు మురికిని, నూనె విశేషమును తీసి శుభ్రముగా నుంచును. పాండ్సుక్రీమ్ సీసాను కొనుడు. మీ వేళ్ల చివరలతో క్రీమును, మీ చర్మముమీద రాయుడు. మృదువైనగుడ్డతో తుడుపుడు. మరియు కొద్దిగా వేరే క్రీమును తేలికగా పూసి రాత్రంతయు ఆ నాజూకైన పొరను ఉంచుడు. ఈ మోస్తరుగా ఒక పదిహేను రోజులు రాత్రులయందు వాడుడు. అప్పుడు మీ చర్మము మృదువుగా లేతగా **అవుతున్నట్లు** మీకు తెలియగలదు.

**పగలు, గాలి, దుమ్ములనుండి రక్షించుటలో శ్రేష్టమైనది**
**పాండ్సు వ్యానిషింగ్ క్రీమ్.**




పాండ్సు క్రీములు అన్నిగొప్ప స్టోర్సులలో దొరుకును లేక **పాండ్సు**, పి. ఒ. బాక్సు 144, బొంబాయికి వ్రాయుడు

# పాండ్సు క్రీమ్



# వేదాంతదర్శనము: స్వతంత్రాస్వతంత్ర వాదము

శ్రీ పూర్ణానంద

శ్రీ ఆదిమధ్వాచార్యుల
పవిత్రజీవితము



మాధ్వమతములోని
మహితబోధలు

రసం ప్రశంసంతి కవిత్వనిష్ఠా
బ్రహ్మామృతం వేదశిరోనివిష్టాః,
వయంతు గుంజాకలితావతంసం
గృహీతవంశం కమపి శ్రయామహే.

**ప్రవేశిక:**

ద్వైతవాదము, పూర్ణప్రజ్ఞ దర్శనము, లేక స్వతంత్రాస్వతంత్రవాదము అనబడు వేదాంతదర్శన శాఖకు మూలము శ్రీమధ్వాచార్యుడు. మధ్వమతము, లేక బ్రహ్మసంప్రదాయ మనబడు ఈ పరంపరకు సనత్కుమారుడు ఆదిగురువుగ చెప్పబడుచున్నను ఉపనిషత్తులు, లేక వేదాంతసూత్రముల ద్వైతప్రసక్తి కనబడదు. కాశకృత్స్న, ఆశ్మరథ్య, ఔడులోములు క్రమముగ అద్వైత, విశిష్టాద్వైత, భేదాభేదవాదములను బరిగ్రహించి నట్లు వేదాంతసూత్రములవలన గ్రహింపగలము. కాని సంపూర్ణముగ ద్వైతమతము నవలంబించినవారి పేరు ప్రాచీనులలో నగపడదు. సాంఖ్యులు మున్నగువారు ద్వైతవాదులే యైనను, మాధ్వద్వైతమునకును, తత్పూర్వాచారిత ద్వైతమునకును విభేద మున్నది. శాంకర, భాస్కరీయ, శ్రీకంఠ, నింబార్క మతవాదముల ప్రచండవాయువులు వీచుచున్నప్పుడు మరల నొక విశేషవాదమును లేవదీసి, నిలువబెట్టగలిగిన ఈ ఆచార్యుని ప్రతిభ ప్రశంసనీయము. నాథముని, యామున, రామానుజాచార్యులను మహోన్నతనగశిఖరములనుండి ప్రవహించిన భక్తిమందాకిని నీతడు వహించి, తదనంతరము ప్రభవించిన శ్రీ కృష్ణచైతన్య దేవునియందు మిళిత మగుటకు కారణమైనాడు (చైతన్య మహాప్రభుని మతవాదము మాధ్వ గౌడీయమతవాద మనబడు

చున్నది). వల్లభాచార్యునకు గూడ ఈమత మొకింత శరణ్యమైనది. మఱియు, ఈమధ్వమతాచార్యులు స్వమనీషాబలమున అద్వైతమతమును న్యాయపరశువుతో సమూలముగ పెల్లగించివేయ ప్రయత్నించి, అయ్యది ఇతోధికముగ బలపడుటకు కారకులైనారు. వీరియందు జైనమతప్రభావము మిక్కుటముగ కనబడుచున్నది. ఈ ఆచార్యులలో నేయొక్కరికిని పరమతసహనము ఉన్నట్లగుపడదు. అనుచితభాషాప్రయోగమున వీరగ్రగణ్యులు. అనుగాక. నోటితో అద్వైతవాదము నుచ్చరించు దిగ్గజములకుగూడ మధ్వుడు నిర్వచించిన భక్తిపంథయే గతియైనది.

## జీవితగ్రంథములు :

త్రివిక్రమునిపుత్రు డగు నారాయణుడు 'మధ్వవిజయము', 'మణిమంజరి' అను రెండుగ్రంథములలో నీతదాచార్యుని జీవితమును వర్ణించినాడు. త్రివిక్రముడు శ్రీమధ్వుని శిష్యుడు. అందువలన నారాయణుడు ప్రశిష్యుడు. నరహరితీర్థస్వామి 'అనుశాసనము'గూడ ఈ విషయమున సాహాయ్యకారి. తిరుపతివాసులగు శ్రీ సుబ్బరావుగారును, సి. ఎన్. కృష్ణస్వామిఅయ్యరుగారును ఇంగ్లీషున వ్రాసిన జీవితగ్రంథములు రెండు లభించుచున్నవి. వెనుక 'శారద' యను మాసపత్రికలో శ్రీమధ్వాచార్యుని జీవితమును బహుశః పెదురుపాడి వారు వ్రాసి ప్రకటించినట్లు గుర్తు. ఆంగ్లమున దర్శనశాస్త్ర చరిత్రలను లిఖించిన దాసుగుప్త, రాధాకృష్ణ, హిరియన్నలీ ఆచార్యుని గుఱించి ప్రసంగింపకుండుట శోచనీయము.

## జీవితము :

తులవ దేశమునన్న వేలిగ్రామమున మీమాంసామతవాదులగు కొందఱు బ్రాహ్మణులు వసించుచుండిరి. వారు కాలక్రమమున శాంకరమతప్రభావమునకు లోనయిరి. ఈ వంశమునకు జెందిన మధ్యగేహు డను సామాన్యగృహస్థుడే శ్రీమధ్వాచార్యుని పిత; వేదవతి మాత. ఇరువురు పుత్రులును, ఒకకన్యకయు జనింప, పుత్రు లిర్వురును కాలగ్రస్తులైరి. తదనంతరము నారాయణప్రసాదమున క్రీ. శ. ౧౧౯౯-వ సం. మున ఈ తృతీయపుత్రుడు గలైను. ఈ సంప్రదాయజ్ఞులు ఈయనను వాయుదేవుని అవతారముగ జెప్పెదరు.

వాసుదేవ నాముడగు ఈ బాలుడు యథోచిత సమయమున గ్రామపాఠశాల కరిగెనుగాని విద్య యంట లేదు. కుస్తీ మున్నగు వ్యాయామక్రీడలలో మేటియై, 'భీము' డను నామమును బడసెను. పరిణత వయస్సున, స్వయంకృషివలన శాస్త్రములను పఠింపగా సన్యాస గ్రహణేచ్ఛ పొడమెను. అచ్యుతప్రకాశు డను అద్వైతయతికడ సన్యాసమును గ్రహించి, పూర్ణప్రజ్ఞ నామమును బడసెను. పిదప, 'ఆనందతీర్థ' నామమును వహించి, అనంతేశ్వరమఠమునకు అధ్యక్షుడయ్యెను. కాని అద్వైతమతము నచ్చలేదు.

క్రీ. శ. ౧౨౨౫-వ సం. మున దాక్షిణాత్యవిజయమునకు బయలుదేరి, మంగళూరునుండి ఇరువది యేడుమైళ్లదూరమున నున్న విష్ణుమంగళమును జేరుకొనెను. అట వివిధములగు యోగవిభూతులను బ్రదర్శించి, తిరువేంద్రమున కరిగెను. అచ్చట శృంగేరీమఠాధిపతి యగు విద్యాశంకరులతో వాదించి ఓటమినందెను. అప్పటినుండియే శ్రీమధ్వుడు శాంకరమతమును తీవ్రముగ విద్వేషింప మొదలిడెను. తరువాత రామేశ్వరమును, శ్రీరంగమును దర్శించి, పాలారునదీతీరము ననుసరించి ఉడిపిని జేరుకొనెను. రామేశ్వరమునందలి అద్వైతపండితులు తర్కయుద్ధమున కాహ్వానించిరిగాని శ్రీమధ్వుడు ఒప్పుకొనలేదు. ఉడిపియందున్నప్పుడే ఈయన గీతాభాష్యమును రచించియుండవచ్చును.

యాదవవంశీయు డగు దేవగిరిరాజైన మహాదేవునితో నీయన సంభాషించిన ట్లగపడుటచేత మరల క్రీ. శ. ౧౨౬౦-వ సం. మున ఉత్తరభారత పరిభ్రమణమునకు బయలుదేరియుండవచ్చు నని తోచుచున్నది. ఈపర్యటనమున కీయనకు పూలదండలు, ముళ్లుగూడ స్థానవిశేషము ననుసరించి లభించెను. ప్రాణరక్షకై గోవానగరమునకు బారిపోవలసి వచ్చెను. పిదప హరిద్వార, బదరీనారాయణములవఱకును యాత్రల నొనరించెను. ఈసమయమున ముసల్మానులభాష నీయన నేర్చుకొనెను. వ్యాసుని ఆదేశము ననుసరించి విష్ణుని

మహత్త్వస్థాపన, సూత్రభాష్యరచనల కుపక్రమించె నని వినికి.

పిదప చాళుక్యనగరి యగు కల్యాణమును జేరి, శోభనభట్టు అను నాయనను శిష్యు నొనర్చుకొనెను. ఈయనయే శ్రీమధ్వుని అనంతరము పద్మనాభతీర్థు డను నామమును వహించి మధ్వమతమునకు మూలకంద మయ్యెను. అచ్చటనుండి ఉడిపికి మరల చేరికొని పూర్వగురుడగు అచ్యుతప్రకాశుని భయపెట్టి స్వమత మునకు త్రిప్పుకొనెను. ఉడిపియందు శ్రీకృష్ణాలయ మును నిర్మించి దానిని మధ్వమతావలంబులకు ముఖ్య పీఠముగ నొనర్చెను. శ్రీరామానుజ ప్రవర్తితమగు శంఖ చక్రాది అంకనవిధానమును శాస్త్రప్రమాణమునలన నిరూపించుట, యజ్ఞమున జరుగు పశుహింసను నివారించుట అనునవి ఈయన తరువాత నొనర్చిన కార్యములు.

ఈ సమయమున శృంగేరీపీఠ గురువుతో విరోధము హెచ్చుకాగా, ఆయన శ్రీమధ్వుని పుస్తకాలయము ను దీసికొని, దానిమీద మధ్వాచార్యుల కట్టిహక్కు లేకుండున ట్లొనర్చెను. పిదప విష్ణుమంగళ రాజగు జయసింహుని సాయమున దానిని మరల మధ్వాచార్యులు సంగ్రహింపగలిగెను. ఈసమయమున నారాయణపండితుడు ఉపదేశమును గ్రహించెను. తండ్రి మరణింప సోదరుడుగూడ సన్యసించి విష్ణుతీర్థుడయ్యెను.

శ్రీమధ్వాచార్యుని జీవితశేషము సరిదంతర మను చోట గడపబడెను. అచటనే ఈయన పరమపదము నందెను. ఈయన మరణించిన సంవత్సరమును సరిగా జెప్ప వీలుపడకున్నది. మధ్వసంప్రదాయస్థులు ౭౯ సం. ౬ మా. ౨౦ రోజులు ఈయన మతప్రచారము సల్పె నందురు. శ్రీమధ్వుని జన్మ క్రీ. శ. ౧౧౯౯ అని చెప్పి యుంటిని. ౨౫-వ ఏట, అనగా క్రీ. శ. ౧౨౨౪ మున ఈయన సన్యాసము పుచ్చుకొనెను. కనుక క్రీ. శ. ౧౩౦౩ న ఇహమును వీడె ననవలసి వచ్చుచున్నది. కాని చారిత్రకముగ ఈ లెక్క సరిపడదు.

## గ్రంథములు :

మధ్వాచార్యులు సుమారు ముప్పదినాలుగు గ్రంథములను సంస్కృతమున విరచించిరి. వీని నన్నిటిని కుంభకోణమునందలి మధ్వవిలాస బుక్ డిపోవారు క్రీ. శ. ౧౯౧౧ న ప్రకటించియున్నారు.

గీతాభాష్యము ఈయన మొదట రచించిన గ్రంథమై యుండవచ్చును. ఇది గీతకు అతిసంక్షిప్త మగు టీక. దీనికి శ్రీ నేలం సుబ్బరావుగారి ఇంగ్లీషు అనువాదము ఉన్నది.

పూర్ణప్రజ్ఞభాష్య మనబడు సూత్రభాష్యమున పౌరాణికవాక్యసాహాయ్యమున స్వమతము సమర్థింపబడినది. ఈభాష్యమునకు జయతీర్థాచార్యుని 'తత్త్వప్రకాశిక' అను టీక, ఆటీకకు రాఘవేంద్రస్వామి 'భావదీప' మను వృత్తి యున్నవి. 'తత్త్వప్రకాశిక'పై వ్యాసరాజస్వామి 'తాత్పర్యప్రకాశిక' యను మఱియొక వృత్తినిగూడ రచించినాడు. 'అనుభాష్య' మను శ్లోకగ్రంథమున మధ్వాచార్యులు బ్రహ్మసూత్రమునందలి మొదటినాలుగు సూత్రముల అర్థమును వివరించిరి. దీనికి రాఘవేంద్రస్వామి 'తత్త్వమంజరి'అను టీకను విరచించెను. 'అనువ్యాఖ్యానము'అను గ్రంథమున శ్లోకరూపమున బ్రహ్మసూత్రముల వ్యాఖ్యను మధ్వాచార్యులు రచించిరి. పూర్ణప్రజ్ఞభాష్యమునకు సుబ్బరావుగారి ఇంగ్లీషుఅనువాద మున్నది. 'న్యాయవివరణము'న చతుస్సూత్రీయ శబ్దార్థము వివరింపబడినది.

గీతాతాత్పర్యనిర్ణయము అను గ్రంథమునగూడ మధ్వాచార్యులు గీతను వ్యాఖ్యానించిరి. దీనిపైన జయతీర్థుని 'న్యాయదీపిక' అను టీక, తామ్రపర్ణివృత్తి వ్రాయబడెను.

'ప్రమాణలక్షణము'న మధ్వాచార్యులు ప్రమాణములను గురించి శ్లోకములలో వివరించిరి.

ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, ఛాందోగ్య, బృహదారణ్యములపై మధ్వభాష్య మున్నది. ఈభాష్యములకు జయతీర్థ, మస్కరి, రఘునాథ, వ్యాసతీర్థ, విదేశి, ఉమార్జి, శ్రీనివాసతీర్థ, తామ్రపర్ణి, రఘూత్తమ స్వాము లనువారు రచించిన వృత్తి, టీకా, టిప్పణులున్నవి. ఇవిగాక కథాలక్షణము, ఉపాధిఖండనము (దీనికి ఒకటీక, రెండు టిప్పణులు నున్నవి),

మాయా వాదఖండనము (జయతీర్థటీక), ప్రపంచ మిథ్యాత్వవాద ఖండనము (జయతీర్థటీక), తత్త్వసంఖ్యానము (జయతీర్థ, సత్యధర్మతీర్థ టీకలు), తత్త్వవివేకము (జయతీర్థటీక), ఉత్తోవ్యద్యోతము (జయతీర్థ, రాఘవేంద్ర, శ్రీనివాసటీకలు), కర్మనిర్ణయము, విష్ణుతత్త్వవినిర్ణయము (జయతీర్థటీక) అను ప్రకరణ గ్రంథములు ఈ ఆచార్యవిరచితములు.

యమకభారతము, భాగవత తాత్పర్య నిర్ణయము, మహాభారత తాత్పర్య నిర్ణయము అను సంగ్రహగ్రంథములనుగూడ మధ్వాచార్యులు విలిఖించిరి. ద్వాదశస్తోత్రము, కృష్ణామృతమహార్ణవము (శ్రీనివాసటీక), తంత్రసారసంగ్రహము, సదాచార స్మృతి అనునవి సాధనపథమునకు జెందిన మాధ్వ గ్రంథములు.

ఇవిగాక ఋగ్వేద ప్రథమ మండలమునందలి మొదటి నలువదిసూక్తములకు భాష్యమును మధ్వాచార్యులు విరచించిరి; జయతీర్థుడు 'సంబంధదీపిక' అను టీకను సమకూర్చెను; రాఘవేంద్రస్వామి 'మంత్రార్థ మంజరి'ని విలిఖించెను.

ఇవి శ్రీమధ్వాచార్య విరచిత గ్రంథములు. ఇక ఈయన ఈగ్రంథములందు ప్రపంచించిన మతమును గురించి ఆలోచింతము.

**అధికారి :**

మాధ్వమతమున అధికారి మూడువిధములు— మంద, మధ్యమ, ఉత్తమ లని. మనుష్యులయందు ఉత్తమగుణసంపన్ను లగువారు మందులు. ఋషులు, గంధర్వులు మధ్యములు. దేవతలు ఉత్తములు. ఇయ్యది జాతిగత భేదము. గుణగతమగు భేదముకూడ ఉన్నది. దాని తెఱ గియ్యది: పరమపురుషునియందు భక్తిగలవాడును, అధ్యయనశీలుడును నగు వ్యక్తి అధమాధికారి; శమసంయుక్తుడు మధ్యమాధికారి; సకలము ననిత్య మని బుద్ధి ఉదయింప, కేవలము విష్ణుని శరణమును బొందినవాడు ఉత్తమాధికారి. ఇతడు కర్మసన్యాసి.

**సంబంధము :**

శాస్త్రమునకును, బ్రహ్మమునకును ప్రతిపాద్య ప్రతిపాదక భావసంబంధము. బ్రహ్మము శాస్త్రగమ్యము, అగమ్యము కాదు, దర్శనీయము, వాచ్యము. 'అవాఙ్మనసగోచర'మన అప్రసిద్ధమనియే ఎఱుగనగును కాని సంపూర్ణముగ అగోచర మని తలపరాదు. దాని గుణముల కంతు లేదు. మేరుపర్వతము దర్శనీయమే కాని మహత్తు అగుటవలన సంపూర్ణదర్శన మలభ్యము. 'ఆత్మనైవాత్మనాత్మానం పశ్యేత్' అని శ్రుతియందుండుటవలనను, 'ఈక్షతే ర్నాశబ్దం' అని సూత్రకార నిర్వచనమువలనను బ్రహ్మము శబ్దగమ్యమే.౧

**విషయము :**

అశేష సద్గుణ సంపన్నుడగు విష్ణువే ప్రతిపాద్యము. శ్రుతి స్మృతి పురాణేతిహాసముల సర్వత్ర విష్ణుని బ్రహ్మత్వము ప్రతిపాదితము. ఈయన దేశ కాలములవలన అపరిచ్ఛిన్నుడు, అనంతుడు. ఈయన గుణముల నిట్టివి, ఇంతవి అని చెప్పజాలము. కనుకనే నిర్గుణుడు. ఈయన జగత్తుయొక్క సృష్టి స్థితి సంహార ములకు కారణము. అశేషగుణములకును ఆకరుడు. బ్రహ్మము నిర్విశేషము కాదు, సవిశేషము. జీవుడీయననుండి అత్యంతము భిన్నుడు.

**ప్రయోజనము :**

ఆనందప్రాప్తి, దుఃఖనివృత్తులే ప్రయోజనము. ఈశ్వరనామాంకన, నామకరణ, భజనాదుల నాయన ప్రీతు డగును. ఆయనప్రసాదమున సాలోక్య సారూప్య ముక్తులు లభించును. వైకుంఠపతి యగు విష్ణువే సేవ్యుడు. ముక్తపురుషులు వైకుంఠమున కరిగి, నారాయణసేవ నొనర్చి పరమానందమును బొందుదురు. వైకుంఠ ప్రాప్తియగు ముక్తియే పరమప్రయోజనము.

---

౧. ఈ సూత్రమునకు సాంఖ్యమతఖండనపరముగ శ్రీశంకరరామానుజులు అర్థమును చెప్పిరి. శ్రీమధ్వుని అర్థమును బలదేవుడుకూడ గ్రహించెను; వల్లభుడుకూడ అనుసరించెను.

### ప్రమాణములు :

యథార్థజ్ఞానమును కలిగించునదే ప్రమాణమని సామాన్యనిర్వచనము. మధ్వమతమున జ్ఞేయవస్తు ప్రతిపాదకము జ్ఞానము— జ్ఞానమే ప్రధాన ప్రమాణము. జ్ఞానజ్ఞేయములకు మధ్య ఎట్టి అవాంతరవస్తువుయొక్క ప్రయోజనమును లేదు. జ్ఞానోదయానంతరము తదుపాయము తొలగిపోవుచున్నది. ఇంద్రియములవలన జ్ఞానము కలుగుపట్ల ఇంద్రియములు జ్ఞానముయొక్క అంశము కావు. జ్ఞానోదయానంతరము గూడ అవి జ్ఞానాంశములు గాజాలవు. జ్ఞానము ఈ ఇంద్రియముల సాయమున వస్తువులను గ్రహించుటలేదు. కనుక జ్ఞానము, లేక బోధయే ప్రమాణము (ప్రమాణలక్షణము).

ఈ ప్రమాణము కేవలము, అనుప్రమాణము అని ద్వివిధము. అందు ఈశ్వరుడు, లక్ష్మి, యోగ్యము, యోగి అనునవి కేవలప్రమాణములు. ఈశ్వరుడును, లక్ష్మియును అనాది, నిత్యములు. అనుప్రమాణము ప్రత్యక్ష, అనుమాన, ఆగమము లని మూడువిధములు. 'నిర్దోషార్థేంద్రియ సన్నికర్ష' ప్రత్యక్షప్రమాణము. 'నిర్దోషోపపత్తి' అనుమానము. 'నిర్దోషశబ్దము' ఆగమము. ఇయ్యది స్వతఃసిద్ధము, అపౌరుషేయము, సత్యస్వరూపము, సత్యపరిజ్ఞానోపాయము, స్వతఃప్రమాణము, నిత్యము. అనుమానాదులకు నియతప్రామాణ్యము లేదు (సూత్రభాష్యము). అర్థాపత్తి, అభావములు అనుమానాంతర్గతములు.

ఈజ్ఞాన మాపేక్షికము. జ్ఞాతృజ్ఞేయములు లేకున్న జ్ఞానము కలుగదు. జ్ఞానము, చింత అభిన్న వస్తువులు. జ్ఞాతృజ్ఞేయములు చిరసంబద్ధములు. నిర్వికల్పక జ్ఞాన మసంభవము ; జ్ఞానము లన్నియు సవికల్పకములు. విచారమున ప్రమాణిత మగునదే సత్యము. సత్యము, దృశ్యవస్తువు లభిన్నములు (విష్ణుతత్త్వనిర్ణయము).

### పదార్థములు :

మధ్వమతమున పదార్థములు పది. అవి: ౧. భావవస్తువు, ౨. గుణము, ౩. క్రియ, ౪. జాతి, ౫. విశేషత్వము, ౬. విశిష్టము, ౭. అంశి, ౮. శక్తి, ౯. సాదృశ్యము, ౧౦. అభావము అనునవి. ఇవన్నియును హరిపరతంత్రములు. వీటి పారతంత్ర్యమును గ్రహించినవాడే ముక్తిని బొందును (తత్త్వ వివేకము).

### తత్త్వములు :

ఈ మతమున స్వతంత్రము, అస్వతంత్రము అని రెండు విధములు. అశేష సద్గుణ సంపన్నుడగు విష్ణువే స్వతంత్రుడు, జీవ జగత్తులు అస్వతంత్రములు (తత్త్వ సంఖ్యానము).

ఇక ఈ తత్త్వములను గురించి ఒకింత ప్రసంగింతము.

### జగత్తు :

జగత్తు సత్యము, జడము, అస్వతంత్రము. భగవంతు డీజగత్తును నియమించుచున్నాడు. జగత్తు కాలసాపేక్షికముగ అనంతము. అచేతన వస్తువులు నిత్య, అనిత్య, నిత్యానిత్యము లని త్రివిధములు. వేదములు, పురాణములు, కాలము, ప్రకృతి నిత్యములు. నిత్యానిత్యములు మూడు విధములు. అనిత్యము అసంసృష్టము, సంసృష్టము అని రెండువిధములు. మహత్, అహంకార, బుద్ధి, మనః, పంచభూత, పంచతన్మాత్ర, దశేంద్రియములు అసంసృష్టములు. శరీరము, తద్గతములు సంసృష్టములు.

### జీవుడు :

జీవు డణుస్వరూపుడు, ప్రతిదేహమునందును భిన్నుడు, అస్వతంత్రుడు. ఈశ్వరునితో నైక్యమెన్నడును కలుగజాలదు. జీవుడు సేవకుడు, భగవానుడు సేవ్యుడు. పరమేశ్వరుడు సేవ్యు డగుటవలన, రాజును భృత్యుడును భిన్నులైనట్లు, జీవేశ్వరులు భిన్నులు. పురుషార్థప్రార్థన మొనర్పబోయి ఆధిపత్యమును బొంద గోరిన ఆఘాతములే దొరకును. భగవద్గుణోత్కర్ష వలననే ఇష్టప్రాప్తి యగును. అభేదము నొందగోరి, విష్ణుని గుణములు ఎండమావులవంటి వనువారు 'అంధతామిస్ర' నరకమును బొందుదురు (మహాభారత తాత్పర్యనిర్ణయము). జీవుడు చేతనుడైనను అతని జ్ఞానము పరిమితము; కాలసాపేక్షముగ అపరిమితము. ఈ జీవులు దుఃఖసంస్పృష్టులు, అసంస్పృ

ష్టులు అని రెండు విధములుగ నుందురు. దుఃఖసంస్పృష్టులయందు ముక్తియోగ్యులు, అయోగ్యులు అను రెండు భేదము లున్నవి. సాత్త్విక, రాజసిక, తామసికులని మఱియొక విభజన. వైకుంఠమును బొందువారు, అనంతనరకమును బొందువారు, నియతముగ సంసారమున భ్రమించువారు అని ఇంకొక విభాగము.

### బ్రహ్మము :

నిఖిల సద్గుణాలయుడగు విష్ణువే ఏతన్మత ప్రతిపాద్యమగు బ్రహ్మము. ఈయన స్వతంత్రుడు. బ్రహ్మ, శివాదులకంటె శ్రేష్ఠుడు. దేవత లందఱును ఈయనకు వశులు. సృష్టిస్థితిలయముల కీయన కర్త; ముక్తిప్రదాత; ముక్తుల కాశ్రయుడు. ఈయనశక్తి అపరిమితము (విష్ణుతత్త్వ నిర్ణయము).

ఈయన భావాభావములకంటె విలక్షణుడు. భావవస్తువులు చేతనాచేతన భేదముల రెండు విధములు. జీవుడు చేతనుడు, జగత్తు అచేతనము. ఈ రెండును భగవదధీనములు. భగవానుడు వీటినుండి సంపూర్ణముగ వేరు.

### సాధన :

భక్తి, త్యాగము, ఈశ్వరుని ప్రత్యక్షానుభూతి ముక్తికి సాధనములు. ధ్యానములేకున్న ఈశ్వరసాక్షాత్కారము కలుగదు. వేదాధ్యయనము, ఇంద్రియ సంయమము, విలాసత్యాగము, ఆశాభయములపట్ల ఔదాసీన్యము, జాగృతిక వస్తువుల వినాశశీలతా జ్ఞానము, ఆత్మసమర్పణములు అంగములు. సేవ ముఖ్యసాధనము. ఇది అంకనము, నామకరణము, భజనము అని మూడువిధములు. నారాయణనామ స్మరణార్థము శరీరమునశంఖచక్రాదులను చిత్రించుకొనట అంకనము. సంతతికి కేశవాదినామము లుంచుట నామకరణము. భజన వాచిక, కాయిక, మానసికము లని మూడువిధములు. సత్య, హిత, ప్రియవాక్య కథనము, స్వాధ్యాయము అని వాచిక భజన నాల్గువిధములు. దాన, పరిత్రాణ, పరిరక్షణము లని శారీరకభజన మూడువిధములు. దయా, స్పృహా, శ్రద్ధ లని మానసికభజన మూడు తెఱగులు. ఇట్లు భజన దశవిధము లగుచున్నది. ఈ భజనను నారాయణార్పణపూర్వకముగ నొనర్పవలెను. భగవద్భక్తి, జ్ఞాన, వైరాగ్యపూర్వకముగ కర్మ నాచరింపవలెను (కర్మనిర్ణయము).

### ముక్తి :

కర్మయొక్క ఫలితము జ్ఞాన మనబడు భక్తి. తత్ఫలమే ముక్తి. ముక్తియన జీవన్ముక్తి, నిర్వాణముక్తులు గావు; వైకుంఠప్రాప్తి. ముక్తజీవి ఈశ్వరసేవకుడు. ఇది పురుషార్థములలో నుత్తమము. ఇది యొక్కటియే నిత్యము, తక్కిన వనిత్యములు. ధ్యానఫలముగ జీవేశ్వర భేదము, జడేశ్వర భేదము, జీవభేదము, జడజీవభేదము, జడభేదముల జ్ఞానము కలుగ ముక్తి లభించును. వస్తు యాథార్థ్యజ్ఞానము, ఈశ్వరగుణోత్కర్ష జ్ఞానములు గూడ ముక్తికి బూర్వ మవసరములు.

### పరమతఖండన :

సంక్షిప్తముగ నియ్యవి మధ్వాచార్యులు ప్రతిపాదించిన విషయములు. ఇదిగాక ఈయన పరమతముల నిరువదియొక్కంటిని ఖండించినట్లు వినికి. ఈయన ముఖ్యముగ శాంకరదర్శన ప్రతిపాద్య విషయములగు జగన్మిథ్యాత్వ, మాయావాద, అభేదవాద, ఉపాధివాదములను ఖండించినాడు. న్యాయజటిలములగు ఈ విషయములు సామాన్యపాఠకులకు విసుగును గూర్చునవగుటవలన, వాటి ప్రసంగమును విరమించుచున్నాడను. మధ్వుడేకాదు, ఈ సంప్రదాయములగు ఆచార్యు లందఱును శాంకరమత ఖండనమున విశేషమగు ఉపజ్ఞను జూపెట్టిరి. ఆపాతదృష్టికి వారు చూపు ఉపపత్తులు ఖండనాసంభవము లనిపించును. నవ్యన్యాయమున ప్రవేశము లేకున్న ఈమెలికలు తెలియవు.

### అనుశీలన :

శాంకరమతమున దృశ్యము మిథ్య. మాధ్వమతమున దృశ్యము సత్యము. శాంకరమతమున జ్ఞానము నిర్వికల్పకము, భేదరహితము. మాధ్వమతమున సవికల్పకము; జ్ఞాతృజ్ఞేయములు లేకున్న కలుగదు. మాధ్వమతమున భేదము నిత్యము, శాంకరమతమున ఔపాధికము. శాంకరమతమున జీవ బ్రహ్మములకు భేదము లేదు. మాధ్వమతమున విలక్షణమగు భేద మున్నది.

శ్రీరామానుజుడు స్వగతభేదము నంగీకరించినను సజాతీయ విజాతీయ భేదముల నంగీకరింపడు. బ్రహ్మము పూర్ణము, జీవుడు అణువు అను విషయమున ఈ ఇరువురకును కలయికయున్నది. ఈ ఇరువురి మతమున జీవబ్రహ్మములకు సేవక సేవ్య భావ మున్నది.

ముక్తి విషయమునగూడ శంకర మతముతో సంపూర్ణ విరోధము. కాని, ఉపాసనా ఫలముగ జ్ఞానరూపమగు భక్తియు, తత్ఫలముగ ముక్తియు లభించుననుటలో శ్రీ రామానుజ మధ్వు లిరువురును ఒకటే. పంచవిధోపాసన, ఇతర విత్స్వరూపకమగు భక్తి శ్రీరామానుజుడంగీకరించినాడు. శ్రీ శంకరుని భక్తి ఆత్మానుసంధాన రూపకము; జ్ఞానమే మోక్షోపాయము.

రామానుజమతమున జ్ఞాని జగత్తును బ్రహ్మముగ జూచును. మధ్వమతమున ఈశ్వరునిచే నియమింపబడునదిగ గాంచును. శంకరమతమున జగత్తేయుండదు.

రామానుజమతమున జగత్తు ఈశ్వరుని పరిణతి. మధ్వమతమున ఈశ్వరునినుండి సంపూర్ణముగ వేరు. శాంకరమతమున బ్రహ్మముయొక్క వివర్తము.

మధ్వమతమున గనబడు ఉపవాసవిధి, అహింసా ప్రాచుర్యములు జైనమత ప్రభావమును దెలుపుచున్నవి.

కాని 'అనంతనరకవిధి'ని శ్రీమధ్వుడే మొదట విధించినాడు. అయోక్తికమగు ఈ నరకశిక్ష సముచితమని పించదు. అపశూద్రాధికరణమున శ్రీశంకరుడు చూపిన ఔదార్యమును ఈయన శూద్రులపట్ల జూపజాలక పోయెను. శూద్రులు జ్ఞాన-అనర్హు లని ఈయన నిర్వచనము. ఈయన రామానుజమతప్రభావమునకు లోనైనట్లే గౌడీయ వైష్ణవులును, వల్లభాచార్యుడును ఏతన్మతప్రభావమునకు లోనైరి. అందు వలన విశేషముగ సాదృశ్యము అచింత్యభేదాభేద వాద, శుద్ధాద్వైత వాదముల గానవచ్చుచున్నది. రామానుజుని 'దాస్యభావము' మధ్వునియందు సంపుష్టి నందినది.

ఇతర వైష్ణవుల కుండు శివవిద్వేషము మధ్వమతమున గనబడదు. అదియును గాక శ్రీమధ్వుడు విధించిన భజనప్రకారము సామాన్యుల కందుబాటులో నున్నది.



శ్రీమదానందతీర్థ భగవత్పాదాచార్యులు
[శ్రీమన్మధ్వాచార్యులు]

## సమాప్తి :

ఇప్పు డుదయించు ప్రశ్నలు—శంకరరామానుజ మతములలో నెయ్యది సరియైనది? ఒకటి సరియైన తక్కినవారు అల్పజ్ఞు లనవలసివచ్చునే? వీ రందరును సర్వజ్ఞులైన, ఇట్లు విభిన్న పంథల ద్రొక్కనేల? వీట నెయ్యది ఆశ్రయణీయము? అని.

ఈ ప్రశ్నలకు ఒక్కమాటలో జవాబిచ్చుట కష్టము. త్రిమతకర్తృ నామమున వ్యవహరింపబడు వీరు పరస్పర ఖండన మండనములకు వ్రాసిన గ్రంథములు కొన్నివందలుగ నున్నవి. కేవలము పాండిత్యము నాశ్రయించి, న్యాయశాస్త్ర దృష్టితో బరికింప శంకర మత మొక్కటే నిలువగలదు. అదియునుగాక ఆధునిక విజ్ఞాన, మానసిక, తర్కదర్శనశాస్త్రముల అదుపునకుగూడ ఆగగలిగిన శక్తిసామర్థ్యములు దీని కున్నవి. తక్కినవి పడిపోవును. ఈ దృష్ట్యా శాంకర మతమే సమంజసము.

ఇక, జన్మగతమగు సంస్కారము, పారిపార్శ్వక పరిస్థితుల ననుసరించి కలుగు భావము ననుసరించి, 'భిన్నరుచిర్హి లోకః' ఒకరికి నచ్చినది మఱియొకరికి నచ్చదు. ఈ శ్రేణికి జెందినవారు తమమతమే అభ్రాంతము, తక్కినవి పొల్లులు అని యెంతురు. ఇట్టి యేకదేశబుద్ధులవలననే ప్రపంచమున రక్తనదులు ప్రవహింపజేయబడినవి. వీరి స్వర్ణద్వారము లితరుల కనధిగమ్యము లనియే వచింతురు. మఱియు తదితరులకు 'అనంతనరకము'!

సాధకదృష్టితో జూచిన, హనుమంతునివాక్యము గ్రహణయోగ్యము. అది—

"దేహబుద్ధ్యాస్మి దాసస్తే, జీవబుద్ధ్యా త్వదంశకః,
ఆత్మబుద్ధ్యా త్వమేవాహం, ఇతి మే నిశ్చితా మతిః"

కేవలము దేహబుద్ధి యున్నవారలకు శ్రీమధ్వుడు ప్రవచించిన దాస్యభక్తియే గ్రహణీయము. సాధనారాజ్యమున నొకింత అగ్రేసరులై, తమ్ము జీవులుగ తలచువారలకు శ్రీరామానుజుని విశిష్టాద్వైత ముపకారి. ఆత్మ[redacted] తలచువారలు శంకర ప్రోక్త మగు బ్రహ్మతత్త్వముననే వెలయుదురు.

• కనుక, మానవుని నిశ్శ్రేయసలాభార్థము ఈ మూడును ప్రయోజనములే యని గ్రహింపగలము. సాధకుడు ద్వైతమతముతో తన సాధన నారంభించి శ్రీరామానుజుడు చూపిన పథము ననుసరించి అద్వైతమును జేరు నని నానిగమనము. దక్షిణేశ్వర పూజారి యగు శ్రీ రామకృష్ణదేవుడు ఈ సత్యము నుపలబ్ధ మొనర్చుకొని, ఈసమన్వయవాదమును తన గృహస్థ, సన్న్యాసి శిష్యు లిర్వురకును బోధించెను. ఈ అనుభూతి ననుసరించియే ఆయన అధికారితారతమ్యములను బట్టి కొందఱికి ద్వైతమతపరములును, మఱి కొందఱికి విశిష్టాద్వైతమతపరములును, తదితరులకు అద్వైతమతపరములును నగు సాధనల నుపదేశించెను. అంతియగాక, ఒకరికే ఈ మూడు సాధనలను క్రమముగా నుపదేశించియుండుటగూడ ఆయనజీవితమున గనబడగలదు.

ఈ విషయమున తర్కమునకు దిగి వ్యాయపుచ్ఛగల సమయము నాకు లేదు. కనుక ఇంకొకవిషయము నుల్లేఖించి ఈ వ్యాసమును ముగించుచున్నాను. 'సత్య మొక్కటియే. సత్యమునకు బహురూపము లుండవు' అను విషయము న్యాయసంగతము. మఱియు సత్యమునకు స్వతఃప్రకాశకర మగు శక్తికూడ నున్నది. కనుక ఈమూడు సాధనలలో నేదొయొక్కదాని నైన గ్రహించి మనఃపూర్వకముగ యత్నింప సత్యము ద్వైతమే యగుగాక, లేక విశిష్టాద్వైతమే యగుగాక, లేక అద్వైతమే యగుగాక సాధకునకు దర్శన మిచ్చితీరును. అందువలన సత్యానుభూతికి తీవ్రమగు అన్వేషణ సాధనలే ప్రయోజనములు; వాగ్వితండములు కావు అని నామనవి. స్వయంజ్యోతిషమగు సత్యమును వాగ్వాదమున ఉపపన్న మొనర్ప జూచువానికి తాను సత్య మని నమ్మదానియందే విశ్వాసము లేదనవలసివచ్చును.

**తుదిమాట:**

చరమసత్యము కేవల మనుభవయోగ్యము, అవర్ణనీయము అగుటవలన అద్వైతము, దానిని నోటితో

జెప్పవలసివచ్చిన విశిష్టాద్వైతము, కార్యరూపమున న్నలను ఆచార్యులు ఆయా దేశకాలపరిస్థితుల ననుస బెట్టవలసివచ్చిన ద్వైతమును మన దైనందినజీవితమున రించి తరుచితమగు సత్యభావమును లోకకల్యా సంభవించుచున్నవి. కనుక ఈ మూడింటిలో నే కొర్థము ప్రచారము చేసిరి. ఏద్దాని నాశ్రయించినను యొక్కటియును త్యాజ్యము కాదు. అనుభూతిసంప శ్రేయమే లభింపగలదు.

దిశతు స్వారాజ్యం వా వితరతు తాపత్రయంవాపి,
సుఖితం దుఃఖితమపి మాం నయుంచతు కేశవస్వామీ.

---



 

# శుచిస్నానము

---

శ్రీ కె. అన్నమరాజశర్మ

[రమారమి నాల్గువందల సంవత్సరములకుమున్ను వంగదేశమున 'నవద్వీప' మను పండితస్థానమున శ్రీకృష్ణ చైతన్యుఁడను మహాపురుషుఁ డవతరించి, జాతిమత వర్ణభేదము లేక, విష్ణుభక్తియే తరణోపాయమని యుద్ఘోషించెను. భువనమోహనతేజస్వియగు చైతన్యుఁడు భక్తిపారవశ్యమున నొక్కొక్కతఱి గీతము లాలపించుచు, నర్ధనిమీలిత దృగంచలుఁడై దారులంబడి పోవుచుండ, ప్రజలు తన్మయులై యనిమిషస్థితిఁ జూచుచుండిరి. అతని పాదాంకము లంటి వంగ కళింగదేశములందలి భక్తశ్రేణి చీమలబారులంబలె పరుగిడుచుండెను. చైతన్యుని భక్తిపీయూషధారలఁ గ్రోల వెన్నంటినవారిలో 'బురాన్' గ్రామవాసియగు హరదాసను పంచమభక్తుఁడు చైతన్యునికొఱకు వెదకివెదకి, కడకు మహానదీతీరస్థ జగన్నాథ (పూరీ) క్షేత్రమున నుంట యెఱిఁగి యచటి కేఁగెను. కాని, జాతివ్యవస్థచే హరదాసున కాలయాంతర్భాగమున నున్న గురుదేవుని దర్శనము లభింపదయ్యెను. భగవద్భక్తి ప్రభావమున హరదాసునియవస్థ చైతన్యుని స్వప్నావస్థలో నొకదృశ్యమయ్యెను. వెంటనే చైతన్యుఁడు మేల్కాంచి హరదాసుని సోదరవాత్సల్యమునఁ గౌఁగిలించికొని లోనికిం గొంపోయి, త్రుటిమాత్రమున భక్తి సౌరభవాసితమగు నొక శాశ్వతానందప్రపంచమును జూపించెను. ఈ విషయశకలమే యీ రచనకుఁ బునాది.]

సాంధ్యలేఖిని బంగారుచాయ మెదిపి - చిత్రయవనిక లెన్నో రచించె నపర
దిఙ్ముఖమున; మహానదీతీరమంటి - తొందరగఁ జనుచుండె భక్తులచయంబు.

అల జగన్నాథు దేవాలయంబునుండి - నాస్తికుల కర్ణకుహరంబు లవిసిపోవ
కలఁడు భగవానుఁ డనువాఁడు కలఁడుకలఁడు-నాఁగ వినవచ్చె బహుళఘంటారవంబు.

అత్తఱి ధూపదీపముల నర్చన సేయఁగ స్త్రీలు పూరుషుల్
బత్తినిఁ ద్రోసికొంచు గుడివాకిట మూఁగిరి; మాలజన్మకు
న్జిత్తమునందు రోయుచు, జనించెడు నశ్రుల నొత్తికొంచు లో
కోత్తముఁ డొందు దర్శనవియోగమునన్ గడపెన్ నిశీథమున్.

జనతండంబులు భక్తిశీధురస మాస్వాదించి, చైతన్య కీ
ర్తనలం బ్రీతిని నాలకించి, ప్రణయోన్మాదైకలీలాప్తిఁ దా
ల్చినరీతి న్నటనం బొనర్చెను; గతించెన్ యామముల్ రెండు, లో
చనపర్వంబుగఁ దోఁచె భక్తుల విలాసక్రీడ లెంతేనియున్.

అపుడు పూర్ణచంద్రోదయ మైనకరణి - కృష్ణచైతన్యముఖమునఁ గీలుకొనియె
భక్తులు పరవశంబునఁ బ్రతిమ లట్లు - తన్మయానంద మొదవుజ్యోత్స్నప్రశాంతి.

స్వప్నమో కాక భక్తిప్రభావమేమొ - భావమునఁబల్కె నొకదివ్యవాణి యిట్లు
"ఓయిచైతన్య నీదుసహోదరుండు - ఆలయబహిఃప్రదేశమం దవయఁ గనవో ?"

అన, వినినంతమాత్రమున నాత్రమునన్ గనుతెప్ప లొత్తి, ది
గ్గున తనస్థానమున్ విడిచి, కోవెలముంగిట "ప్రేమపూర్ణ! మా
లను దయఁ జూడవా"యని విలాపభరంబునఁ గుందు భక్తుని
న్గని, కరుణారసార్ద్రవచనంబుల "ఓహరదాస, రమ్మ"నెన్.

"మాలఁడ నేను, విప్రకులమండన! లోనికి వచ్చు టెట్లు? దే
వాలయమందు నాదు మలినాంఘ్రులు సోఁకిన దుష్కృతానల
జ్వాలలు ప్రాఁకకుండునె? భవన్ముఖదర్శనభాగ్య మబ్బె, చా
ల్జాలును నీదయాపరత, స్వామిని దూరము నుండి కాంచెదన్.

పచ్చని పూలమాలికను భక్తినిఁ గ్రుచ్చితి చేలగట్టులన్
విచ్చినపువ్వు లేర్చి, నిరుపేద యొసంగెడి కాన్క దాల్పవో!
త్వచ్చరణాబ్జ పీఠమున దాసుఁడనై నిలువంగ నీడ నా
కిచ్చెదొ, త్రోసిపుచ్చెదొ, మహీసురశేఖర! యంజలించితిన్.

పంచముఁడనౌట బోఁపలపంచ నెట్లు - నిలువఁగల్గుదు? జన్మచే కలుషితుండ
పాపపంకిలమైన యీ భగ్నహృదయ - మందు జనియించునే భక్తి?" యనఁగ నవ్వి.

"విప్రుఁడును పంచముండను భేదబుద్ధి - అల్పులకుఁగాక యున్నె మహాత్ములకును ?
సత్యదృష్టినిఁ దిలకించు జ్ఞానమతికి - సర్వ మద్వైతమూర్తి దర్శన మొసంగు.

పరమపూరుషు సేవింప భక్తిపుల్ల - భావ మొక్కండె సుంత తోడ్పడును గాని
ధనము, జాతియు, శాస్త్రలు పనికిరావు - ఆత్మకుసుమసమర్పణ మభిలషింతు"

అనుచు చైతన్యుఁ డమల దయాంతరంగుఁ - డగుచు స్నేహోల్బణంబున హర్షజనిత
నిజభుజాశ్లేషపాశబంధితునిఁ జేసి - యల జగన్నాథదర్శన మందఁజేసె.

కృష్ణచైతన్యసారిత మృదులమృదుల - మైన యాశ్లేషబంధమం దడఁగినట్టి
భక్తిచైతన్యశక్తినిఁ బలుకవశమె! - పంచముఁడు శుచిస్నాతుఁడై బ్రాహ్మ్యమందె.

మన వ్యాఖ్యాతలూ, పాశ్చాత్యులూ పూర్తిగా తప్పుడర్థంచేసిన

# కొన్ని ఋక్కులు

● శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

ఋగ్వేదానికి ఆరో ఏడో వ్యాఖ్యలున్నవి. వానిలో అచ్చైనవి నాలుగు. అందులో సాయణుల దొక్కటే పూర్తిగా నున్నది. ఎన్ని వ్యాఖ్యలున్నా, వ్యాఖ్యాతలు తమ ఇష్టంవచ్చినరీతిగానే వ్యాఖ్యానాలు చేశారు. ఒకరు నైరుక్తు సిద్ధాంతం ప్రకారం చేస్తే, మరొకరు యాజ్ఞికుల దృక్పథంనుంచి చేశారు. మొత్తంమీద ఏస్కందస్వామి లాంటివారో తప్ప మిగిలినవారంతా అసలు ఋగ్వేద మేం చెప్పుతుందో మరచిపోయి ముందుగనే తమ మనస్సులో పెట్టుకొన్న (Preconceived) భావాలను ప్రవేశపెట్టి అందులోని కళను కొంతవరకు నాశనం చేశారు. తర్వాత వచ్చిన వేదాలూ బ్రాహ్మణాలే యజ్ఞాల కనుగుణంగా ఋగ్వేదాన్ని మార్చివేయటానికి ప్రయత్నించినై. కాని అసలు ఋగ్వేదం యజ్ఞాలు చేయమని కాని, వద్దనికాని చెప్పనేచెప్పదు. ఆకాలపు ప్రకృతి కవులు ప్రకృతిలో కనపడే దృశ్యాలను చూచి తమలో నున్న కవిత్వకళతో వాటిని చక్కగా వర్ణించారు. చతుర్థమండలంలోని ఉషస్సూక్తం చూస్తే ఈ సంగతి బోధపడగలదు. కాని వాటినన్నింటినీ, సవితృసూక్తంలో సవిత నుద్దేశించి చేసిన ప్రార్థనను గాయత్రీదేవతకు మార్చినట్లుగా, మన యాజ్ఞికులు వారివారి చిత్తవృత్తుల కనుకూలంగా దిద్దివేశారు. అందువలన కొన్ని సూక్తాలూ, ఋక్కులూ చాలా అసభ్యంగా వ్యాఖ్యానము చేయబడ్డవి. ఆ వ్యాఖ్యలను నగ మెరిగిన పాశ్చాత్యులు ఇంగ్లీషులో వ్రాస్తూ వారికితోచిన మరికొన్ని తప్పులను ప్రవేశపెట్టారు. దీనితో ఋగ్వేదకవుల ఆశయాలు భగ్నాలవటమే కాకుండా, తప్పుడర్థాలుకూడా చాలా బయలుదేరినవి. కాబట్టి మన వ్యాఖ్యాతలూ, పాశ్చాత్యులూ పూర్తిగా తప్పుడర్థం (Misinterpret) చేసిన ఋక్కులను తీసుకొని విచారించి నిజము తేల్చటం మన విధ్యుక్తధర్మము. అందుచేత కొన్ని ఋక్కులను విమర్శించటానికి పూనుకొన్నాను.

౧

"యదఙ్గ దాశుషే త్వ మగ్నే భద్రం కరిష్యసి
తవే త్త త్సత్య మఙ్గిరః" —౧-౧-౬.

ఓం ప్రథమమంటూ ఈ ప్రథమ సూక్తంలోనే తప్పుడు వ్యాఖ్యానము చేశారు. ఇక్కడ అగ్ని నుద్దేశిస్తూ 'అంగిరః' అని సంబోధన చేయ్యబడ్డది. ఇందులో అగ్నిఅంగిరసులు ఒకటిగానే పిలవబడ్డారు. ౧-3౭-౧౨ లో కూడా ఇదేవిధంగా కనపడుతుంది. కాని ౫-౧౧-౬ లో—

"త్వామగ్నే అంగిరసో గుహాహితం
అన్వవిందఞ్ శిశ్రియాణం వనేవనే
సజాయసే మథ్యమానః సహో
మహత్వా మాహుః సహసః పుత్ర మంగిరః"

అనే సూక్తంలో అగ్ని అంగిరసులకు పితాపుత్రభావము సూచింపబడ్డది. ౧-౧-౬ పై వ్యాఖ్య వ్రాయుచు మాధవభట్టు "అంగిరస్త్వంవా ఏకో అగ్నిరేవే త్యుక్తం భవతి" (నీవే అంగిరసుడవు, అనగా నీవొక్కడవే అగ్నివనబెల్లును) అన్నాడు. కాని ౫-౧౧-౬ను దగ్గరపెట్టుకొని చూచినచో ఈవ్యాఖ్య సరిపోదు. సాయణులు "అంగిరా అంగారాః" అను యాస్కవాక్యమును, "యే అంగారాః ఆసంస్తేఅంగిరసో ఽభవన్" అను ఐతరేయబ్రాహ్మణ వాక్యమును ఉదాహరింపుచు "తస్మా దంగిరో నామకముని కారణత్వాత్ అంగార రూపస్య అగ్నేః అంగిరస్త్వమ్" అని వ్యాఖ్య చేసినారు బ్రాహ్మణవాక్యము తీసికొని అంగిరుడను ఋషి కుమారుడు కాబట్టి అగ్నికి అంగిరసుడని పేరు వచ్చిం దన్నారు. కాని నిజం పరిశీలిస్తే ఇలాంటి దేమీ లేదు. పురాణగాథే కాకుండా "అంగిరః గమనశీలః" అని ఒక శ్లోక అతికించినారు. యజ్ఞకాండలో మునిగితేలిన సాయణునికి ఋగ్వేదము యాగాలలో ప్రయోగించే మంత్రగ్రంథంగానే కనపడింది. అందుకనే పురాణగాథ చక్కగా చిత్రించినాడు. అంతేకాని ప్రకృత్యుపాసకులై, ప్రకృతిలో సూక్ష్మముల నన్నింటిని తెలిసికొన్న ఋగ్వేదకవుల మనస్సును తెలిసికో లేకపోయినాడు.

ఇక్కడ ముఖ్యముగా మనము గమనింపవలసినది ఈ రెండు పదాలకు ధాతుసామ్యము. "అగి గతౌ" అనునదే ధాతువు. అగిధాతువు ఇకారాంత మౌటచే "ఇదితో నుం ధాతోః" అనుసూత్రంచేత 'అంగి' అను రూపం వస్తుంది. ఇక్కడ "అంగేర్నలోపశ్చ" అనే. ఉణాదిసూత్రప్రకారం నకారలోపం, నిత్ వచ్చి అగ్నిరూపం వస్తుంది. కాని అంగిరసశబ్దంలో 'అంగి' అన్న శబ్దానికి పైశబ్దం మాదిరిగానే నకారలోపం, నిత్ వచ్చి 'అగ్నిరస' అని శబ్దమై ఉండాలిసింది. కాని నకారలోపం రాకుండా 'అంగతే రసి రిరుడాగమశ్చ' అనే సూత్రప్రకారం ఇరుడాగమం వచ్చి అంగిరస అయింది. "ప్రయోగమూలం వ్యాకరణ" మవటంచేత ఏదోవిధంగా పాణిని దీనికి సమాధాన మిచ్చాడు. భాషాశాస్త్ర ప్రకారము 'అగ్నిరస' అనే రూపమే సాధువు. కాని వర్ణవ్యత్యయము వచ్చి 'హింస' శబ్దము 'సింహ' మైనట్లుగా 'అగ్నిరసుడు' 'అంగిరసు' డైనాడు.

ఈ సంబంధంలో దీనినే బలపరుస్తూ ఉన్న స్కందస్వామివారి వ్యాఖ్య ఉంది. ఈయనగూడ ఐతరేయ బ్రాహ్మణంలోని కథను క్లుప్తంగా చెప్పి ఆతర్వాత "అంగాని శరీరావయవాః. తద్వ దంగి శరీరం. తస్య స్థితిహేతు మశితపీతరసం కరోతి తదాచష్టే ఇతి ణ్యంతాత్ క్విప్. హే అంగిరః శరీరస్థితి హేతోః అశితపీతరసస్య కర్తా. జాఠరో హ్యగ్నిః అన్నం రసీకరోతి." అని వ్రాశారు. అంగాలంటే శరీరావయవాలు. అంగాలుకలది కాబట్టి శరీరము 'అంగి' ఔతుంది. శరీరస్థితి హేతువైన అశితపీతరసాన్ని కలుగ చేస్తుంది అగ్ని. కాబట్టి అంగిరః అంటే శరీరస్థితి హేతువైన అశిత పీత రసంయొక్క కర్త అని అర్థం తేలుతుంది. జఠరంలో ఉండే అగ్ని అన్నాన్ని రసంగా చేస్తుంది. ఆరసం లోహిత

మాంసస్నాయ్వస్థిమజ్జా శుక్లభావాలతో పరిణామం పొందుతూ శరీరస్థితి హేతువౌతుంది.

మొట్టమొదట స్కందస్వామి అగ్ని పుత్రుడు అంగిరసుడనే ఉపాఖ్యానము చెప్పినా దాన్ని న్యాయంతో సమర్థించినాడు. 'అంగి' అంటే శరీరంలో ఉండే జఠరాగ్ని అన్నాన్ని 'రస'ముగా చేస్తున్నదని చెప్పిన వాక్యము నాయూహకు ప్రబలాధారము. ఇక్కడ జఠరంలో ఉండే 'అగ్ని' కారణమూ, అందులో ఏర్పడ్డ 'రసం' కార్యమూ ఐనవి. అలాంటి సమయంలో కారణకార్యాలకు పితాపుత్రభావము కల్పించటంలో తప్పేముంది? "ఆత్మావై పుత్రనామాసి" అన్న వాక్యము కారణకార్యాలకున్న సంబంధాన్ని చక్కగా తెలియజేస్తుంది. అందుచేత కారణమైన అగ్ని పితృదేవుడైనాడు. కార్యమైన రసము కుమారుడైనాడు. ఈస్వతస్సిద్ధమైన భావానికే కవిత్వంలో మునిగిన ఋగ్వేద కవులు పితాపుత్రభావ మిచ్చి, ఏవిధమైన విషయాన్నైనా, ఎంత స్వల్పమైన సంగతినైనా కవిత్వాత్మ (Poetic soul) గనక ఉంటే నిజంగా కవి ఐనవాడు అత్యున్నతమైన కవిత్వమును కన్పరచగలడని చూపించారు. అంతేకాని అంగిరఋషిపుత్రుడగ్ని యనీ, అందుచేత అంగిరస్త్వం ఇతనిలక్షణాలలో దనీ చూపటం వారి ఉద్దేశమేకాదు. కవిత్వకళ నశించిపోయి వట్టి శుష్కం (Dry and arid) గా ఉన్న బ్రాహ్మణాలకాలంలో సృష్టించిన కథ ఇవి.

ఈపైని జెప్పిందంతా ౫-౧౧-౬ కే సరిపోతుంది. కాని ౧-౧-౬లో పితాపుత్రభావము చూపకుండ ఏకీభావముచూపించారు కవులు. కార్యకారణాలకు భేదము లేనేలేదుగదా. కార్యమనేది వేరే లేకపోవటంచేత కారణమే సత్యము, కార్య మసత్యము. దీనికి "ఏకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతంస్యాత్ వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" అను ఛాందోగ్య వాక్యము నాధారముగా జేసికొనిన "తదనన్యత్వమారంభణశబ్దాదిభ్యః" అన్న బాదరాయణ సూత్రవ్యాఖ్యావసరంలో కార్యకారణములకు భేదము లేనేలే దనియు, భిన్ననామములతో వ్యవహరించటం కేవలవ్యావహారికార్థమే యనియు, న్యాయోపబృంహితమైన శ్రుతితో సిద్ధాంతీకరింపబడ్డది. దీనినే "ఆత్మా వై పుత్రనామాసి" అనువాక్యము గూడ స్థిరపరుస్తుంది.

ఇలాంటి సందర్భంలో అగ్నిని అంగిరసు సు డంటే యేం, అంగిరసుని అగ్నిఅంటే యేం? రెంటిలోనూ సత్యపదార్థము అగ్నియే కదా! అదీగాక 'అంగారము' లేనిదే 'అంగిరసుడు' కాలేడుకదా! అలాంటప్పుడు అగ్నిని అంగిరసుడని సంబోధిస్తే personify చేయబడ్డ అంగిరసుని దగ్గరున్న అగ్నికే ఆ సంబోధన చెల్లుతుంది. మిగత స్థలాలలోకూడా (౨-౭౪-౫; ౧ ౩౨-౧౭ ఇత్యాదుల్లో) ఈ విధంగానే వ్యాఖ్య చేయవలసి ఉంటుంది.



# ★ మధ్యవర్తి ★

[కథానిక]



శ్రీ శివరాజు
వెంకటసుబ్బారావు
[బుచ్చిబాబు]

ఏకాంతాన్ని కవులు మహా మెచ్చుకుంటారు. అది స్వార్థాన్ని మరిపిస్తుం దనీ, అందులో మానవుడు తన ప్రాధాన్యతను కోలుపోతా డనీ వారి వుద్దేశం. కాని యిది పూర్తిసత్యం కాదు. సముద్రకెరటాల హోరు ఏకాంతాన్ని భగ్నంచేస్తుంది. ఏకాంత స్థలంలో యేచిన్నధ్వనో, వొంటిది కావటం నుంచి, ఆనందంలోకి జారిపోయిన మనస్సును పురిగొల్పి వెనక్కు మళ్లిస్తుంది. నిజానికి, పట్నవాసంలో వున్నవాళ్లే, ఆ జనసమూహంలో, తమ వ్యక్తిత్వాన్ని గోల్పోతూ వుంటారు. ఆపట్నవాసపు రొదలో తాము యెవరైందీ, యేంచేస్తోన్నదీ మరిచి, చెదిగిపోయిన వ్యక్తిత్వాన్ని తిరిగీ స్థాపించుకోటానికి మధ్యలో యేపల్లెటూరో పారిపోతూ వుంటారు. ఏకాంతానికీ, మానసిక వాతావరణానికీ సంబంధం వున్నా, సదా లోకం చేసే రొదకుకూడా మానవుడి వ్యక్తిత్వం మీద కొంత అధికారంవుంది.

రోగికి మందివ్వడానికి పట్నం వొదిలి పల్లెటూరు రావడం డాక్టరు దినకర్‌కు అదే మొదటిసారి. తెనుగుదేశం వొదిలి చెన్నపట్నంలో స్థిరపడిపోయి, ఆంధ్రులతో తాము ఆంధ్రుల మనీ, అరవలతో అరవల మనీ చెప్పుకుంటూ వుద్యోగాలు చేస్తున్న వ్యక్తులలో దినకర్ వొకడు. అతనికి పాతికేళ్లకు పైమాటే. నాగరికతను వొక మహాశక్తిలాగ ఆరాధిస్తాడు. స్త్రీ సంపర్కంవల్ల పురుషుడు సంపాదించిన జబ్బు లనే బంధనాలనుండి విముక్తుణ్ణి చేసింది నాగరిక తేనని అతడు చాలామార్లు వాదించాడు. మన సంఘం అలాంటి వ్యక్తుల్ని హరిజనులలాగ బహిష్కరిస్తుందనీ, వాళ్లను నాగరికులు చేరదీసి, వారి బాధకు సానుభూతి చూపి, బైటపడే మార్గం చూపిస్తారనీ అతని వృత్తికి సంబంధించిన వాదన. మనిషికి యేజబ్బుప్రాప్తించినా, నైతిక విమర్శకుమాత్రం గురి కాదు. అన్నిజబ్బులూ మారణానికే దారితీస్తాయి. ఆవ్యక్తిని రక్షించటం సంఘం విధి. ఇది తెలియనివాడు అనాగరికుడు. ఇట్లాంటివెన్నో దినకర్ మనసులో ఆలోచించుకుంటూ వుంటాడు. నాగరికతమీద వొక గ్రంథంకూడా వ్రాయాలని సంకల్పించాడు. దినకర్ బ్రహ్మచారి. అనేక భావాలు మనస్సులో ప్రాకులాడుతున్నా, యథార్థం తేల్తేనేకాని అవి ఆతుకోవు. లేకపోతే ప్రతిమానవుడూ అధమం వొక్క పుస్తకమేనా రచించి మరీ ప్రాణాలు వొదుల్ను. అత నింకా యెందుకు పెండ్లి చేసుకోలేదో అతనికే తెలియదు. "నీకూ యెవ్వారు లేరు, నాకూ యెవ్వారు లేరు" అన్న పాటలోలాగా యెవ్వరూ 'నా' అనేవాళ్లు లేని పిల్ల దొరికితే చేసుకోవాలని అతని ఆశయం. పెద్ద కుటుంబంలోని పిల్లను చేసుకుంటే చాలా బాధలు

వున్నాయని పట్నంహోరులో తన వ్యక్తిత్వాన్ని గోల్పోతూ, అనుకున్న గ్రంథాన్ని వ్రాయలేకపోతున్న దినకర్‌కు స్ఫురించటంలో ఆశ్చర్యంలేదు.

పల్లెటూరంటే అల్లా వుంటుందని అత ననుకోలేదు. అప్పుడక్కడ తిరణాల్లుకూడా జరుగుతున్నాయి. తన వ్యక్తికి అక్కడొచ్చిన ప్రధానత యిదివరకెప్పుడూ రాలేదు. సందుల్లో నడుస్తుంటే, జనం తొలిగిపోయి, అతనికి మార్గం చేస్తున్నారు. అందరూ అతనికేసి వొక వింతవస్తువులా చూస్తున్నారు.

ఆ గుంపుల్లో వున్న పురుషుల్లో చొక్కా వున్న వాళ్లు తక్కువ. చాలామంది స్త్రీలకు అసలు రవికలే లేవు. స్త్రీవేషధారణలో పమిటకున్న ప్రాధాన్యత వాళ్లకు తోచినట్టే లేదు. అసలు వాళ్లకు స్త్రీపురుష వివక్షతే వున్నట్టు తోచదు. అమాంతం వాళ్ల గుడిసెల్లో జొరబడి సోదాచేస్తే, వాళ్లు దాచుకునే వస్తువులు యేమిటా అని అతను ఆలోచించడం మొదలెట్టాడు. వాళ్లకు గుట్టు, రహస్యం, మనస్పర్థలు వుంటాయా? ప్రకృతి, ప్రేమ, కళలు, నాగరికత సంబంధమైన జబ్బులు,వాటిచికిత్సలు వాళ్లకు తెలుసా? ఆ పల్లెటూరికి పుట్టినట్లుగా వున్నారు వాళ్లు. వాళ్ల శరీరపు సహజమైన సొంపు మూలపడి పాతపడిపోయిన ఆకర్షణశక్తులను రెచ్చగొట్టింది. తన శరీరాన్ని తడిమిచూచుకున్నాడు. మనస్సేకాకుండా శరీరంకూడా మాట్లాడగలదనీ, దేన్నో కోరి దాని కోసం దౌర్జన్యం చెయ్యగలదనీ అప్పుడు గ్రహించుకున్నాడు డాక్టరు. అతనికి రంకులరాట్నం యెక్కి వాళ్లతోపాటు తిరగా లనిపించింది. కాని అంతా నవ్వుతారేమో? ఆ తిరిగేవాళ్లల్లో తాను వైద్యానికొచ్చిన రాఘవరావుగారింట్లో ప్రొద్దున్న చూసిన పిల్లకూడా వుంది. రాఘవరావుగారికి వుపచారం చేస్తో మంచంప్రక్కన నిలబడ్డ పిల్ల అదే. కొంపతీసి దాసీపిల్ల కాదుకదా. ఆ బట్టలు, ఆ వేషం, ఆ వెఱ్ఱి చూపులు బీదతనాన్ని సూచిస్తున్నాయి. కాని రాఘవరావుగారు యీపిల్లను "మా కాంతం, మా కాంతం" అంటూ వొచ్చారే? వివాహమైన పిల్లే ఐతే, యిట్లా వాళ్లతోపాటు కలిసి రంకులరాట్నం యెక్కుతుందా? వెధవపేరు—రంకులరాట్నంట!

దగ్గరగా వెళ్లి నిలబడ్డాడు. గుఱ్ఱాలు వేగంగా తిరగడంవల్ల కాంతం అతన్ని చూస్తూవుందన్న సంగతి తెలియదు. గుఱ్ఱాలు నిలిచాయి. ఇంకా దిగదేం? కాంతంగుఱ్ఱం తనముందే ఆగింది.

"ఇట్లా తిరగటానికి రేటు యెంత?" అని అడిగాడు.

"కానీకి ఆరుసార్లు" అంది కాంతం.

"అబ్బా... నీపేరు?"

"కాంతమ్మ."

"ఐతే నీకు, మరి..." అంటూ దిక్కులు చూశాడు డాక్టరు. ఇంతలో గుఱ్ఱం కదిలింది. ఆయాసపడ్డంవల్ల కాబోలు, కాంతం శరీరపువాసన, గుఱ్ఱం తనప్రక్కకు వచ్చినప్పుడల్లా, దినకర్‌కు తగిలింది. కాంతంతో మాట్లాడిన కాసేపు అతన్ని ఆకర్షించే లక్షణా లేవీ ఆమెలో కనిపించలేదు. కాని ఆ శరీరపువాసన అతని ఇంద్రియాలపై కొంత అధికారం చెలాయించింది. "నీకు పెళ్లయిందా?" అని అడిగాడు.

"ఏమిటండీ?" అంది బిగ్గరగా, స్వారీ చేస్తూ.

"పెళ్లి, పెళ్లి."

"పెళ్లి?"

"అయిందా?"

"ఆ."

మళ్లా గుఱ్ఱం జోరు తగ్గి ఆగడం మొదలెట్టింది.

"అవుతే, నీభర్త యేమీ అనడూ?"

"భర్తేమిటి?" అంది ఆశ్చర్యంగా నవ్వుతూ.

"మొగుడు."

"మొగు డెవరికి?" అంది ఆయాసం మధ్య.

"పెళ్లయిందన్నావ్, మరి?"

"ఎప్పుడూ?"

"ఇందాకా."

"ఊరికేనే" అంది.

దినకర్‌కు యిందులో కొంతం హాస్యప్రశక్తి కనిపించింది. కాని పొరబడ్డాడు. అది అమాయకపు సమాధానం. నిజానికి, అతడు వేసిన ప్రశ్న ఆమెకు వినిపించలేదు. అత నేదో అడగబోయాడు. తటాలున గుఱ్ఱంమీంచి దూకి, పరుగెత్తుకు పోయింది.

## ౨

ఒక్కరోజనుకున్నదల్లా దినకర్ వొచ్చి అప్పుడే నాలుగు రోజులైంది. ఆలోచిస్తే అన్నిరోజు లక్కడుండేందుకు బలమైన కారణాలు కనిపించ లేదు అతనికి. రాఘవరావు తనకు బంధువు కాదు. ఆయనకూ, తన తండ్రికి స్నేహంట, యెప్పుడో. "మావాడు డాక్టరు ప్యాసై వొస్తాడు. మన మింక డాక్టర్లకోసం ఆవూరూ యీవూరూ పరుగెత్త నక్కర్లేదు లెండి" అనేవాట్ట రాఘవరావుతో. ఆయన దినకర్‌ను చిన్నతనంలో చూశాట్ట. మళ్లా యిదే చూట్టం. రాఘవరావు చాలా ఆస్తిపరుడు. బి.ఏ. తో చదువు చాలించి, ఆరోగ్యంకోసం చాలారోజులు భార్యతో బెంగుళూరు, ఊటీలలో గడుపుతూ, యీనాటికి భూములు చూసుకుంటూ, యీ పల్లెటూళ్లో కాపర ముండిపొయ్యాడు. ఇంతకాలం బస్తీలలో కాలం గడుపుతూ డబ్బుతగలెయ్యడానికి కారణం కొంతవరకు ఆయనభార్య కమల. అప్పటికి ఆవిడకు పాతికేళ్లు వుంటాయి. బాగా ఇంగ్లీషు చదువుకున్నది; పట్నాలలో స్త్రీల క్లబ్బుల్లో చేరి, చాలా చెలాకీగా పనిచేస్తూ, స్త్రీసంఘాల్లో చాలావాటిల్లో పాల్గొని కొంతకీర్తి సంపాదించింది. కమల అనాకారిది కాకపోయినా, చూడగానే రూపసి అనేటంతటి చక్కంది మాత్రం కాదు. పెండ్లికిపూర్వం స్త్రీని అందరూ చక్కందే అంటారు. పెండ్లైనప్పటినుంచీ తను చక్కంది అన్న నమ్మకం బైల్దేరి, కొంతబాధ కలగచేస్తూవుంటుంది స్త్రీకి. కమలకు యీనమ్మకం చాలా అశాంతిని కలగచేస్తుంది. కొంతం తన పెత్తల్లికూతురు. తనకంటె చాలా చక్కందని ఆమె తెలుసుకుంది. కొంతానికి యింకా వివాహం కాకపోవడం, తను చక్కందని కొంతానికి తెలియదని తను తెలుసుకోవడం కమలహృదయంలోని ఆరాటానికి సైకలాజికల్ కారణా లనొచ్చు.

అతన్ని పట్నంనుంచి రప్పించడం కొంత ఆశ్చర్యం కలగచెయ్యకపోలేదు దినకర్‌కు. అతనికి వెళ్లిపోవాలని వున్నా యీ పల్లెటూరిజీవితం వొదిలి వెళ్లడానికి మనస్సు యెగిరి గంతువేసింది కాదు. అక్కడి ప్రకృతిలో వున్న ప్రశాంతమే కాకుండా, కొంతంకళ్లల్లో చాలా ప్రశాంతం కనిపించింది అతనికి. సంభాషణవల్ల కొంతానికి ఆయింట్లో ప్రాముఖ్యత లేదని తెలుసుకున్నాడు. ఆపిల్లకు పదహారేళ్లు వొచ్చినా, తనకు పెండ్లి కాలేదని తెలుసుకుని కూడా, రాఘవరావు కాని, అతని భార్య కాని కొంతంపెండ్లి సంగతి ముచ్చటించకపోవడం అతనికి కష్టం కలగచేసింది. ఒకవేళ కొంతానికి భర్త యిదివరకే యేర్పడి వున్నాడా? లేక కొంపతీసి కన్యాశుల్కంలో బుచ్చమ్మలాగా 'ప్రెటీ లిటిల్ విడో' కాదుకదా! మొత్తం మీద ఆరాత్రి వెళ్లడానికి నిశ్చయం చేసుకున్నాడు. సాయంత్రం నాలుగైంది. కమల తలకు పట్టేసుకుని పరుంది. తన చెయ్యి చూడమంది. నాడి పరీక్ష అయింతరవాత—

"మీనాడి బాగానే వుందే?"

"ఎందుకో చాలా తలనొప్పిగా వుందండీ; నా హార్ట్ పరీక్ష చెయ్యండి..." భర్త ఆరోగ్యాన్ని గురించిన బెంగవల్ల యీమెకు యీ అస్వస్థత కలిగిందేమోనని దినకర్ అనుమానపడ్డాడు. కాని రాఘవరావు ఆరోగ్యానికి ప్రమాదం లేదే? గుండెలు పరీక్షచేశాడు. ఆత్రతతో గుండెలు దడదడ కొట్టుకొంటున్నవి, నిజమే. కాని డాక్టరుకు శరీరానికి సంబంధించిన కారణమేదీ స్ఫురించలేదు. తనకు అర్థంకాని జబ్బులు యెందుకుండకూడదూ?

ఆరాత్రికూడా అతని ప్రయాణం ఆగిపోయింది, నిద్రపోయేముందు తియ్యని భావా లుండాలని పిల్లల పుస్తకాలలో వున్నా, అవి ఫలానా అని యెవ్వరికీ తెలీదు. డాక్టరుకు తను చూసిన హాస్పిటల్ దృశ్యాలు

స్మరణకొస్తాయి. దినకర్‌కు స్త్రీలంటే అమితభయం. వాళ్ల జబ్బులు చాలా చిత్రమైనవి. హిస్టీరియా మరీ విచిత్రమైంది. ఆ మూలుగుతూ కృశించిన స్త్రీశరీరం అతని వూహపై ఒత్తిడికలిగించి, యీలోకంలో మానవుడు జనించడం చాలా విచారకరమైన దన్నది అతని తియ్యనిభావం. పురుషులకు వుద్యోగాలు లేక, ఉద్యోగం దొరికేంతర్వాత, సంపాదించే ద్రవ్యమంతా భార్య జబ్బుకోసం ఖర్చుకావడం, చివరికి మూలగడం, హిస్టీరియా, పూర్తి ఉన్మాదం, మరణం—యిదీ మన బ్రతుకు. ఈ మూలిగే లోకాన్ని వుద్ధరించగలిగింది ప్రేమ, శృంగారం అని అంతా చెప్పుకుంటూరు. కాని యీభ్రాంతికి ఆయుస్సు తక్కువ. సౌందర్యం తన మెరిసిపోయ్యే నేత్రాలను నిలబెట్టుకోలేదు; యౌవనం కృశించి, నీరసించి అస్థిపంజరం అవుతుంది. వృద్ధాప్యంలో నశించేవరకూ తెల్లవెంద్రుకలు రాలడం మానవు. ఈభావాలు తియ్యనివి కావు. బ్రహ్మచారైన డాక్టరుకు యివే తియ్యని భావాలు. మానవుడు తన భుక్తికోసం నిర్మించుకున్న లోకాన్నే ఊహలోనికి దింపుకుని, దాన్లోంచి బైటపడలేడు.

దోమలు పీకడం మొదలెట్టాయి అతన్ని. ఒకటి ముక్కుమీదవాలింది. గట్టిగా ముక్కునుపట్టుకు లాగాడు; ముక్కు వూడిరాదుగాని, లేకపోతే వూడాలిసిందే—దోమ చిక్కదు. ఊహాప్రపంచంలోనుంచి బాహ్యానికి దింపగలిగిన శక్తి రాత్రిపూట దోమకే వుంది. మరి మార్గం లేదు. కిందకు నడిచినా, పైకి నడిచినా, మానవుడు కుంటుతూ నడవాలిసిందే.

గడియారం వొకటి కొట్టింది కొంతసేపటికింద, మళ్లీ వొక గంటే కొట్టింది. అప్పుడే ఒంటిగంట దాటిందా! దినకర్ లేచి గడియారం చూశాడు. తీరాచేసి పదిన్నర కొట్టింది. అప్పుడు గడియారం అరగంటలుమాత్రం కొట్టి వూరుకుంటుంది. కమల మైమరచి నిద్రపోతోంది. రాఘవరావు దోమలతో చేసే యుద్ధంతాలూకు శబ్దాలు వినిపిస్తున్నాయి. మెల్లగా దొడ్డితలుపు తీసి నూతివద్దకు వెళ్లాడు. జామచెట్టుకింద చాపమీద కూర్చుని, చంద్రుడికేసి చూస్తూ, జామపండు తింటూంది కాంతం. తెల్లటిచీర, తెల్లటి రవిక, తెల్లటి చంద్రుడు— పట్నంలో యింత ప్రశాంతంగా ఆకాశంకేసి చూస్తూ కూర్చునే స్త్రీలు వున్నారా? అసలు చెన్నపట్నంలో జామచెట్లున్నాయా? కాంతం కంగారుపడి లేవబోయింది. తనకు నిద్రపట్టలేదనీ, అసలు ఆమెతో మాట్లాడడానికి వొచ్చాననీ చెప్పి, యెట్లాగో బతిమాలి కూర్చోపెట్టాడు.

"ఇల్లా వొంటిగా కూర్చున్నావేం?" అని అడిగాడు.

"ఏమీ లేదండి" అంది జామపండు కొరుకుతూ. అది తింటూ, తనకు కావాలా అని అడగకుండా కూర్చోడం అతనికి కష్టంగా తోచింది.

"జామపండేనా అది — ఎక్కడిది?"

"ఇదిగో చెట్టు. వొక్కటే వుంది." ఈసమాధానం అతన్ని స్తిమితపరిచింది.

"పండా, కాయా?"

"మధ్యరకం."

"అవుతే, కాంతం! నీ సంగతంతా రాఘవరావుగార్ని అడిగి తెలుసుకున్నా. నీకు తల్లిదండ్రులు లేరుటగా, పాపం. మరి నీ పెళ్లిమాట యేమన్నా ఆలోచించారా?"

"ఏమో నాకు తెలీదండి."

"మరి నీకు తెలీకపోతే యెల్లా? నాకు నిన్ను చూస్తే జాలిగా వుంది. ఇక్కడ నువ్వు దాసీదానిలాగా వున్నావు. దానికేం-నీకు పెండ్లిచేసుకోవాలని వుందా?"

"నాకు తెలీదండి."

"పోనీ, నామీద నీకు యిష్టం వుందా? నాకూ పెండ్లి కాలేదు."

దీనికి సమాధానం లేదు.

"నీకు యిష్టం వుంటే, మన పెండ్లికి యే అభ్యంతరం లేదు."

"మా అక్కనూ, బావనూ అడగాలండి."

"నీయిష్టానికి వాళ్లు నడిగే దేమిటి? నువ్వు 'ఊఁ' అంటే, యెల్లాగైనా సరే పెండ్లిచేసుకుపోతీరతా. అసలు, వాళ్లు నువ్వు యిక్కడనుంచి పోతేనే చాలునని వుంటారని నా నమ్మకం."

ఒకవిధంగా యీ నమ్మకం సరైంది కాదు. కాంతానికి పాతికేళ్లకరాలదాకా వున్నా రాఘవరావు ఆపిల్లకు చదువు, సంగీతం అనేవి లేకుండా, కేవలం వుపచారంనిమిత్తం వుంచుకున్నాడు. ఆయనకు కాని, ఆయన పెండ్లానికికాని కాంతం పెండ్లివిషయమే జ్ఞాపకం లేకపోవడం విచారించవలసిన విషయం. ఈ సంగతి కాంతానికేనా తోచినట్లు తోచదు. ఆమె సంభావణలో అసంతృప్తిభావన కనిపించదు. తను భార్యకావడానికే యీ లోకంలో స్త్రీగా జనించిందని కాంతానికి తెలియదా? పదహారేళ్లొచ్చిన పిల్లకు కోర్కెలూ, ప్రేమా వుండవూ? కాంతానికి యుక్తవయస్సొచ్చినా హృదయం, మనసు, కోర్కెలు బాల్యంలోనేవున్నాయి. ఈ బాల్యానికి సంబంధించిన చిహ్నాలు శరీరంలోకూడా కనిపిస్తాయి. ఆకళ్లతో మనకేసి చూస్తున్నా మనం కనిపించమేమో అన్న అనుమానం కలగచేస్తుంది. మాట్లాడేటప్పుడు, విషయం యెల్లాంటిదైనా, పెదవుల కదలిక నవ్వులు దాచినట్లుంటుంది. ఆచెక్కిళ్లలోని సాఫీ, సంతుష్టీ హృదయాన్ని సూచిస్తాయి.

"నువ్వు సమాధానం చెప్పకపోతే నాకు దిగులుగా వుంటుంది. ఇష్టం లేకపోతే లేదని చెప్పు. నే నేమీ అనుకోను." అని మళ్లా మొదలెట్టాడు డాక్టరు.

"ఏమోనండి... నే వెళ్లి పడుకుంటాను..." అని లేవబోయింది. డాక్టరుకు కోపం వచ్చింది. కథలలో నాయికలు వసపోసిన పిట్టలలాగా అల్లా వాగుతారే, యీపిల్ల ప్రశ్నకు సమాధానమేనా చెప్పలేదే? కాంతం పల్లెటూరి పిల్ల. అతనికి యీపట్న వాసపుస్త్రీలను చూసింతర్వాత, శరీరంలేని హృదయం కలవాళ్లైతే, వివాహానికి అర్హాలు స్త్రీలు అనిపించేది. ఇప్పుడు కాంతం అల్లాంటి శరీరంలేని హృదయం. శరీరం లేదు, వాక్కుకూడా లేదు. ఇట్లాంటిది దినకర్ ఆదర్శమైనా యీవస్తువుకు లోపల 'ప్రేమ' అనేది వుంటుందా అని అనుమానం తట్టింది. నిప్పంటేకదా పొగ రావడం? అందుకనే, యిట్లా పదేపదే ప్రశ్నించడానికి కారణం.

"నేను నీకోసమే యీవూళ్లో యిన్నిరోజులాగాను. నువ్వు పడే అవస్థ చూస్తే జాలిగా వుంది. నీకు నామీద యిష్టం లేకపోతే, నేను బెంగతో రేపు యింటికి వెళ్లిపోతాను."

"అల్లాగైతే, మా అక్క నడిగి రేపు చెపుతాలెండి" అంది.

"ఛా, ఛా — నీప్రేమకు మీ అక్కను అడగడం యేమిటి?"

"పోనీ, యీసారొచ్చినప్పుడు."

"అల్లాకాదు" అని చేతులు పట్టుకోబోతాడు.

"అబ్బ! — పోనీ, మీరెళ్లింతరవాత ఉత్తరం రాస్తా లెండి..." అతన్ని తప్పించుకు పారిపోయింది. కాని, దొడ్లో వస్తువులు యింట్లో పెట్టడానికి మళ్లా వచ్చింది.

"నన్ను పట్టుకోకండి, నాకు భయంగావుంది."

"ఎందుకు భయం? ఇదేం తప్పుపనికాదు, — రంకులరాట్నం యెక్కడం కంటేనా..." అన్నాడు. మళ్లీ, తన సొంతపెండ్లాంవలె అల్లా అన్నందుకు నాలిక కొరుక్కున్నాడు దినకర్.

"వద్దు — నే ఉత్తరం రాస్తా నన్నానుగా."

"అడ్రెస్ తెలుసా?"

"ఓ, — యీసారి మళ్లా మా బావజబ్బుకు వస్తారుగా..."

"మళ్లీ మీ బావ జబ్బేమిటి?"

"మా బావకు జబ్బు ఆరేళ్లనుంచి — మీకు తెలీదూ?...నన్ను పోనీండి లోనికి..."

తన గదికి వెళ్లిపొయ్యాడు డాక్టరు.

## 3

దినకర్ పట్నం వెళ్లి నెల దాటిపోయింది. ఆదినం రాఘవరావు వూళ్లో లేడు. కాంతం బైటుంది.

కమలకు కవరు అందజేశాడు పోస్టుబంట్రోతు. పైన 'కాంతమ్మ'కు అని వ్రాసుంది.

"నీకు కవరొచ్చింది. చింపి చదవనా?" అని అడిగింది కమల. కాంతానికి కవరురావడం ఆశ్చర్యం కలగజేసినా, అది దినకర్ దగ్గరనుండే అయివుంటుందని తెలుసు. కమల ఉత్తరం పైకి చదివింది.

ప్రియమైన కాంతానికి,

ఆరాత్రి నే అడిగినదానికి సమాధానం వ్రాస్తానని వాగ్దానం చేశావు. మళ్లా జవాబు వ్రాయలేదు. ప్రతిదినం నీ ఉత్తరం కోసం యెదురుచూస్తున్నా. ఎందుకువ్రాయలేదో తెలియదు. ఒకవేళ నీకు యిష్టం లేకపోయినా, ఆసంగతి ఉత్తరంద్వారా తెలియజెయ్యడం సులభమైవుండికూడా, నువ్వు నాకు తెలియజెయ్యలేదంటే, నాకు ఆశ కలుగుతూంది. వెన్నెట్లో ఆనాటిదృశ్యం ప్రేమపూరితమైంది. నువ్వు కాదనలేవని నీ చిరునవ్వే చెప్పింది. వ్యక్తులు దగ్గరగా కలిసివున్నప్పటికంటె విడిపోయి దూరంగా వెళ్లినప్పుడే మనస్సులు దగ్గరగా వొస్తాయి. శరీరం, సంభాషణ, దుస్తులు, పరిస్థితులు, కాలం—యివన్నీ హృదయాల కలయికకు అంతరాయాలే. మూగమనస్సు ఏకాంతంలో పండి ముగ్గిపోతుంది. నాకిక్కడ అల్లాంటి ఏకాంతం లేదు. నీవద్దనుండి వొచ్చిన ఉత్తరంలో యేమీ లేక, పుత్తి తెల్లకాగితమైనా, అది నాకు ప్రశాంతం యివ్వగలదని నమ్మి. నాఅడ్రెసు మళ్లా వ్రాస్తున్నా. మీ అక్కయ్యను అడిగానని చెప్పు. మన ఉత్తర ప్రత్యుత్తరాలకు అక్కడ ఆటంకం లేదని నా నమ్మకం. మీ అక్కకు తెలిసినా, ఆవిడ దీన్ని అర్థంచేసుకుంటుందని నానమ్మకం. మీ అక్కకు నే పంపిన టానిక్కులు పని చేస్తున్నాయని తలుస్తా. ఉత్తరం అంతా 'జవాబు వ్రాయి' అని పదిసార్లు వ్రాయడం కంటే అది వ్రాయకపోతేనే నీవద్దనుండి సమాధానం వొస్తుందని, యేదో పెద్ద ఆశ నామనస్సును సంతోషకెరటాలతో నింపుతోంది.

మొదట్లో బిగ్గరగా చదవడం మొదలుపెట్టి, పోను పోను కమల కంఠం సన్నగిల్లి, తన్నుగురించి వ్రాసిన వాక్యాలదగ్గర ఆగిపోయి, ఆవుత్తరం తనకు కాదన్నవిషయం మరిచింది. "ఆవిడ దీన్ని అర్థంచేసుకుంటుంది"—ఇందులో డాక్టరుమనస్సు తనకు దగ్గరగా వొచ్చినట్లు స్ఫురించింది. అతని బాధ తనకు బోధపడుతుందని అతనికి తెలిసింది. ఏదో, ఈవుత్తరంలోని రహస్యం తనకోసమని కమలమనస్సులో వింత భావాలు చెలరేగాయి. ఈఉత్తరం శైలీ, దీని కళానుగుణమైన అర్థాలు కాంతానికి అర్థంచేసుకోడానికీ, ప్రయత్నించడానికీ కూడా అర్హతలేదు. చెప్పరాని అసూయాభావం కమలలో వుదయించింది.

"ఏమే కాంతం, నాకు చెప్పలేదే యీసంగతి?" అంది, దండనాధికారం వున్నదానిమల్లె.

"....................."

"పోనీ, అతను మాతోనైనా యెందుకు చెప్పలేదు?"

"నేను ఆయనతో బావను అడగండని చెప్పా."

"అసలు నిన్నేమని అడిగాడు?"

"పెండ్లి విషయం"

"నువ్వేమన్నావ్ ?"

"చెప్పాగా?"

కమల ఆలోచనలో పడింది.

"అసలిదంతా యెప్పుడు జరిగింది ?"

"ఏదంతా?"

"అదే,—వుత్తరంలో వుందిగా,వెన్నెలరాత్రి,—"

"ఏమీ లేదు. నేను జామకాయ తింటూంటే, ఆయన వచ్చి పెండ్లిమాట ప్రసంగించాడు."

"నువ్వేదో అధికప్రసంగం చెయ్యకపోతే ఆయ నిల్లాంటి ఉత్తరం వ్రాస్తాడా?"

"లే దక్కా! నీతోడు...అట్లాగయితే నే వుత్తరం వ్రాయనూ?"

"సరే, జవాబు వ్రాస్తావా?"

"నీయిష్టం."

"అదేమిటి, మొగుడాయనా, భార్యవు నువ్వు, నాదేముంది?"

"అట్లా అన కక్కా; ఎందు కంతకోపం? నువ్వు వ్రాయొద్దంటే మానేస్తాను."

కమలకు యెందు కింత కోపం వచ్చిందో కాంతానికి తెలియలేదు.

మూడు దినాలు గడిచాయి. మళ్లా పట్నంనుండి ఉత్తరం వచ్చింది. అందులో కొన్ని ముఖ్యమైన భాగాలు "—నాకు కొద్దిరోజులలో గవర్నమెంటు నాకరీ కాబోతోంది. నువ్వు పల్లెటూరిపిల్ల వనీ, బీదదాన వనీ నేను చేసుకో ననుకుంటా వేమో. అల్లా అనుకోవద్దు. నిజానికి నీలాంటిదానికోసమే యిన్నాళ్లు కాచుకునివున్నా. నన్ను నిరాకరిస్తే లోకంలో 'దయ' అనేది లేదేమో అనుకోవాలి. లేక మీకమలా, మీ బావా యిష్టపడలేదా? అసలు వాళ్లు యీవార్త విని సంతోషించారే? అందులో మీకమల యెంతో చమత్కారంగా ఈ పెళ్లికి అనుకూలపడుతుం దని నాగట్టినమ్మకం...పోనీ, యేవిషయం అయినా జవాబు వ్రాయరాదూ? నీ కిష్టమైతే మీ బావకు వ్రాస్తాను..."

ఇందులో తన్నుగురించిన వాక్యాలను పైకి చదివి వినిపించలేదు కమల. అది కాంతానికి సంబో ధింపబడ్డాయన్న విషయం కమలకు బాధాకరమైంది. డాక్టరు తన చెయ్యి పరీక్షచేసినప్పుడు తనగుండె లెందు కల్లా కొట్టుకున్నాయి? ఆచేతితాలూకు వేడి తన అరచేతిలో దాగివుంది. కాంతాన్ని "జవాబురాస్తే రాసుకో" అంది యీసడింపుతో.

కాంతానికి తెలుగువ్రాతలో ప్రవేశం తక్కువ. తెనుగు వచ్చినా, యెప్పుడూ కాగితంమీద, చాకలి పద్దు, సంతబిల్లు తప్ప కలంపెట్టిన అభ్యాసం లేదు. తను వ్రాస్తే సకలతప్పులూ వొస్తాయనీ, తన తెలివి తక్కువతనానికి దినకర్ ఆశ్చర్యపడతా డనీ కాంతా నికి జవాబువ్రాయడం భయం.

"పోనీ, నాబదులు నువ్వు వ్రాయకూడ దక్కా"

"అల్లా బాగుండదు. నువ్వే రాయి."

"నే రాస్తే తప్పులొస్తాయి."

"తప్పులొస్తే పెండ్లిచేసుకోడని భయమా?"

"కాదక్కా, నేను చదువుకున్నదాన్ని కాదుగా నీలాగా. పోనీ, నే చెప్పినట్టుగా రాయకూడదూ?"

"ఏమని రాయమంటావు?"

"ఏదో నీయిష్టమొచ్చింది రాయి."

ఇద్దరూ చేరి వ్రాసిన జవా బిది:

డాక్టరుగారికి —

మీకు జవాబు యింత ఆలస్యంగా వ్రాసినందుకు యేమీ అనుకోకండి. మా బావా, కమలా ఏమీ అనలేదు. వాళ్లకీ సంగతే తెలియదు. మీ రనుకున్నట్లు నేను పల్లెటూరిపిల్లనన్న భయంవల్ల వ్రాయలేదు. మీప్రశ్నకు జవాబు నాకు తెలియదు. పెండ్లికీ నాయిష్టానికీ సంబంధం కనిపించదు. మా కమలఆరోగ్యం బాగానే వుంది. బిల్లు కొద్ది రోజుల్లో పంపుతాము...

కాంతానికి తెలియకుండా మరికొన్ని వాక్యాలు చేర్చింది కమల యీ వుత్తరంలో—

మీరు నన్నిల్లా ఆరాధిస్తా రని అను కోలేదు. నాహృదయంలోనూ ప్రేమజ్యోతి వుంది. కాని మీ వుత్తరంతో అది వెలిగి

ప్రకాశిస్తోంది. నాకు యేదో ఆశ వుంది—దాని కేపేరు పెడతారో మీయిష్టం.ముద్దుకు పెదవులులేవు. లేఖే పదివేల ముద్దులు.

ఇల్లా వ్రాసి, యీచివరి రెండువాక్యాలూ, అక్షరాలు కనపడేటట్టుగా గీతలుగీచి కొట్టేసింది కమల.

ఈ ఉత్తరానికి జవాబు వారంరోజులకే వచ్చింది. కాని వీటిని చదివే భాగ్యం కాంతానికి లేదు. చదవడం, జవాబువ్రాయడం కమలకే వొదిలేసింది. కమలకు తనమీద పెద్ద అనురాగమని కాంతానికి గట్టినమ్మకం. ఉత్తరంలో కొన్నే వాక్యాలు చదవడమో, లేకపోతే లోపల చదివి సారాంశం చెప్పడమో, చివరికి చించెయ్యడం—అదీ ఆవుత్తరాల ఖర్మ.

ఈమూడో ఉత్తరంలో కొన్నివాక్యాలు—

...నీవుత్తరం యెంతో సంతోషంతో చదివాను. మొదటి వాక్యాలు చదువుతూంటే నిరుత్సాహం బైలుదేరినా కడపటి వాక్యాలు చదవగానే, మళ్లా నా ఆశాలత పుష్పించింది. మానవహృదయానికి వైశాల్య నిర్ణయం లేదు. పల్లెటూరైనా, ప్రేమకు రెక్కలున్నాయి. అదిగాక, నువ్వు చదువుకోనిదాని వంటే నేను నమ్మను. సిగ్గువల్ల అబద్ధం ఆడివుండొచ్చు. నిండుకుండలు తొణకవు. నీలో పెద్దలోతు లేకపోతే అంత చమత్కారంగా వ్రాసివుండవు. నువ్వు రోజూ యిల్లాంటి వాక్యాలు నాకు పంపుతూంటే, నాకు పెండ్లినిగురించి ఆదుర్దా వుండదు. స్త్రీహృదయం గొప్పది. తన సర్వస్వమూ త్యాగంచేసి, లోకాన్ని వశంచేసుకోగలదు. ఇది • తెలియందీ, యెంత చదువుకున్నా ప్రయోజనం లేదు...

కాంతానికి యీవుత్తరం ఆశ్చర్యం కలగచేసింది. కొన్నిసంగతులు అసలు అర్థమే కాలేదు.

"కడపటివాక్యా లని వ్రాస్తాడు—అవి జ్ఞాపకం వున్నాయా నీకు?" అని అడిగింది కమల.

"ఏముంది? మందులకు బిల్లుపంపుతా మన్నాం, అంతేగా ?"

"చూశావా,యెంతర్థం తీశాడో..."

"చదువుకున్నదానవ్ నీకు తెలియాలి, ఆ అర్థాలూ—ఆగొడవంతా యేమిటి?"

"ఏముంది—పెండ్లిమాట..."

"ఇంకా తేల్లేదని నాలుగుముక్కలు రాసి పెడుదూ."

అల్లాగే, నాలుగునెల్లలో పది ఉత్తరాలు వ్రాసింది కమల; పదిహేను జవాబులు చదువుకుంది. ఈలేఖల్లో వ్యవహారాలు యేవీ లేవు. అంతా ప్రేమ, కలలు, ఆత్మలకలయిక, సమానత్వం, స్నేహం, జీవితంలో సౌందర్య ఆదర్శాలు—యిల్లాంటి సంగతులు చమత్కారమైన శైలిలో వ్రాయబడి వున్నాయి. కమల ప్రతి ఉత్తరంలోనూ కాంతం వ్రాసినట్లు వ్రాసినా, దినకర్ మనస్సుకు దగ్గరగా ప్రయాణం చేసింది. అతని వాక్యా లన్నీ తను వ్రాసినవాటికి జవాబులు. ఆమె హృదయంతో పిలిచింది, అతను పలికాడు. ఆపలుకులో ఆత్రత, తొందర, మాధుర్యం తన పిలుపుమీద ఆధారపడినవి. కాంతం అన్న పేరు వెనక దాక్కుని, దినకర్ వ్యక్తిని తనవశం చేసుకుంది. శరీరంతప్ప అతడు జీవితపు ఆశంతా రహస్యంలేకుండా కమలకు అర్పించుకున్నాడు. పురుషుడి ప్రధానమైన ఆనందాన్ని దాచుకున్న భవనాల తాళపు చెవులన్నీ కమల కిచ్చి, అతనిసంతోషంలో భూమి వొదిలి, మేఘాలలోకి నడిచాడు.

ఏడో వుత్తరంలో తనకు ఇంగ్లీషుకూడా వొచ్చునని తెల్పేందుకు, కొంతభాగం ఇంగ్లీషులోనే వ్రాసింది కమల. దానికి జవాబు ఇంగ్లీషులోనే వొచ్చింది. దాని అనువాదం—

స్వప్నకాంత కాంతానికి—

నాజీవితంలో రెండే చరిత్రాత్మకమైన సంగతులు జరిగాయి. మొదటిది నేను జనించడం; రెండోది నువ్వు ఇంగ్లీషులో వుత్తరం వ్రాయడం. నీశైలిలో సహజమైన పోకడ, నీ ప్రత్యేకమైన వ్యక్తిత్వం గోచరిస్తున్నాయి. వ్యక్తిత్వాన్ని పాటించిన శైలే శైలి. నువ్వు నీ లోకానికి రాణివి. ప్రతివాక్యంలోనూ నీ విగ్రహం మెరిసి నాట్యంచేస్తూంది. ఏదో చప్పుడు వినిపిస్తోంది — అడుగుల చప్పుడో, అధరాల చప్పుడో...నీనాట్యానికి మన ప్రేమ గానం చేస్తుంది.

తరువాతివుత్తరాలలో యీవేగం తగ్గింది. డాక్టరు పెండ్లివిషయం తేల్చమని తప్ప యితర భావాలు వ్రాయడం తగ్గించాడు. చాలా వ్యావహారికంగా వుంది. ౧౯ వుత్తరం......

... మీ బావకు యెప్పుడు వీలవుతుందో కనుక్కొని రాయి. నేను పెండ్లి పనులు సిద్ధంచేస్తాను. నాకు వేరే కావలసిన వాళ్లు యెవ్వరూ లేరు. మా అక్కకు ఏదో మాసంట, దూరప్రయాణం రాలేనని వ్రాస్తోంది. ఎంత ప్రేమయినా, దానికి కొంత ఆకారం కలగచెయ్యకపోతే, పారిపోతుంది. దానికి కొన్నిబంధనాలు తగిలించకపోతే, 'మంచితనం' లాగా, ప్రేమ ఆకారంలేని వస్తు (Abstract noun) వవగలదు.

ఇవన్నీ కమలకు శారీరకంగానూ, మానసికంగా నూకూడా చాలా ఆనందాన్ని కలగజేశాయి. నేటి కాలానికి తన వ్యక్తికి ప్రేమరాజ్యంలో స్థానం యేర్పడింది. స్త్రీకి 'ప్రేమ' యివ్వడంలో వున్న ఆనందం పుచ్చుకోడంలో లేదు. కాంతానికి యీ వుత్తరాల సంగతి తెలియ దన్న విషయం కమలకు బాధ కలిగించలేదు. ఇది తెలిస్తే, తనకు విజయం ప్రాప్తిస్తుంది. శత్రువుపై తన కసి తీరుతుంది. అల్లా కాంతంపై కసితీర్చుకుని దినకర్‌కు దూరమవడంకంటె, వివాహానికి. తోడ్పడి అతని సానుభూతి పొందడం ఒక పెద్దత్యాగం లా తోచింది కమలకు. కమలహృదయంలో యింకా నైతికభవనానికి పునాదులున్నాయి. చాలా సంగతులు దాచింది; కృత్రిమం సల్పింది; 'భర్త' అనే వొక సంస్థకు నామాన్నిమాత్రం మిగిల్చింది; కాని పునాదులను నిర్మూలం చెయ్యలేదు. స్వార్థానికి సంబంధించిన సంతోషం పొందినా, నైతికసంస్థకు కీర్తి నశింపు కాదు. కమల ఆఖరుసారి వ్రాసిన వుత్తరంలో యిల్లా వుంది:

...మీరు స్త్రీలను గురించి కవులు చాలా చెడుగా వ్రాశారనీ, వాటిని మీరు నమ్మరనీ వ్రాశారు. ఈ మీ నమ్మకం శాశ్వతంగా వుంటుందా అని నా అనుమానం. ఒకప్పుడేనా 'మంచిస్త్రీ చెడుగా ప్రవర్తించడం అంటే, చెడ్డదే పట్టుపడటం అన్నమాట' అనకుండా వుంటారా?...

ఈ వాక్యంలో కమల తనహృదయాన్ని యింకా వరివల్లా కానట్టుగా, సత్యంతో శోధించింది.

## ౪

డిసెంబరులో పట్నంలో వివాహం జరిగింది. పెండ్లికి రాఘవరావు, భార్యకూడా వచ్చారు. తరవాత రాఘవరావు వొక్కడూ వెళ్లిపోయి, దంపతుల్ని మనవూరు తీసుకురమ్మని భార్యకు అప్పజెప్పాడు.

ఆరాత్రి దినకర్ యిల్లంతా నిశ్శబ్దంగా వుంది. అతను, కాంతం, కమల తమలపాకులు వేసుకుంటూ, గ్రామఫోన్ పాట్లు వింటూ కూర్చున్నారు.

"కాంతం! మా అక్కకు ఉత్తరం వ్రాస్తానని మరిచిపోయావు. మొన్న చెప్పాను. మళ్లీ మనం రేపు మీవూరు వెళ్లాలి. అప్పుడు హడావుడిగా

వుంటుంది. అంచేత యిప్పుడే వ్రాయి. నీసంగతి మా అక్కయ్యకు వ్రాశాను. నీచేత ఇంగ్లీషులో వుత్తరం వ్రాయించమని చాలాసార్లు కోరింది..."

"ప్రస్తుతం తెలుగులో వ్రాస్తా లెండి..."

"అల్లా కాదు—ఏంలేదు, పెండ్లి బాగా జరిగిందనీ, తను సమయానికి లేకపోవడం మనకు విచారంగా వుందనీ. అంతే, రెండుముక్కలు..."

"అబ్బ, పోనిద్దురూ, నాకు తలనొప్పిగా వుంది."

"పోనీ, నేను చెప్తాను వ్రాయి."

కమల భయంతో వొణికింది. సంభాషణ తప్పించడానికి ప్రయత్నం చేసింది కాని లాభం లేకపోయింది. దినకర్ డ్రాయర్లోంచి కాగితం, కలం తీసుకొచ్చి కాంతాని కిచ్చాడు.

"కానీ, 'డియర్ సరోజ్'..."

కాంతం కలం వొదిలేసింది.

"అబ్బే, సిగ్గుపడతారా... 'మైడియర్ సరోజ్' ...ఊఁ..."

కాంతం పరుగెత్తుకు పోయింది మేడమీదికి. కమల దినకర్ కళ్లల్లోకి దీనంగా చూసింది.

"కాంతానికి ఇంగ్లీషు రాదండీ..."

"వేళాకోళ మాడకండి మీరు కూడా..."

"సత్యం. ఆ ఇంగ్లీషు వుత్తరాలు వ్రాసింది నేనే—కాంతం నన్ను వ్రాయమంది. తమాషాకు నేనే వ్రాశాను..." దినకర్ కొయ్యబారిపొయ్యాడు. మళ్లా మొదలెట్టింది కమల: "అసలా వుత్తరాలన్నీ కాంతం వ్రాసినట్టు నేనే వ్రాశాను. నాకు యితర అభిప్రాయం లేదు కాని, ఆవుత్తరాలు మీకు సంతోషం కలిగిస్తాయని నమ్మి అల్లా వ్రాశాను..."

"అన్యాయం చేశావ్... నా హృదయాన్ని అపహరించింది. నువ్వు...కాంతం అప్పుడూ యిప్పుడూ ప్రేమంటే యేమిటో తెలియని పల్లెటూరి ఘటం. అమాయకపు మృగం..."

"దాన్ని కోప్పడకండి...దాని కివన్నీ తెలియవు కూడా... ఉత్తరంవల్ల హృదయాన్ని వశం చేసుకో వచ్చా, లేక పురుషులకు ఒక శరీరమే ప్రధానమా, చూద్దా మనుకున్నది యథార్థమైంది—మన మనస్సులు కలిశాయి. కాని కాంతానికి పెండ్లి జరిగింది... 'భార్య' అన్నది పేరు..."

"నాకు చిన్నతనంగా వుంది." అన్నాడు దినకర్.

"మీరు పల్లెటూరి పిల్లైనా చేసుకుంటా నని మొదట్లో వాగ్దానం చేశారు." అంది.

"నిజమే. ఈఉత్తరాలవల్ల కొత్త ఆశయాలు లేచి భగ్నమయ్యాయి. బీదవాడికి తృప్తి వుంటుంది, కాని కొంత ధన మిచ్చి, మళ్లీ అది పోతే వాడికి శాంతి వుండదు."

ఆమర్నాడు కమల వొంటిగా వెళ్లిపోయింది. రాత్రి పదకొండు కొట్టింది. రాఘవరావింకా యింటికి రాలేదు. ఏవో గుడిసెలు తగులపడ్డాయంటే చూడడానికి వెళ్లాడు. కమల కాంతానికి వుత్తరం వ్రాసింది. అందులో "...ఏవ్యక్తికైనా లోకంలో నెగ్గాలంటే, కొందరు శత్రువులు అవసరం. మన కల్లాంటి శత్రువులు లేకపోతే మనలో చాలామందికి పేరుప్రతిష్ఠలూ, ఊరు పేర్లూ వుండవు..."

ఇంతలో రాఘవరావు గదిలో కొచ్చాడు. కమల వులిక్కిపడి "ఎవ రది?" అని ఆదుర్దాగా అడిగింది.

"ఇంకెవరు? నీభర్త" అని సమాధానం.



లాక్షణికుల సూత్రములకు సూటిగాపోక భాషావిస్తృతికి తోడుపడిన

# పింగళిసూరన్న : : : : ప్రయోగ విశేషములు

---

శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి

శ్రీనాథాదుల సీసపద్యముల చెలువు, పోతనాదుల శబ్దాలంకారముల పోకడ, శంభుదాసుని ప్రబంధధోరణి మేలుబంతిగా నేరుపఱచుకొని యింపు నింపునటులు స్వతంత్ర కావ్యములు నిర్మించుటలో పింగళి సూరన్న కవిది అందెవేసినచేయి. ఆతని కృతులలో కవితావిశిష్టతను వెలిబుచ్చునది కళాపూర్ణోదయము; రసభంగము ఒనగూర్పని శ్లేషను పోషించుచు వాఙ్మయమునకు వన్నెచిన్నెలు చేకూర్చినది రాఘవ పాండవీయము.

లాక్షణికుల సూత్రములకు సూటిగాపోక భాషావిస్తృతికి తోడుపడిన ప్రయోగ విశేషములు కొన్నింటిని సూరన్న వెలయించినాడు. అందు దిఙ్మాత్రము:

౧

"ప్రౌఢిమహిమభానుకులుఁడు" (రా. పాం.)

ప్రౌఢిమహిమ + భానుకులుఁడు; ప్రౌఢిమ + హిమభానుకులుఁడు (శ్లేష).

'ప్రౌఢిమ'పదము సంస్కృత లాక్షణికుల దృష్టిలో అసాధువు. సూ, "ముగ్ధిమాదిష్విమనిచ్ మృగ్యః - ముగ్ధిమా, ప్రౌఢిమా ఇత్యాదిషు ఇమనిచ్ మృగ్యః అన్వేషణీయ ఇతి." (కావ్యాలంకార సూత్రవృత్తి, అధికరణము ౫,సూత్రము ౫౪) ప్రౌఢియేకాని 'ప్రౌఢిమ' సంస్కృత కావ్యములలో ప్రచుర ప్రచారమున గానరాదు.

అయితే తెలుగున 'ప్రౌఢిమ'ప్రయోగములు అసంఖ్యాకములు.

వాక్ప్రౌఢిమ (నైషధము, ౧-౧౭)
ఖండనప్రౌఢిమాఢ్యాక (నైష. ౪-౧౩౮)
విభ్రమప్రౌఢిమన్ (హరవిలాస. ౫-౫౨)
ఉదార ప్రౌఢిమ దేవదైత్య (హరవి. ౬-౧౪౫)
రాజత్ప్రౌఢిమన్ మీరు (కృష్ణరా. ౨-౧౦౩)
భూరిస్థిరప్రౌఢిమన్ (కృష్ణరా. ౩-౬౬)
విలసత్ప్రౌఢిమగాంచితే (కృష్ణరా. ౪-౨౬)
వాక్ప్రౌఢిమంబు గడలుకొనఁగ (కృష్ణరా. ౪-౫౧)
కూర్చవలెనన్నఁ బ్రౌఢిమకొఱకు (సర్వలక్షణసారసంగ్రహము, ౧-౯)

సంస్కృతముమాట యెటులున్నను తెలుగున ఇందఱు ప్రామాణికులగు కవులు

ప్రయోగించుటంజేసి యీ ప్రయోగమునకు అర్థాంతను ఆరోపించుటయే సమంజసము.

## ౨

"దేవరన్యాయం బొప్పఘటింపు" (రా. పాం.)

దేవరన్ = దేవరవారిని, న్యాయంబు—ఒప్ప; దేవరన్యాయము ఒప్ప (శ్లేష).

రెండవ అర్థమున నకారద్విత్వము అక్కఱలేదు. అయినను సంస్కృతభాష లోని 'అనచి చ' అన్నసూత్రము దీనికి అండగా నుండగలదు. 'అచః పరస్య యరః ద్వేవా స్తో న త్వచి' — అచ్చునకు పరముగా నున్న 'న్యాయము'లోని నకారమునకు ద్విత్వము రావచ్చును. కాని భాష్యకార ప్రభృతులే నిరుపయోగ మని దూరీకరించిన యీసూత్రము శ్లేషకావ్యములపట్ల చింతామణి అయినది.

## ౩

"కలశమంబుమగ్నముగఁ జేయు చప్పుడు" (రా. పాం.)

కలశము + అంబుమగ్నము; కలశమంబు + మగ్నము (శ్లేష).

పదమధ్యమందు పరసవర్ణము నిత్యమని సంస్కృతభాషాసంప్రదాయము. తెలుగున తత్సమములుగ వచ్చునపుడు పరసవర్ణశాస్త్రమునకు వైకల్పికత్వమును చెప్పవచ్చును. 'అమ్బు' శబ్దము బిందుమధ్యముగగూడ నుండ వచ్చునని యీ ప్రయోగము రూఢిచేయుచున్నది. ప్రాచీనాంధ్ర లాక్షణికులు నయితమ ఇట్టిప్రయోగములను అనుమతింపక పోలేదు.

"జ్ఞానవేద్యాయ తప్తకాంచనవిభూషణాయ మేచకవర్ణకంఠప్రియాయ
నగధరాయ నమోస్తు సౌందర్యవిజిత
మనసిజాతాయ గోపడింభాయ యనఁగ."

—అప్పకవీయము

కాంచన — కంఠ — సౌందర్య — డింభ శబ్దములలో అనుస్వారము కల దను అభిప్రాయముతోనే అప్పకవి వానిని బిందు యతికి చూపినాడు. చిన్నయసూరియు 'పఞ్జ్కంఠము' మున్నగు పదములను ఉదాహరించెను.

## ౪

"పావన మానీశ్వర యింతకంటె నియతి" (రా. పాం.)

పావన, మాని + ఈశ్వర, యింతకంటె; పావనమా + ఈశ్వర, యింతకంటె (శ్లేష).

అచ్చు పరముగా నున్నపుడు ఉదంత తద్ధర్మార్థకవిశేషణములకు మాత్రమే నుగాగమమును లాక్షణికులు విధించిరి. 'పావనమా — ఈశ్వర' అన్నపుడు ఉదంతము కాకపోయినను నుగామము వచ్చిన దని చెప్పవలెను. ఔదంత తద్ధర్మార్థకవిశేషణములకుగూడ నుగాగమము వచ్చునని ప్రామాణికములగు నిట్టి ప్రయోగములనుబట్టి తరువాతివారు చేర్చుకొనవలెను.

## ౫

"అనుగులాడ వెరవరులౌ గనికరముతో" (రా. పాం.)

'ఆడ' అనునది గ్రామ్య మని కేతన శాసించెను. "అకడ, ఈకడ యనుచు బలుకుచో ఆడ, ఈడ యనిన వర్ణలోపమగు" అని, ఆడ — ఈడ అన్నవి గ్రామ్యములే యనియు,

అయినను గ్రామ్యములే యనియు కూచి మంచి తిమ్మకవి అభిప్రాయము.

"ఏనేడ నింద్రాదు లేడ" (భారతము, ఆరణ్య. ౨-౪౭)

"కౌరవసేన యేడ యొంటిసనుట యేడ" (భా. విరాట. ౫-౨౩౪)

"కోమలి భూజగ మేడ మూఢ తాళన జగ మేడ" (విజయవిలాసము)

"ఏకుంభోయనుగదా వేశలో మంజిష్ఠ" (కాశీఖండము)

ఇందఱు ప్రామాణిక కవులు మెచ్చు టగా వాడిన ఈపదము గ్రామ్యమని యీ సడింపక మురిశముగా స్వీకరించుటయే లగ్గు.

## ౬

౧. వారణనగరి + పురమునల్లి
౨. నగరిపురము + తల్లి
౩. సముదాలోపారి + ప్రం క్తిరథుండు
౪. గృహమేధి + తద్విశేషమహిమ (రా. సాం.)

ఈ ప్రయోగములు గసడదవాదేశ వైకల్పికత్వమును సూచింపఁజేయుచున్నవి. చిన్న యకుమున్న నన్నయాది సర్వలాక్షణికులును గసడదవాదేశము నిత్య మని అభిప్రాయ పడిరి. కవిత్రయమువారి ప్రయోగము లా యంశమునే బలపఱచును. ఇటీవల చిన్నయ సూరి గసడదవాదేశము నిత్యము కాదనుటకు సూరనకవిప్రయోగములుకూడ ఉపస్కార ముగ నున్నవి.



# సౌందర్యపూజ

శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

అవలఁ ద్రోసితి కాంతాపచయమ్ము నెల్ల - పోవుచుంటిని సౌందర్యపూజకొఱకు
ఏమి లభియింప నున్నదో యెఱుఁగరాదు - అంతరంగంబు పారవశ్యమునఁ దోఁగు.

గద్గదిక దోఁచు పలుకుల, కనులఁదొరఁగు - బాష్పకణముల, భావనాపథముఁబట్టి
పోవు ననుఁ జూచి యున్మాదమూర్తి యనుచు - ఎన్నిసారులు నవ్వివోయినదో జగము!

కన్నులలరించు నెలసోయగమ్ముఁ జూచి - మ్రొక్కులిడుచుంటి నాకరమ్ములను మొగిచి
మంజులం బయి తోఁచు బ్రహ్మాండ మెల్ల - కౌఁగిలింతు నొక్కొక్కమారు గాఢరక్తి.

కొండచరియలలో, చెట్లగుబురులో, మ - నోజ్ఞసైకతభూమిలో నుగ్రతపము
నాచరించుచు నుందు నే నహరహంబు - ఆఁకలియులేదు దప్పియు నాకు లేదు.

సలిపిన ప్రయత్నమెల్ల నిష్ఫలముగాఁగ - మరల యత్నించు పరితాపభరములేని
విమలసౌందర్యపూజకై వెడలుచుంటి - మృదుమధురగీతికారవముదితహృదిని.

పాలకంకులపైన నుయాల లూఁగి - కలకలారావగద్గదగాత్ర మెత్తి
హర్షవశమున ననుఁబిల్చు నల విహంగ - ములు సౌందర్యపూజకు మనసుగొలిపి.

అలరులంబోలుమృదులశయ్యాతలాన - కనులు మోడ్చిన విరహిణీకాంత యార్త
అనవరతమును ననుఁ బిల్చినట్లె తోఁచు - మధురసౌందర్యపూజకు మరులుగొలిపి.

పవనపరిరంభణసుఖమ్ముఁ బడసిపడసి - సోలిపోయెడు వల్లరీబాల యదిగో!
నవ్వుమొగమున రమ్మని నన్నుఁ బిల్చు - నమలసౌందర్యపూజకు నాసగొలిపి.
ఫలము గలుగునో కలుగదో వలదు చింత - శాంతమతినై, వినిర్మల సహజమధుర
లలిత సౌందర్యపూజకై రక్తిఁ బూని - కదలిపోయెద నవ్యమార్గములయందు.

దివ్యశంపాలతలు నాకుఁ దెరువు సూప - తోయదగభీరఘోషముల్ తోడుపడఁగ
నవ్యపథముల భూనభోంతరము దాఁటి - పోవుచున్నాను సౌందర్యపూజకొఱకు.

శ్రీ పూర్ణానందగారి 'విశిష్టాద్వైతమత విమర్శ' పరామర్శము :

# శరీరగతగుణదోషములు శరీరికి చెందవు

శ్రీభాష్యం తిరువేంగడరామానుజాచార్యులు

విక్రమసంవత్సర - ఆశ్వయుజమాసపు భారతిలో శ్రీ పూర్ణానందగారు "వేదాంతదర్శనము - విశిష్టాద్వైతమతస్వరూపము"ను స్పష్టముగ దెలియజేసినందులకు వా రెంతయు వందనీయులు. కాని వారు విశిష్టాద్వైతమత రీతిగను, అద్వైతమతరీతిగనుగూడ జీవస్వరూపమును దెలియజేయుచు "జీవుని కార్యముగను, బ్రహ్మ శరీరముగను అంగీకరించినచో అనిత్యత్వదోషము, శరీరమునం దున్న దుఃఖిత్వాదులు శరీరియగు బ్రహ్మమున గూడ నుండుట యను దోషములు పొర్లగలవు. కాని యీ రెండువిషయములకును విశిష్టాద్వైతులు సరియైన సమాధాన మీయజాలకున్నారు." అని వ్రాసిరి. అందువలన వీరు శ్రీ భాష్యమును సంపూర్ణముగ చదువలేదని వ్యక్తమగుచున్నది. శ్రీ రామానుజాచార్యులవారు శ్రీ భాష్యమున "నాత్మాశ్రుతేః" అనియెడి సూత్రముచే నాత్మకు నిత్యత్వమును, "జ్ఞోఽతఏవ" అనియెడి సూత్రముచే జ్ఞానాశ్రయత్వమును నిరూపించియున్నారు. ఆత్మ నిత్యము గాన తత్స్వాభావికధర్మమగు జ్ఞానముగూడ నిత్యమే యనికూడ నిర్ధారణ చేసియున్నారు. "జ్ఞాతృత్వం హి జ్ఞానగుణాశ్రయత్వమ్. జ్ఞానం చాస్య స్వాభావిక ధర్మత్వేన నిత్యం. నిత్యత్వం చాత్మనో 'నాత్మాశ్రుతేః' ఇత్యాదిషు వక్ష్యతి. 'జ్ఞోఽతఏవ' ఇత్యాదిషు జ్ఞ ఇతి వ్యపదేశేన జ్ఞానాశ్రయత్వంచ స్వాభావికమితి వక్ష్యతి" (శ్రీ భాష్యము, జిజ్ఞాసాధికరణము). జ్ఞానము స్వయముగా నపరిచ్ఛిన్నమే యైనను, సంకోచవికాసార్హము గాన జీవాత్మ సర్వదా సర్వజ్ఞుడు గానేరడు. స్వకృతకర్మానుగుణముగా సంకోచవికాసములు స్వీయజ్ఞానమున గలుగుచుండును. ఇంద్రియద్వారా జ్ఞానప్రసారమును బట్టి జ్ఞానము ఉత్పన్నము, జ్ఞానము వినష్టము అనియెడి వ్యవహారములు సంభవించుచున్నవి గాని జ్ఞానమునకు నిజముగ ఉత్పత్తివినాశములు లేవు. ఇంక శ్రీ రామానుజాచార్యులవారి కార్యత్వనిర్వచనమును గూర్చి యోచింతము. "కార్యత్వం హి నామైకస్య ద్రవ్యస్యావస్థాంతరాపత్తిః. త జ్జీవస్యాప్యస్త్యేవ. ఇయాంస్తు విశేషః. వియదాదే రచేతనస్య యాదృశోఽన్యథాభావో న తాదృశో జీవస్య. జ్ఞానసంకోచ వికాసలక్షణో జీవస్యాఽన్యథా భావః. వియదాదేస్తు స్వరూపాన్యథాభావలక్షణః. సేయం స్వరూపాన్యథాభావలక్షణోత్పత్తి ర్జీవే ప్రతిషిధ్యతే" (శ్రీ భాష్యము, ద్వి. అ. తృ. పా. ఆత్మాధికరణము). కార్యత్వ మనగా ఒక వ్యక్తి పూర్వావస్థను విడిచి మరియొక అవస్థను పొందుట. ఇట్టి కార్యత్వము జీవునికిగూడ సంభవించును. వియదాదులయందలి కార్యత్వమునకును, జీవునియందలి కార్యత్వమునకును కొంతభేదము గలదు. వియదాదులయందలి కార్యత్వము స్వరూపాన్యథాభావలక్షణము (అనగా పూర్వస్వరూపమును విడిచి మరియొక స్వరూపము నొందుట); జీవునియందలి కార్యత్వము జ్ఞానసంకోచ వికాసరూపమగు స్వభావాన్యథాభావలక్షణము. స్వరూపాన్యథాభావలక్షణ మగు కార్యత్వము జీవునియందు నిషేధింపబడుచున్నదని తాత్పర్యము. పైన ఉదాహరించిన కార్యత్వ నిర్వచనమువలన శ్రీ రామానుజాచార్యులవారు జ్ఞానసంకోచవికాస రూపమగు కార్య

త్వము నే జీవుని యం దంగీకరించినట్లు స్పష్టమగుచున్నది. ఈ విషయమును జూడకయే శ్రీ పూర్ణానందగారు, జీవుని కార్యముగ నంగీకరించినచో అనిత్యత్వదోషము పొర్లగలదని యాక్షేపించినారని నా తలంపు.

జీవేశ్వరులకు శరీర శరీరిభావ మంగీకరించినచో శరీరగత దుఃఖిత్వాది దోషములు శరీరియగు బ్రహ్మమునకు సంభవింపవా అనెడి యాక్షేపణమునకుగూడ శ్రీభాష్యమునందే సమాధానము చెప్పబడినది. "శరీరగతాస్తు దోషా నాత్మని ప్రసజ్యంతే, యథా దేవమనుష్యాదీనాం సశరీరాణాం క్షేత్రజ్ఞానాం శరీరగతా బాలత్వయువత్వ స్థవిరత్వాదయో నాత్మని సంబధ్యంతే. ఆత్మగతాశ్చ జ్ఞానసుఖాదయో న శరీరే" (శ్రీ భా. ద్వి. అ. ప్ర. పా. విలక్షణత్వాధికరణము). శరీరగతములగు దోషములు ఆత్మయందు ప్రసక్తములు గానేరవు. ఆత్మగతములగు గుణములుగూడ శరీరమున ప్రసక్తములు కాజాలవు. ఎట్లనగా—శరీరవంతులగు దేవమనుష్యాది క్షేత్రజ్ఞులయొక్క శరీరగతములగు బాలత్వ, యువత్వ, స్థవిరత్వాదిదోషములు తదాత్మలకు సంక్రమించుటగాని, ఆత్మగతములగు జ్ఞానసుఖాదులు శరీరమున సంక్రమించుటగాని లేదుగదా? మరియు "సూక్ష్మచిదచిద్వస్తు శరీరకం బ్రహ్మైవ కారణ మితి బ్రహ్మోపాదానత్వేఽపి సంఘాతస్యోపాదానత్వేన చిదచిదోః బ్రహ్మణశ్చ స్వభావాఽసంకరోఽప్యుపపన్నతరః. యథా శుక్లకృష్ణరక్తతంతు సంఘాతోపాదానత్వేఽపి చిత్రపటస్య తత్తత్తంతుప్రదేశ ఏవ శౌక్ల్యాది సంబంధ ఇతి కార్యావస్థాయామపి న సర్వత్ర వర్ణసంకరః, తథా చిదచిదీశ్వరసంఘాతోపాదానత్వేఽపి జగతః కార్యావస్థాయామపి భోక్తృత్వభోగ్యత్వ నియంతృత్వాద్యసంకరః" (శ్రీ భా. జిజ్ఞాసాధి). సూక్ష్మచిదచిద్వస్తుశరీరకమగు బ్రహ్మమే జగత్తునకుపాదానకారణ మయినప్పటికిని కేవలబ్రహ్మముగాక చిత్, అచిత్, ఈశ్వరరూపమగు సమూహమే జగత్తునకుపాదానకారణ మగుటవలన చిదచిత్తులకును, బ్రహ్మమునకును స్వభావాఽసాంకర్యముగూడ యుక్తముగనే ప్రతిపన్నమగుచున్నది. అది యెట్లనిన—శుక్ల కృష్ణరక్తతంతు సమూహమే చిత్రపటమునకుగూర్చి యుపాదానకారణ మైనను చిత్రపటమందలి ఆయాయీ తంతుప్రదేశములయందే ఆయా యీ రూపముల సంబంధము స్ఫురించుచున్నదిగాని రక్తతంతువునందు శుక్లత్వముగాని, శుక్లతంతువునందు రక్తత్వముగాని ప్రతీయమానము కాలేదు. అందువలన కారణావస్థయందు ఆయాయీ తంతువులయందలి వర్ణములకు పరస్పరసాంకర్యము లేనట్లే కార్యావస్థయందుగూడ పరస్పరాసాంకర్యము సువ్యక్తమగుచున్నది. ఇట్లే జగత్తునకు చిదచిదీశ్వరసంఘాతమే యుపాదానకారణ మైనప్పటికిని కార్యావస్థయందుగూడ భోక్తృత్వభోగ్యత్వ నియంతృత్వాది గుణములకు సాంకర్యము లేదు. ఈరీతిగా శరీరభావమునకు సంబంధించిన యాక్షేపణ లన్నిటికిని శ్రీభాష్యమున ననేకములయిన సమాధానములు చెప్పబడియుండ విశిష్టాద్వైతులు సరియైనసమాధానము లీయజాలరనుటచే పూర్ణానందగారు శ్రీభాష్యమును చదువలేదనియే తోచుచున్నది. చదివియే యిట్టి యాక్షేపణము చేసినచో అద్వైతవాసనచే వారికి శరీర శరీరిభావము స్పష్టముగ దెలియలేదనుకొనవలసి యుండును. గ్రంథవిస్తరభీతిచే క్లుప్తముగ వీరి యాక్షేపణలకు సమాధానమును చెప్పినాను. శ్రీభాష్యమునను, అర్వాచీనములగు మరికొన్ని విశిష్టాద్వైతగ్రంథములయందును వీరి యాక్షేపణములకు విపులముగ సమాధానము చెప్పబడియున్నది. విశిష్టాద్వైతమతగ్రంథములన్నియు సాకల్యముగ చూడకుండ విశిష్టాద్వైతులు తగిన సమాధానము లీయజాలరనుట కేవలము వారు వ్రాసినట్లు సాహసమే యగుచున్నది. మరియు రామానుజులు విస్మయకరమగు విచారనైపుణ్యమును జూపినను అతనియుక్తులు పేలవములని పలుక సాహసించుచున్నారమనికూడ శ్రీపూర్ణానందగారు తమ వ్యాసమున వ్రాసియున్నారు. ఏ యుక్తులు పేలవములో ఆయుక్తులను ఖండించుచు ఒకవ్యాసమునుగాని, గ్రంథమునుగాని ప్రకటించిన బాగుండును. వట్టిమాటలతో రామానుజుల యుక్తులు పేలవము లనుట హాస్యాస్పదమయి యున్నది. మరియు శ్రీ పూర్ణానందగారు తమ వ్యాసమును ముగించుచు "రామానుజుడు సదసద్విలక్షణత్వ మను అనిర్వచనీయవాదుల నిరుక్తిని ఖండింప యత్నించి వారి కొకింత యుపకారమునే సలిపినాడు,

తరువాతివారు 'ప్రతిపక్షోపాధా త్రైకాలికనిషేధ ప్రతియోగిత్వం, జ్ఞానినిర్వర్త్యత్వం, సద్భిన్నరూపత్వం, స్వాత్యంతాభావాధికరణ ప్రతీయమానత్వం' అనెడి అభేద్యలక్షణములను నిర్వచించినారు" అని వ్రాసిరి. ఈ యభేద్యలక్షణములు శ్రీమాన్ టి. ఎ. అనన్తాళ్వాన్‌స్వామివారిచే రచింపబడిన 'న్యాయ భాస్కరము' * అను గ్రంథమున పూర్తిగా ఖండింపబడినవి. ఈ లక్షణములను ఖండించుటకే యీ గ్రంథము వ్రాయబడిన దనికూడ చెప్పవచ్చును. పాపము, శ్రీపూర్ణానందగారి కీయంశము తెలియక అవి దుర్భేద్యలక్షణములని సంతసించుచున్నారు. వా రొకసారి దానిని చదివిన తమ యనుమానము తీరగలదని ప్రార్థించెదను.

* ఈ గ్రంథము సుదర్శనా ప్రెస్, కంజీవరములో నాగరీలిపితో ముద్రింపబడియున్నది.

---

# ఎవరు?

## శ్రీ ఉమర్ అలీషా

ఎవరు నవ్విరి ? ముత్యాల నెవరు రాల్చి
నారు? దోఁగు నీ మెలజవ్వనంబు ధవళ
కేతకీధూళి నెనసి యీరీతి సొగసు
సాంధ్యరాగాల రాగాల సంతరించి
ఎగురుచున్నది వాసనాహ్నిక సుషుప్తి
మైమఱచిపోయె భ్రమర మింకేమి పాడు
కీటకం బిది దగ్ధసంకీర్ణరాగ
రసపముజ్జ్వలమైన యీ రజనితమసు
హస్తములు చాచిమెలుగెత్తి స్వస్తిచెప్పి
నింక ప్రేమపాఠాలు కోయిలకు నేర్పి
పంపె నెవరు ? ఈ నవ్వు పట్టరాని
అట్టహాసాలదోయిళ్లఁ బెట్టి లాజ
లవె తలంబ్రాలుజల్లు నీలవలినూత్న
పుష్పలావికకేసి యే మోము వెట్టి
పళ్ల నికిలించు నొకరేయి పట్టు గ్రహణ
కాలమని యెంచదేమి ? శృంగారరవసు
ధానముత్సవ మెద ముద్రితంబులైన
మచ్చలను మాపఁగలదె యే మాపునైన
నవ్వుముత్యాలు నోడులందు నివ్వటిలఁగ
ఏరుద్వారాలు విప్పిరారేమి చెప్ప ?

---

# తల్లులు మరియు తల్లులు కానున్నవారు!

సకాలమున చికిత్స చేయించుకొనుటకు సిగ్గుపడి చిరకాలము విపరీతమైన బాధపడవద్దు. మీ దేశమునకు చెందిన భావి సంతతి చాలవరకు మీగర్భాశయము ఆరోగ్యముపైనే ఆధారపడియుండునను సంగతి మీరు మరచిపోవద్దు. గర్భాశయమునకు బలమొసంగునట్టి దివ్యౌషధమగు



## UTERON (యుటిరాన్)

బి. సి. పి. డబ్ల్యు. బ్రాండు విబ్రో-అశోక

సేవించిన మీ నిస్సత్తువ, బాధలు తగ్గిపోవును. స్త్రీలకు సహజముగానుండు ఋతుదోషములకు, దీర్ఘవ్యాధులకు, గర్భాశయ వ్యాధులకు ఇది అమోఘముగా పనిచేయును. సుప్రసిద్ధవైద్యులు శిఫార్సు చేసిరి.

**Bengal Chemical & Pharmaceutical Works Ltd.,**

CALCUTTA : BOMBAY.

మదరాసు ఏజంట్లు: యన్. దేశాయి గౌండరు అండ్ కో, 41, బందరు వీధి.




# మూలవ్యాధి

"ఒక యోగిపుంగవునిచే ప్రసాదింపబడిన అద్భుతమగు ఔషధరాజము."



రక్తము కారుచున్నను కారకపోయినను, నూతనము, చిరకాలమునుండి ఉన్నదైనను, పైభాగమున లోపలిభాగమునన్నను, ఎట్టిస్థితిలోనున్నను అర్ష-మూర ఒకసారి పూసినచో, బాధ, దురద, మంట, చీము, నెత్తురుకారుట, వెంటనే ఆగిపోవును. 3 దినములలో మొండిదైన మూలశంఖ, భగందరము శస్త్రచికిత్స లేకయే పూర్తిగా కుదురును. వేలకొలది మంది ఉపశమనము బడసి, తదితరులకు శిఫార్సు చేయుచున్నారు. కుదురకపోయిన సొమ్ము వాపసు.

వెల రు. 2/- **AROGYA SADAN.**

**ఆరోగ్యసదన్, దుర్గాదేవి వీధి, బొంబాయి, 4**

# కళింగము

[ఏకాంక నాటిక]

శ్రీ వెంపటి బాలకోటీశ్వరరావు

*"The Religion of Humanity is Love"—Mazzini.*

[సమయం: అర్ధరాత్రము, స్థలం: రణభూమి.]

(పిశాచం ప్రవేశించును)

పిశాచి—(వికటహాసం చేసి నృత్యం చేస్తూ)

నాలుగుదిక్కుల నలముకొన్నది
తిమిరసమూహం,
పెరుగుచు నున్నది పిశాచగణముల
జాతరశబ్దం—

ఆహా! ఎక్కడ చూచినా ప్రళయానందమే! వీరసైనికుల వేడిరక్తప్రవాహాల్లో ఖండిత కపాలాల వికటవిలాసం!

శూరసైనికుల శవములపైని
గృధ్రరాజముల ఘోరవిహారం!
భీకర నిశ్చల వికృతిలోపల
కౌశిక వాయస కూహూనాదం!

(వికటహాసంచేసి)నా కేళికి కంటకమైన వారిని నాశనం చేస్తాను. (దూరమున చూచి) ఎవరా విచిత్రపురుషులు అకాలంలో వస్తున్నారు? — (ముందుకు నడుస్తూ) అశోక మహారాజా? (వెఱ్ఱిగా నవ్వును — కొంచెం సమీపించి వెనుకకు జంకి) ఏమిది! వింతమార్పు! వారి ముఖంలో భయంకర శక్తి తేజోవంతంగా తాండవిస్తూంది. (అటూ ఇటూ చూచి) ఈ పిశాచగణా లన్నీ చెదరి చెదరి పరుగిడుతున్నై. నే సహితం సహింపలేకున్నాను.

(వెనుకకు నడుస్తూ పోవును. నిష్క్రమించునంతలో ముందు అశోకుడు, వెనుక అమాత్యుడు ప్రవేశిస్తారు.)

అశో—(రౌద్రంగా) పిశాచీ! పో—తిరుగు—పో.

అమా— రాజా! ఏమిది? ఆశ్చర్యం! భయంకరం!! పిశాచా న్నేల సంబోధించారు? (పరికిస్తూ) అగుపడటం లేదే?

అశో—(ఆ దిక్కునే చూస్తుండును. కోపం చల్లారుతుండును.)

అమా—ఏమిది రాజా? యుద్ధభూమిలోని కిందుకే అకాలంలో పోవద్దని మనవి చేశాను.

అశో—భయపడకు. (ఖిన్నుడవుతూ) వీరసైనికులను పి......శా......చాలంపాలు చేశాము.

అమా—ఏమిది రాజా..!.వీరసైనికులు వీరస్వర్గాన్ని అనుభవిస్తూన్నారు. పిశాచాల పా లెట్లయినారు ?

అశో—(ప్రక్కకు చూస్తూ, తనలో) ఈ నిష్కళంకుల రక్తమాంసాలు గ్రద్దల కాహార మైనాయా ?

అమా—రాజా, శరీరాలు అశాశ్వతాలు. వీరు మహత్తరమైన మృత్యువు నాశించారు. అది అందరికీ లభిదేది కాదుకదా!

అశో— (ముఖం త్రిప్పి) అమాత్యా, ఏమన్నావు? (ఆలోచనగా) ఆ నల్లని నీడలు ఎక్కడినుంచి పడ్డాయి ?

అమా—నీడలు కా వవి; రుధిరాశయాలు, మహారాజా!

అశో—ఆఁ?... రుధిర... ఆశయాలే?

అమా—ఇప్పటికి మూడుజాముల క్రితం చక్రవర్తులవారి జయభేరి మ్రోగిన రణభూమి కాదా ఇది?

అశో—(వేడినిట్టూర్పుతో నవ్వి) కాదు... పుణ్యభూమి... ఏమీ? ... జయభేరి! జయభేరి... ఇందుండేనా? (దగ్గరగా ఒక శవమును పరికించి కలవరపడును.)

అమా—అంతకలవర మేల స్వామీ! యుద్ధభూమిలో ఏముంటుంది?

అశో—ఏముంటుంది? ... ఘోరం... బీభత్సం... లక్షలకొలది వీరపురుషుల రక్తసిక్తాలైన ఖండితమస్తకాలు !

• అమా—(మధ్యలో అందుకొని) ప్రభూ! బీభత్స మేల ? వినరానిమాట వచించారు! రాజ్యాన్ని నిర్జితశత్రువుగా చేయటం రాచ ధర్మం కానేరదా ? (ఉత్సాహపూరితము లైన మాటలతో) నేటితో కళింగదేశము తమది. కళింగదేశీయులు తమ బానిసలు. నేటివరకున్నూ మన వైరియై కాలు దువ్వుతూ మదోన్మత్తుడైన కళింగాధీశుడు మన భటులచేత బంధింపబడిఉన్నాడు. తమ దాక్షిణ్యానికి పాత్రుడు.

అశో—(గట్టిగా) దాక్షిణ్యము! (క్రుంగి) ఒక్కనిమీదనా ఇక నా దాక్షిణ్యం?

అమా— ప్రభూ! నేటినుండి తమకు సామంతుడై కప్పం కట్టవలెను. ఇక మీకీర్తి నిండుచంద్రుని వెన్నెలవలెగిది ప్రకాశిస్తుంది. తమ శౌర్యపరాక్రమములు వైశాఖసూర్యుని తేజస్సు నతిక్రమించి శత్రురాజులకు సింహస్వప్న మవుతాయి. యుద్ధం క్షత్రియధర్మం. అది రాజులకు అవశ్యాచరణీయం.

అశో—అయిన నాకు కీర్తియే కలిగిన దంటావా ? (వికాసంలేని హాసంతో) ఇది నీవు హాస్యం...

అమా — క్షమించాలి. ప్రభువులవా రన్యథా తలుస్తున్నారు. జయాపజయా ల్లేక నెలలకొలది పోరుచేసి, నే డనర్గళవిజయంతో అరిరాజు నరికట్టి బంధించిఉండగా జయమన్న హాస్యం ఏల అగును రాజా ?

అశో—బంధితు డైనంతమాత్రాన శత్రురాజు మిత్రు డైనాడా? లేక అతనిప్రజలకు ఆప్తుల మైనామా? ఎంత పిచ్చి ! ఎందుకు... అజ్ఞానంతోనే ఈయుద్ధ మాచరించాము.

అమా—యుద్ధంచేయుట అజ్ఞానమా ప్రభూ! నే నొకమాట మనవిచేస్తాను. ప్రభువులవారి మనసు చెదరిఉన్నది. తమ మతో చితంగా మాటాడలేకున్నాను. సమాధాన మీాయ ప్రయత్నిస్తే ప్రభువులు అన్యథా తలుస్తారు.

అశో—అమాత్యా! ఎందు కీతొట్రుపాటు?

అమా—లేదు స్వామీ. మీా మనసు కలవరంగా ఉన్నందుకు కారణ మేమో తెలియకుండా ఉన్నది.

అశో—కలవర మేమీా లేదు, చూడు-అమాత్యా, నాప్రక్క కొచ్చి కూర్చో. (వాని పాదములకడ పడిఉన్న ఒక సైనికుని శవం ప్రక్కన కూర్చుంటాడు)

అమా—(అశోకుని పరికించి చూచి) రాజా! తమ వాక్కులను, తమ దృక్కులను చూస్తూంటే నాహృదయం తబ్బిబ్బవుతూంది

అశో—చూడు, ఈ సిపాయి ఈ సిక్కశంకుని, ఈ స్వాతంత్రవీరుని హృదయకుహరం ... ఈ అయశ్శూలం అజ్ఞానంచేతనే ఆ కుహరంలో రగిలి జ్వలిస్తూన్న స్వతంత్ర లక్ష్మిపై పిపాసను నశింపచేయ దలచింది కాబోలు.

అమా—అది దుర్లభమైందే, దాని కాఠిన్యమే బయల్పడింది. కాని, అందున్న జ్వాలలు ఉరక ఆరలేదు.

అశో—వాని స్వాతంత్ర్యాపేక్ష శుష్కింపలేదుకదా!

అమా—నిశ్చయం.

అశో—అయిన, వినుము. మానవుడు స్వతంత్రుడు. అట్టి మానవుని అస్వతంత్రునిగా చేయుట ప్రకృతివిరుద్ధంకాదా?

అమా—అయిన?

అశో—ఇప్పుడీవైపరీత్యానికి కారణ మేమో ఊహించగలవా?

అమా—పరికింప మనసు కది విపరీతం గానే ఉంది, ప్రభూ! కాని కారణమే తోప కున్నది.

అశో—(ఒకతూరి ఆకసమువంక దీర్ఘంగా చూచి, ఆలకించి) అమాత్యా, కారణము లేక కార్య ముండదుకదా? ఈవైపరీత్యానికి కారణం కలదు. ఒక్కసారి ఆకసంవంక చూడు.

అమా—(చూచి) చెక్కుచెదరని వింత సృష్టి!

అశో—ఈసృష్టి కంతటికిని మూలాధారము ఆకర్షణ. ఆ ఆకర్షణే ప్రేమరూపంతో జంతుజాలమందు ప్రజ్వరిల్లుతూంది. మానవజాతియందున్నూ ఈప్రేమ అంటిన మాత్రముననే కలుగుతూంది.

అమా—ప్రభూ, ఇది సత్యం.

అశో—కాని (పైకి చూచి) చూశావా, ఆ కల్మషహృదయుడు ఉడుపతి - వక్రకాయుడు- రక్తముఖంతో దిగిపోతున్నాడు.

అమా—వానినే శశాంకు డని శ్లాఘిస్తున్నది, రాజా, లోకం.

అశో — అవును. అదే అజ్ఞానం. ఇటువంటి రాజులు గిట్టితేనే ప్రజలకు శ్రేయస్కరం.

అమా — అవును. ఆ తారాగణాల తళతళ మెరుపు లధిక మౌతూన్నాయి.

అశో — ప్రేమలేని కళంక హృదయుడని అంటాను. ఈ ప్రపంచంలో స్వార్థతత్పరులైన రాజులైనా అంతే.

అమా — నిజము! ఇట్టిరాజు లంతరిస్తేనే మేలు.

అశో — కారణము తెలిస్తే జాడ్యం కుదర్చటం సులభం. విను— ఇక ఈ దోపిడిరాజ్య కాంక్ష అంతరించాలి. ఈ ఘోరసామ్రాజ్య తృష్ణ నాశనం కావాలి. అటు కాకపోతే సర్వమత సారమైన విశ్వమానవ సౌభ్రాతృత్వానికి తావేలేదు. దీనికి మూలాధారమైన ప్రేమ ఈ ప్రజాస్వామ్యమందుతప్ప వేరెక్కడైనను కల్ల. ఇందే, ఈప్రేమచేతనే ప్రపంచ శాంతి కలుగుగాక.

అమా — బోధపడినది. దీని లేమిచేతనే గదా ఈవైపరీత్యం, ప్రభూ!

అశో — సత్యం. జ్ఞానతపస్వి సిద్ధార్థుడు తన జ్ఞానతపస్సుచేత ఈలోకాన్ని పవిత్రం చేశాడు. ఇదిగో ఈ పాషాణహృదయుని సైతం ఆకర్షించి కృతార్థుణ్ణి చేశాడు.

(నిష్క్రమింతురు)

(నేపథ్యంలో)

సిద్ధజ్ఞాని బోధతత్త్వము
అశోక ప్రభువుని ఆకర్షించెను.
ప్రభాతమిత్రుని పవిత్రకాంతులు
ప్రపంచ మంతట పరుగిడుచున్నవి.
సంధ్యాసూర్యుని సువర్ణ తేజము
సర్వజగానికి శోభను కూర్చెను.



మహానంది ఆలయతటాకాలు

# : కళింగాధిపతి :

# సామంతవర్మతామ్రశాసనము

శ్రీ మండ నరసింహంగారి పునర్విమర్శపై
కొన్ని సంశయములు

❀ శ్రీ కట్టి సాంబమూర్తి ❀

ఈ శాసనమును మొదట ౧౯౩౪-వ సంవత్సరమున శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ప్రాచ్యపరిశోధకమాసపత్రిక (Journal of the **Oriental Research Society**) లో ప్రకటించిరట. వారు ఆసమయమున శాసనమందలి సర్వవిషయములను బాగుగ విమర్శించియే యుందురు. వానిలో సంప్రదాయసిద్ధాచారములను విడనాడి శ్రీ మండ నరసింహం పంతులుగారు భారతియందు (అక్టోబరు ౧౯౪౦) ముఖ్యవిషయవిమర్శన కుపక్రమించి పునర్విమర్శనము గావించిరి. ఆ పునర్విమర్శనమున కొన్ని సంశయములు దోచుటచే నే నిపు డీవ్యాసము వ్రాయవలసివచ్చినది.

శ్రీ సోమశేఖరశర్మగారి మొదటి వ్యాసమును నేను చూడలేదు కావున దానిపై నా యభిప్రాయ మిదమిత్థ మని చెప్పజాలను. కాని పునర్విమర్శనమున నట్టంకింపబడిన యంశములవలన వారివిమర్శన మంతగా వాస్తవస్థితిని దెలుపకున్నను యుక్తిదూరము గాక హేతుబద్ధముగానే యున్న దని తోచుచున్నది. కాలగర్భమున నణగియుండి, యెప్పుడో, యేపాటి మంటిదిబ్బలోనో చివికి శిథిలములై దొరకిన శాసన శకలములవలన నెంత చరిత్రము లభించునో యంతయు శ్రీ శర్మగారు గ్రహించి ప్రకటించి రనుట వాస్తవే తరముగాదు. అప్రమాణములును, నపసిద్ధాంతములును మన దేశచరిత్రమున కంతకును సిద్ధముగా నున్నవియే. వానినిగూర్చి విమర్శకుల ననవలసినపని లేదు. ఆ మహనీయు లిప్పుడు చేసిన కించిదుపకారమువలననే మున్ముందు పరమసిద్ధాంతములు బయలుపడలుట కవకాశము లుండుటచే వారే చరిత్రపునాదులు నిర్మించిన మహానుభావు లనుచున్నారు.

ఈ శాసననిర్మాత ప్రాచీనగాంగవంశమునందలి వాడుగా నగపడుచున్నాడు. ఈ వంశమునందు హస్తివర్మ, ఇంద్రవర్మ, దేవేంద్రవర్మ లనువారుగూడ శాసనకర్త లగపడుచున్నారు. వీరి యెల్లరి బిరుదములును నొక్కరీతిగానే కించిద్భేదముతో నున్నవి. కావున వీరెల్లరు నొక్కకోవలోనివారే యని యూహింపవచ్చును. వీరి యెల్లర శాసనములందును లిపి మిక్కిలి పురాతనముగా నున్నది. కాలమును దెలుపుటలోగూడ వీరు శాలివాహనాది శకకాలములను దెలుపలేదు. అందువలన శాసనలిపివలననే వీరి కాలనిర్ణయము చేయవలసివచ్చుచున్నది. లిపివైఖరినిబట్టి వీరు మిక్కిలి ప్రాచీను లని కొందఱు చరిత్రకారు లభిప్రాయపడుచుండ మఱికొంద ఱది సరికాదనియు, వీరు అంతప్రాచీనులు కా రనియు చెప్పుచున్నారు. రెండవపక్షమువారు అట్లు చెప్పుటకు అర్వాచీనగాంగ

వంశజుల శాసనములందలి విషయములను ప్రమాణముగా జూపుచున్నారు.

క్రీస్తుశకము పదిపదునొకండు శతాబ్దములందుండిన రాజులు జనవ్యవహారము ననుసరించిరో, లేక గౌరవాపాదనేచ్ఛతో స్వయంకల్పితములుగానో ప్రకటించిన వంశావళీచరిత్రాదులతో నైదారు శతాబ్దములకు ముందున్నవారి చరిత్రమును నిర్ణయించుట సమంజసమును, న్యాయమునుగా నగపడదు. ప్రాచీనుల చరిత్రమింకను కాలగర్భమున నణగియుండి సమగ్రముగ మనకు దొరకలే దనియే భావింపవలసియుండును.

శ్రీ నరసింహంపంతులుగారు దత్తగ్రామమును గూర్చి విశేషముగ విమర్శించియున్నారు. శ్రీ శర్మగారు 'శ్చేతక' పదమును చేతక - చేటక - చేకట - చీకటిపదములుగా పరిణమింపజేసి ఘేరవమును బాగుగా నిర్ణయించినారు. వారు స్వరపరిణామశాస్త్రము ననుసరించి యట్లు నిర్ణయించుట సరియే. దానిని కాదనుటకు గొప్పప్రమాణములు గావలయును. శ్రీనరసింహముగారు శ్రీకూర్మమునకు శ్వేతక మనియు, శ్వేతగిరి యనియు స్థలపురాణాదులందు వ్యవహారము గలదనియు, కాల్క్రమమున శ్రీకూర్మముగా బ్రసిద్ధినొందిన దనియు వ్రాసినారు. ఇది శ్రీ శర్మగారి యూహను పూర్వపక్షముచేయుటకు దగియేయున్నది. ఇంతవఱకు నీవిషయము సవ్యముగానే నడచినది. కాని తక్కిన విషయములను నిర్ణయించుపట్టున శ్రీనరసింహంగారు పొరపాటులు చాల త్రోసి రనవలసివచ్చినందుకు విచారమగుచున్నది, క్షమింతురుగాక.

శ్చేతక పదమును ఖండించుటలో "సంస్కృత భాషయందు శ్చేతక యను పద ముండుట దుర్లభము. సంస్కృతభాషయందు శకారచకారములతో గూడిన సంయుక్తాక్షరము తొలియక్షరముగా గల పదములు లేనే లేవు. ఇది భాషాతత్త్వమునకు సరిపోదు" అని యింక నేమేమో వ్రాసినారు. ఈవ్రాతమాత్రము సరికాదని నామనవి. శకారచకారముల సంయోగముతోడను, శకారచకారయకారముల సంయోగముతోడను గూడి సంస్కృతభాషయందు ధాతువు లున్నవి. ధాతువున్నప్పుడు ధాతువుపైని కృత్తద్ధితప్రత్యయములు చేర్పగా సుబంతరూపములు సంభవించును. శ్చోతనము, శ్చ్యోతనము అను రూపములకు కావ్యములలో ప్రయోగములు నున్నవి. మనకు బాగుగా పరిచితములను నేరెండుగ్రంథములలోనో ఆ ప్రయోగము లగపడనంత మాత్రమున వాని యునికినే శంకించుట సాహసము కాకపోదు. కావున నీవిచారణము కేవలము అప్రమాణమనవలసియున్నది. మఱియు శ్చేతకపద మొకానొక సంజ్ఞావాచకమైనచో దాని స్వరూపార్థములు నిర్ణయించుటకు ప్రయత్నించుటే అనవసరము. మన విమర్శనము జనశ్రుతియం దున్న స్వరూపము నెంతమాత్రమును మార్పజాలదు. కావున నీస్థలమున శకారముతో సంయుక్తమయిన వర్ణము లేఖకప్రమాదమున వైరూప్యమందిన వకారమే యని నిశ్చయము గలుగుచో నాపదము శ్వేతకమని నిర్ణయింపవచ్చునుగాని ప్రబలాధారములుగాని, బాధకములుగాని లేకయే శ్చేతకమును శ్వేతకముగా మార్పవలసినంత యవసరము గనబడదు. ఈ సందిగ్ధగ్రామము అధిష్ఠానమే కాని దత్తగ్రామము గాదు. దత్తగ్రామమునకును దీనికిని సన్నిహితసంబంధ మున్నచో నట్లు నిర్ణయించుకొనవచ్చును. శ్రీ శర్మగారి మతమున ఘేరవము బారువ గావున శ్చేతకము చీకటి యనుట కేయాటంకమును లేదు.

శ్రీ నరసింహముగారి వాదమున ఘేరవము దత్తగ్రామనామముగాక దానికి సంస్కృతపరివర్తనము. అసలు పేరు నక్కపల్లి. అశ్వత్థచ్ఛేద మనునదికూడ నొక గ్రామనామమునకు సంస్కృతీకరణము. అసలు పేరు రావిపాడు అని. ఈ గ్రామములు లోహశృంగార విషయములోనివి. ఈలోహశృంగార మింతవఱకు పరిశోధకులకు దెలిసిన విషయము కాదు. శ్రీ నరసింహంగారి మతమున పదసామ్యమున నీలోహశృంగార విషయమునది విశాఖపట్టణంజిల్లాయందలి శృంగవరపుకోటతాలూకా యని యెంచవలెను. ఆ పేర కోటయొకటి యుండుటయు, నచ్చట లోహపరిశ్రమ అనగా కంచుపోతపని విశేషముగ నేటికిని జరుగుచుండుటను పదసామ్యమున లోహశృంగారవిషయము నేటి శృంగవరపుకోటతాలూకా యని నిశ్చయింపబడినది.

మొదటచేసిన తప్పు తరువాత చేయబడిన తప్పుల పరంపరకు కారణ మగుచుండు ననువిషయము చక్కగ నెఱిగిన శ్రీనరసింహంగారు నిర్ణయించిన యీసిద్ధాంత మెంత సమంజసమో మనము చూడవలసియున్నది. శాసనములందు కోలువర్తనీ, కంటకవర్తనీ, గరుడవర్తనీ త్యాదినామము లిపుడు గరుడభద్రములు, భద్రపోలు, భద్ర మొదలగు నామములతో వ్యవహరింపబడుచున్నవి. గ్రామనామములందు సిపిడి చీడివలసగా నున్నది. కందలివాడ యింకను దెలియరాలేదు. ఉరామల్ల ఉర్లాముగా నున్నది. సింధురాపురము సుందరాపురముగా నున్నది. ఖోన్న కొర్నిగా నున్నది. అచ్యుతాపురము, సిద్ధాంతము, విశాఖపట్టణము మొదలగు నామము లట్లే యున్నవి. వీనినిబట్టి చూడ రావిపాటి నశ్వత్థచ్ఛేద మనునంతటి అనర్థకపదముగా సంస్కృతీకరించుటకు బూర్వులు సమ్మతించిరా, నక్కపల్లికి ఖేరవగ్రామ మనుట కొప్పుకొనిరా యనియు నాలోచింపవలయును. పోనీ, సరిహద్దులు - సరిపడినప్పు డట్లంగీకరింపవచ్చు నందమా అదియును లేదు.

శ్రీనరసింహముగారి యూహ నంగీకరించుచో శ్రీకూర్మమునకును, నక్కపల్లికిని నూట యేబది మైళ్లకు పైబడిన దూరము కలదు. ఈ రెండు గ్రామములే సరిహద్దుగ్రామము లై యుండవుకదా? అసలు ఆరాజుల ప్రధానదైవతాధిష్ఠాన మగు మహేంద్ర గిరియు, గోకర్ణేశ్వరుడు నీప్రదేశమునకు వెలుపలనే యున్నారు. కాబట్టి యించుమించుగా రెండువందల మైళ్ల దూరమునకు పైబడిన దూరము వారి రాజ్యము వ్యాపించియున్న దనవలయును. కాని అంతదేశ మా ప్రాచీనకాలమున నొకరి యేలుబడిలో నున్నదా యని శంక వొడమకమానదు. ఇప్పటి యొక్కొక్క తాలూకాయే పూర్వుల వ్యవహారమున చతురుదధివేలా వలయితభూమండలముగా నగపడుచుండ నింతటి దేశ వైశాల్య మాశ్చర్యమును కలిగింపకపోదు. శాసనకర్త రాజధాని యేదో తెలియనే తెలియదు. అతడు సకల కళింగాధిపతియని ప్రకటించుకొనుట అలంకారమునకే కాని యితరము గాదు. "స్వాసిధారా వినిర్భిన్న సకలారాతిమండలః, యో రరక్ష క్షితిం ధీరః క్షితీశో ఽనన్యశాసనామ్" అని కాళిదాసుడు దిలీపుని వర్ణించిన "అనన్యశాసనా ముర్వీం శశా సైకపురీ మివ" అను వాక్యము ననుకరించి దేవేంద్రవర్మ తన శాసనమున జేర్కొనినాడుకాడా?

పోనిండు, నక్కపల్లికడ రావిపాడు అను గ్రామ ముండుట సిద్ధమైనచో గొంత సరిగా నుండు నేమో? అట్టిగ్రామ మున్నట్లు శ్రీ నరసింహముగా రెఱుగరు. ఆ ప్రాంతముతో చిరపూర్వ పరిచయము గల నాకును దెలియదు. ఇంక నశ్వత్థచ్ఛేదము నెక్కడ నతుకుట? అసలు నక్కపల్లి యెక్కడ నున్నదోకూడ శ్రీనరసింహముగా రెఱిగియున్నట్లు కనబడదు. అనకాపల్లిదగ్గఱ నక్కపల్లి యని వ్రాసినారు. ఆనక్కపల్లి అనకాపల్లి దగ్గరనే యున్న దని యంగీకరించునెడ కాశీ రామేశ్వరములుమాత్ర మొకదాని సమీపమున నొకటి లేవా? నక్కపల్లికిని, అనకాపల్లికిని సుమారు ౧౦ అణాల రైలుఛార్జీదూరము గలదు. అనకాపల్లికి తూర్పుగా నే యిరువదిముప్పదిమైళ్ల దూరమునవో గల మేఘాద్రిగెడ్డ నక్కపల్లికి సరిహద్దుగా నిర్ణయింప బడునెడలనపుడు ఎలమంచిలి, పెందుర్తి, చోడవరము విశాఖపట్టణము మొదలగున వన్నియు ఒక్కనక్కపల్లిగానే ఏకాగ్రహారముగా దానము చేయబడియుండవలయును. లోహశృంగారవిషయవిషయముగూడ సమంజసముగా లేదు. శృంగవరపుకోట యను శబ్దమున కోట యుండుటయేకాక యాగ్రామసమీపమున నొక పాడుపడిన గొప్పకోటకూడ నున్నది. అంతమాత్రమున నీశాసనమునకును దానికిని సంబంధము గల్పింప నవుపు గలుగునా?

రెడ్డిరాజుల పాలనమునాటికి శృంగవరపుకోట యెవరో రాజులకు రాజధానిగానే యుండెడిది. శ్రీనాథుడు వీరభద్రారెడ్డి జయించిన దుర్గములలో సింగారంకోటను పేర్కొన్నాడు. మొన్నమొన్నటి వఱకును శృంగవరపుకోటలో మఖీవారి జమీందారీ యుండెడిది. అడిదమునూరకవికి సమకాలికుడు, నేలిక ప్రాయుడు నగు పాడుగుపాటి వేంకటమంత్రి మఖీవారి సంస్థానమున మంత్రిగా నుండెడివాడే. ఆకోట, ఆరాజ్యముకూడ నిప్పు డల్పావశేషములుగా నున్నవి.

అయినను అక్కడ కంచుపని యెప్పుడైన నున్నట్లగపడదు. ఆగ్రామమునకు గొంతదూరమున లక్కవరపుకోటయే నాటికిని నేటికిని కంచుపనికి ప్రఖ్యాతి చెందినది. విశాఖపట్టణప్రాంతమున నర్వాచీన గాంగరాజగు అనంతవర్మగంగదేవుని శాసనములుదక్క నింక నేగాంగుల శాసనములు నగపడుటలేదు. అందును శ్రీకాకుళము, నరసన్నపేట, టెక్కలితాలూకాలందుమాత్రమే గాంగ గంగరాజులందఱి శాసనములు నగపడుచున్నవి. కావున శాసనమందలి లోహశృంగారవిషయముగాని, ఫేరవగ్రామముగాని, అశ్వత్థచ్ఛేదముగాని, మేఘాద్రిగెడ్డగాని శ్రీ నరసింహంగారు నిర్ణయించునట్లొకటియు గాదు. ప్రస్తుతకాలమున నాగ్రామముల నెఱిగినవా రెవరు నట్లంగీకరింపజాలరు.

ఈ విషయమున శ్రీ సోమశేఖరశర్మగారి యభిప్రాయము లోకవేళ సిద్ధాంతములు గాకపోయినను నవియే యుక్తియుక్తముగా నున్నవనక తీఱదు.

గాంగ గంగరాజుల శాసనము లన్నియు శ్రీకాకుళప్రాంతముననే యున్నవని యిదివఱకు మనవి చేసియుంటిని. అసలు గాంగులయొక్కకాని, గంగులయొక్కకాని రాజధానులగు దంతపురము, నగరము, ముఖలింగము, సింహపురము మొదలగు గ్రామములును, కోలు (కోల) వర్తనీ, లేక వరాహవర్తనీ విషయమును, ప్రదత్తగ్రామము లన్నియు నా సమీపముననే కలవు. ఒకదానికొకటి పది పదునేనుమైళ్లకు మించని దూరముననే కలవు. మఱియు అంబవాటివిషయము (అంబావెల్లి) మొదలగు నర్వాచీనుల శాసనములందు జెప్పబడిన గ్రామములు నీసమీపముననే కలవు. కావున నీ ఫేరవగ్రామముకూడ నీసమీపముననే యుండియుండు ననుటకు సంశయింప నక్కఱలేదు. దానికి దగినట్లుగ నీక్రింది విషయములు గమనింపఁ గోరెదను. ప్రదత్తగ్రామము నరసన్నపేటకు ౫ మైళ్లదూరమునను, శ్వేతకాధిష్ఠానమనబడు శ్రీకాకుళమునకు ౧౦-౧౫ మైళ్లదూరమునను, కళింగపట్నమునకు మూడునాలుగుమైళ్లదూరమునను గల "పిరియా-ప్రియా" అను పేళ్లతో నిప్పుడు వ్యవహరింపబడుచున్న గ్రామము కాదగును. ఫేరవము పిరియా-ప్రియాగా మాఱుట అస్వాభావికము గాదు.

అశ్వత్థచ్ఛేదము రావిపాడే యగుచో నదియు ప్రియాగ్రహారమునకు మూడునాలుగుమైళ్ల దూరముననే కలదు. ఆగ్రామమునందే తిలారురైలుస్టేషను గలదు. రావిపాడును, ప్రియయే కాక యానడుమనున్న హరిశ్చంద్రపురము, లఖినదిడ్డి, యెలమంచిలి మొదలగు గ్రామము లిప్పటికిని బ్రాహ్మణభోజ్యములై అగ్రహారములుగానే యున్నవి. ఇతరరాజు లిచ్చిన ఖోన్న, ఉరామల్ల, కుద్దాము, సిపిడి, సింధురాపురము, అచ్యుతాపురము మొదలగు నగ్రహారములు గూడ నీప్రియకు పదిపండ్రెండుమైళ్ల దూరముననే కలవు. ఇంకను సరిహద్దులందమా, అవి యంతగా విచారింపవలసినవి కావు. తూర్పున ఎండిపోయిన యేఱు, దక్షిణమున సమ్వేద్యా, పశ్చిమమున మేఘావతి యను సరిత్తు, ఉత్తరమున కోద్రవఖలి, దక్షిణమున గర్తము, పూర్వోత్తరమున పర్వతము అనునవి ప్రదత్తగ్రామమునకు సరిహద్దులు. వీనిలో సమ్వేద్యాశబ్దమున కర్థము తెలియరాకున్నది. బహుశః ఆశబ్దము కాలిబాటనుగాని, పుంతనుగాని తెలిపెడి పద్యాశబ్దమునకు ప్రమాదపతితరూపమో, కాక ఆయర్థముగల వేఱొకపదమో అయియుండును. తక్కిన సరిహద్దులన్నియు నందఱు నెఱిగినవే. ఈసరిహద్దులన్నియు నప్రసిద్ధములే. చిరకాలము నొక్కరీతిగా నుండవలసినవి కావు. శుష్కనది = ఎండిపోయిన యేఱు, కోద్రవఖలి=కొఱ్ఱలకళ్లము, గర్తము=గొయ్యి. ఇవి ఎల్లకాలము నొక్కరీతిగానే యుండునా? వీనివలెనే సరిన్మేఘావతి యనునదికూడ నేదోయొక గెడ్డకు పేరై యుండును. ఆప్రాంతమున గెడ్డలనేకము లిప్పుడు నున్నవి. వానిలో దేనికి బూర్వకాలమున నా పేరుండెడిదో? పర్వతములు గొప్పవి కావుగాని, చిన్న చిన్న మెట్ట లిప్పుడు నా రెండుగ్రామముల సమీపము లందునుగలవు. ఆ మెట్టలలో నొకటి పర్వతముగాను, గెడ్డలలో నొకటి మేఘావతిసరిత్తుగాను గ్రహించుటకు శుష్కనదిని, కొఱ్ఱలకళ్లమును సరిహద్దులుగా గ్రహించువారి కభ్యంతరముండునా? కావున బహుశః ప్రియాగ్రహారమును, రావిపాడును ప్రదత్తగ్రామములై యుండునని నానమ్మకము.

శాసనమున పేర్కొనబడిన లోహశృంగారవిషయము గూడ నించుమించుగ దీనికి సరిపడును.

శ్రీకూర్మమునకును ప్రియాగ్రహారమునకును గొలది మైళ్ల దూరముననే సింగుపుర మను గ్రామము గలదు. అదియే కొందఱు శాసనములందు పేర్కొనబడిన సింహపురము కావచ్చును. ఆగ్రామమే యీశాసనమున లోహశృంగార మను పేర వ్యవహరింపబడి యుండును. ఆగ్రామమందు సంగతి నాకు బాగుగ తెలియదుగాని దానిచుట్టుపట్ల మాకివలస, నబ్బుగామ్, గొల్లలవలస, దీర్ఘాసి మొదలగు గ్రామములం దిప్పుడును కంచుఇత్తడి పనులు విరివిగా చేయబడుచున్నవి. ఆకాలమున నా గ్రామముననుగూడ లోహపరిశ్రమము విరివిగా సాగుచుండెనేమో? శృంగారము సింగారము, సింగవరము, సింగుపురములుగా మారుట అస్వాభావికము, అశాస్త్రీయము గానేరదు.

ఈసింగుపురమునకు ప్రక్కను భైరి యను గ్రామము గలదు. భైరవము భైరిగా మారవచ్చును. ఈరెండు గ్రామములును వంశధారానదీతీరమునకు సమీపముననే యున్నవి. ఆకాలమున- నానదికి మేఘావతీనామ ముండెనేమో పరిశోధింపవలసియున్నది.

శ్రీనాథునిచే సింగారంకోట యని పేర్కొనబడిన శృంగారపుకోట యిపుడు శృంగవరపుకోటగా వ్యవహరింపబడుటలేదా? చీకటి, చీకటికోట యను రెండు గ్రామము లున్నట్లుగానే శృంగవరపుకోటయు, శృంగవరమను నొకచిన్న గ్రామమును నిప్పుడు నున్నవి. శృంగవరమును విడుచుటకుగాని, శృంగవరపుకోటను గ్రహించుటకుగాని వినిగమకము లేమి? లోహపదము రెంటితోడను ప్రకృతకాలమున సంబంధించియుండ లేదు. కోటపదమునకు శాసనమున ప్రసక్తియే లేదు. కావున శృంగవరపుకోటను లోహశృంగారవిషయముగా గ్రహించుటకంటె సింగుపురమునే గ్రహించుట మిక్కిలి సమంజసముగా నుండు నని నాయభిప్రాయము.

శాసనము లభించిన స్థలమునుబట్టి చూచిన నా నమ్మకము మఱింత బలపడుచున్నది. దేవేంద్రవర్మచే ప్రదత్తమగు సిపిడి (చీడివలస) అగ్రహారముగా శ్రీ బలగ బావాజీమహంతుగారి ఏకభోజ్యముగా నున్నది. చీడివలసశాసన మాగ్రామముననే లభించినది. ఈ సామంతవర్మశాసనముగూడ నాచీడివలసగ్రామముననే లభించినది. ఆకాలమున మా కీరెండుశాసనములు లభించినట్లు తెలిసి మేము ఆకాలమున నరసన్నపేట తాలూకా డిప్యూటీఇన్స్పెక్టరుగా నున్న శ్రీ శ్రీ తెంపల్లి సూర్యనారాయణమూర్తిగారి విశేష ప్రయత్నమువలన సిపిడిశాసనమును మాత్రము సంపాదింప గలిగితిమి. ఆ సూర్యనారాయణమూర్తిగారే తమ చేతి డబ్బు మూడురూపాయ లిచ్చి యాశాసనమును కొనిరి. రెండవది మాప్రయత్నకాలమునకే ఆగ్రామము విడిచి పోయినదని వింటిమి. అదియే తరువాత చాలకాలమునకు శ్రీ శ్రీ బావాజీగారికి లభించినట్లు శ్రీ బావాజీగారు నాతో సెలవిచ్చియున్నారు. ఈచీడివలసకు ప్రియ రెండుమైళ్ల దూరముననే యున్నది. కావుననే రెండుశాసనములు నొక్కస్థలముననే భద్రపఱుపబడి యొక్కస్థలముననే యొకరైతునకే లభించుట సందర్భించినది. ఇది నాయల్పమనీషకు దోచిన నూతనాభిప్రాయము. స్థలవిశేషము లెఱిగినవారును, చరిత్రవిమర్శకులును గొంచె మోపికతో ప్రయత్నించిన నీశాసనముల వాస్తవస్థితి తెలియగలదు.

ఈ శాసనము ముఖ్యమైన దని శ్రీ నరసింహముగారు తలచుచున్నారు. ఇదిమాత్రమేకాక దీనితోడనే లభించి నాచే నీయబడి యిపుడు రాజమహేంద్రవరమున ఆంధ్రదేశీయైతిహాసికపరిశోధకమండలివారి స్వాధీనమున నున్న చీడివలసశాసనమును, ఎక్కడనో అజ్ఞాతముగా నున్న హస్తివర్మ ఉర్లాంశాసనమును, కంబకాయ గ్రామాధికారి శ్రీభైరి అప్పలస్వామినాయడుగారికడ సింహలాంఛనముతో 'మహారాజహస్తివర్మణః' అను నక్షరములు గల మృత్పాత్రశకలమును, శ్రీకూర్మమున శ్రీ శ్రీ జయంతి బాలకృష్ణమూర్తిగారికడ నున్న అజ్ఞాతలిపిలోనున్న జేసుఋరాతి ముద్రయుంగరమును గూడ విశేషవిమర్శార్హములే యని మనవి చేయుచున్నాడను. విజ్ఞులీపరిశోధనము సాగించి వాస్తవికాంశములను ప్రకటించునట్లు భగవంతు డనుగ్రహించుగాక.

శ్రీ నరసింహముగారు శాసనమందలి కాలనిర్ణయ మొనర్చు అంకెలవిషయమును విమర్శించుచు "అంక

లను వాడుచు ౧౦౦, ౮౦, ౫ అని మూడు వేర్వేరు అంకెల నిచ్చెను. నూరును తెలుపుట కొక గుర్తును, ఎనుబదిని తెలుపుట కొక గుర్తును, అయిదును తెలుపుట కొక గుర్తును వాడుకచేయుటలో నొక విశేషము కనబడుచున్నది. ఆకాలమున అంకెల విలువ స్థానమును బట్టికాక ప్రత్యేకము వానియందుండు విలువను బట్టియే వ్యక్తమగుచుండును. అనగా నా కాలమున దశాంశపద్ధతి వాడుకలో లేదు, అప్పటి కా పద్ధతి కనిపెట్టబడలేదు” అని వ్రాసి చివరకు “దశాంశపద్ధతి, అనగా అంకెలకు స్థానమును బట్టి విలువను నిర్ణయించు పద్ధతి హిందూ గణితశాస్త్రమున చేర్పకమునుపే యీశాసనము పుట్టినదని రూఢిగ చెప్పనగును” అను సిద్ధాంతమును బ్రకటించిరి.

ఈ సిద్ధాంతము సరికాదేమో యని నేను సంశయించుచున్నాను. హస్తివర్మ, ఇంద్రవర్మ, దేవేంద్రవర్మ మొదలగువారి శాసనములందు దశాంశపద్ధతియే కలదు. ఈశాసనము ముందుదియు, తక్కినవి దరువాతివియు నన్నచో వానికిని దీనికి నంతగా కాలదైర్ఘ్యము గపడకుండుటచే నీశాసనము వెలువడిన కొన్ని సంవత్సరములలోనే దశాంశపద్ధతి కనిపెట్టబడిన దనవలెను. ఇది సమంజసమా? కాక ప్రాచీనగాంగరాజు లందఱును దను యేలుబడి ప్రారంభమయిన గాంగశకమునే వాడినట్లగపడుచున్నది కాని యితర శకములను వాడినట్లగపడదు. ఒకవేళ నరసింహముగారి సిద్ధాంతము సరియైనదే యని యంగీకరింతమన్నను దానికి బాధకముగా నరసన్నపేట శాసన మొకటి కలదు. అది శ్రీ సోమశేఖరశర్మగారికడ కళింగవర్ధంతి సమయమున ముఖలింగమున నేను చూచితిని. ఆశాసనము లిపి వంకరటింకరగీతలు; భాష తప్పులతడిక. దానియందు “సహస్ర మేకశతత్రయాధికం” అని అక్షరములతో నున్నది. దీని నెట్లు సమన్వయించుట యని శ్రీ శర్మగారు పలువురు పండితుల నా సమయముననే ప్రశ్నించిరి. ఒకరును సరియగు సమాధానము చెప్పజాలకపోయిరి. శ్రీ నరసింహం పంతులుగారి యభిప్రాయానుసారము అంకెలలో ౧౦౦౦, ౧, ౩౦౦ అని వచ్చును. దానిని దశాంశపద్ధతి ప్రకారము మార్చినచో వేయిమీద పదమూడువంద లగును. ఈగణితమున కర్థమున్నదా లేదా? ఏతికమికలో చేసి శ్రమపడినచో వేయిమీద మూడువంద లనవచ్చును. అప్పుడు పదుమూడు వందలని తేలుచున్నది కదా? పదుమూడు వందల సంవత్సరములవఱకు గూడ దశాంశపద్ధతి హిందూగణితమున లేదని విశ్వసింపవచ్చునా? కావున నీయంకెల విలువ నిర్ణయమును, శ్రీనరసింహముగారి యూహయును రెండును సరిగావు. ప్రస్తుత విషయమునకు లగు నీ శాసనములు రెండును భాషయందును, లిపియందునుగూడ తప్పులతడికలే. లేఖకులు బొత్తిగా భాషాజ్ఞానము లేనివారు. దానివలన నీతప్పులు పడినవి. సామంతవర్మ శాసనమందున్నన్ని భాషాదోషములు శర్మగారు చూపిన శాసనమం దొక్కదానియందు దక్క నింకెక్కడ నుండబోవు. ఈతప్పుల తడికలవలన నంతటి మహాసిద్ధాంతములు సాధింప జూచుట కుక్కతోకపట్టుకొని గోదావరి నీదుటకుం బూను దారుణసాహసము కార్యము. కనుక నింకను వీనివిషయమున విశేష పరిశోధన మావశ్యకమనియే తోచుచున్నది. ఉత్సాహవంతులు సాధనసామగ్రి గల పరిశోధకులు ఇంకను నీప్రాంతములను బాగుగా పరిశోధించి సిద్ధాంతములను బ్రకటింపవలసి యున్నది. అంతవఱకు నెవరికి లభించిన సామగ్రిని వారు లోకమున వెల్లడిచేయుచుండుట మాత్ర మత్యావశ్యక మను తలంపుతోడనే నే నీ నాల్గుముక్కలు వ్రాసితిని గాని యొరుల వ్రాతలకు ఖండనము లాచరించుటకు గాదు. కావున సహృదయులు నా తప్పులు మన్నింతురుగాక.



  

# మహాదేవ దేశాయి

[ వ్యక్తిగుణపరిచయము ]

శ్రీ ఎ. వి. దేశికాచార్యులు

మహాదేవ దేశాయిగారి పరిచయములేని వర్ధా యాత్ర కర్పూరములేని ఆరతివంటిది. వారి జీవనము గాంధీగారితో సమగ్రముగ మిళితమైనది. గాంధీజీ రాముడైన దేశాయి లక్ష్మణుడు. భావ-రూపములు, వస్తు-చ్ఛాయలు ఇత్యాదులవంటిది వారి సంబంధము.

గాంధీజీ ఉన్నచోట మహాదేవదేశాయిని వెతుకనక్కరలేదు. దేశాయిగారు ఎల్లప్పుడును గాంధీజీని వెన్నంటి తోడునీడవలె చరింతురు. పర్ణకుటిలోకాని- ప్రవాసమునకాని, సంభాషణలలోకాని - సభామధ్యమునకాని గాంధీజీపై దృష్టినిలిపి, కలముకాగితములు పట్టుకొని ఒకవ్యక్తి కాన్పించును. అతడే మహాదేవ దేశాయి; గాంధీగారి పట్టశిష్యుడు.

## గాంధీగారి పనిపాటలకు ఆత్మసాక్షి :

మహాదేవభాయి గాంధీగారి కార్యదర్శి యనుట సుప్రసిద్ధము. కాని వీరు అందరు కార్యదర్శులవలె కాదు. యజమానుల జాబుజవాబులు, వచ్చి పోయెడివారు, లెక్కాచారము - ఇంతే వారి లోకము. మహాదేవభాయి అట్లు కాదు. గాంధీజీ వీరిని కేవలము కార్యదర్శిగా గణింపలేదు. రాజకీయమేమి ఆధ్యాత్మికమేమి, లోకాంతమేమి ఏకాంతమేమి అన్నిటియందును ఎడతెగక వారు వీరిని ప్రాణస్నేహితునివలె అనుసరింతురు. వీరు లేక గాంధీజీకి ఒక్కనాడుకూడ జరుగదు. ప్రతి కార్యమునందును వారికి దేశాయి కావలెను. సంగాతులతోటి సంభాషణ, ఎదుటివారితో సంధానము, నాయకులతో చర్చ—అన్నిటిలోను వారిపాలిటికి వీరు సాక్షిగా ఉండవలెను. గాంధీగారి పనిపాటలలో నెల్ల దేశాయి ఒక ఆత్మసాక్షి.

## వీరికి చదువుపిచ్చి ఎక్కువ :

సాధారణముగ మహాదేవదేశాయికునికి వర్ధా-మగనవాడియందు. వీరు, వీరిభార్య దుర్గాబెన్, ఒక కుమారుడు—ఇదే వీరి అర్ధసంసారము. ఇందులకిని ఒక గదిలో అర్ధభాగమైనచో వీరి ఇతర అర్ధసంసారమైన పుస్తకములకు మిగత ఇల్లంతయు కావలెను. ఎక్కడ చూచినను వీరిఇంటినిండ పుస్తకములే. మహాదేవభాయికి చదువు పిచ్చిఎక్కువ. ఎప్పుడును చదువుచునే ఉందురు, ఇది అది అనక అన్నిటిని చదివెదరు. వీరి పుస్తకభాండాగారము అమూల్యమైనది. ప్రపంచమందలి ముఖ్యమైన ఆంగ్లగ్రంథకర్త లందరును తమపుస్తకములను దేశాయిగారి సంగ్రహార్థము మిక్కిలి సంతోషముతో పంపుచుందురు. ఇతర భాషలవికూడ వచ్చుచుండును. వీరు దేనినిగాని విడువకుండ చదివెదరు. అర్ధరాత్రివరకు దీపము వెలిగించుట వీరికి అలవాటైపోయినది.

చదివిన దంతయు జీర్ణించుకొని వ్రాతలలో ఉపయోగించు చాతుర్యము వీరి కెక్కువ. 'హరిజన్' లో M. D. (యమ్. డి.) అను పేరితో వచ్చు హృద్యమైన గద్యము వీరిదే. ఇంగ్లీషుశైలిలో M. D. గారిదొక విశిష్టస్థానము. నిరాభరణసుందరివలె శైలి సరళమధురమైనది. ఆ లేఖనములలోని దృష్టాంత

ప్రమాణములను చూచినయెడల వీరి ఈ అగాధపాండిత్యము తెలియవచ్చును.

గాంధీజీకిని, వీరికిని ఈ విషయమున కొంచన గంగ, కన్యాకుమారుల కున్నంత అంతరము. గాంధీజీకి అతిగా చదువుట గిట్టదు. ముఖ్యమైనవి- అగత్యమైనవి చదివిన చాలును. మిగత అంతయు చెరుకుపిప్పి అని వారి అభిప్రాయము.

## బాస్వెల్లునితో పోలిక :

ఇంగ్లాండులో జాన్సన్ అను సాహిత్యవేత్తకు బాస్వెల్ అనునొక స్నేహితు డుండెను. అతడు జాన్సన్ని జీవితసందర్భములను ఆయాదినమే వ్రాసియుంచి తరువాత తన స్నేహితుని జీవితచరిత్రను విస్తారముగ వ్రాసి జరిగినది జరిగినట్లు వర్ణించెను. చిత్రగుప్తునివలె చిత్రించిన ఇట్టి జీవితచరిత్రము మరెందును కానరాదు. మహదేవదేశాయి బాస్వెల్లుని త్రోవ తొక్కిరి. వీరు దినదినమును గాంధీజీవితమును చిత్రించుచున్నారు. "బాస్వెల్లును మీరుచున్నాడు మహదేవుడు." (*He is out-Boswelling Boswell himself*) అని గాంధిగారే ఒకప్పుడు నుడివిరి.

ప్రతిదినమును తపాలువచ్చిన తరువాత దానితో సేవాగ్రామమునకు దేశాయిగారు పయనము కావలసినదే — వానరానీ, చలియుండనీ, ఎండ మండనీ, బురదనిండనీ. ఈ అయిదారుసంవత్సరము లిట్లే జరిపిరి. ఇట్టి ఉగ్రతపస్సు ఏనాయకుని ఏకార్యదర్శికిని సాధ్యముకాదు. దేశాయిగారి అసాధారణశ్రద్ధ, గాంధీజీయందు వీరి గాఢనిష్ఠ, వారి సేవలో వీరు పొందు ఆనందము 'న భూతో న భవిష్యతి.' గురువుకొఱకును, పెద్దలకొఱకును తమ యావజ్జీవితమును ధారపోసిన ఇట్టి పుణ్యశ్లోకులు మానవ ఇతిహాసములోనే అరుదు. అందును ఈకాలమున ఆ కీర్తి, ఆ ధైర్యము వీరికే చెల్లును.

## 'పిడుగు రాముడు':

మహదేవదేశాయి గుజరాతీ. కాలేజీలో పిడుగు రాము డని పేరుపొందిన విద్యార్థి. గాంధీజీ దక్షిణ ఆఫ్రికానుండి ఆ సమయమునకు రాకుండినచో వీరు ప్లీడరీలో పేరుగాంచి శ్రీమంతు లై యుందురు. దైవము వీరికి అందుకు తగిన అనుకూలముల నొసగియేయుండెను. కాని ఆబంధనము, ఆ సారరహితస్వార్థజీవనము వీరి కెట్లు రుచించును? గాంధీజీ గుజరాతుకు వచ్చినవెంటనే వీరు ఆ గుంపులో చేరిరి.

## అగ్నిపరీక్షలో అమరత్వసాధన :

గాంధీగారి సహవాసము సుఖమైనది కాదు. వారి కఠోరనియమములు జీవితమును సుఖవిలాసముల పైపు పోనివ్వవు. కర్తవ్యమే సౌందర్యము, ఆనందము నగెడి దృష్టి వారిది. వారితో ఉండుట కంటకశయ్యపై పరుండినట్లే. "నా సహవాస మెట్టిదో ఎఱుగుదువుగదా? ఉరికంబమెక్కు సందర్భ మెప్పుడును రాకపోవచ్చును. కాని సింహాసనము నెక్కునట్లు, నీ కచేరీకుర్చీపై కూర్చుండునట్లు గడియగడియకును దాని నెక్కుటకు సంసిద్ధుడవై యుండవలెను." అని గాంధీజీ ఒక శిష్యునికి వ్రాసియుండిరి. ఎందఱో ఈ కంటకకిరీటధారణమునకు వెనుదీసిరి. మహదేవదేశాయికేమో ఈ అగ్నినారాయణుని అంచున నుండియే బ్రతుకవలసి యున్నది. వీరు ఈ అగ్నిపరీక్షలో అమరతను సాధించుకొన్నారు. అయినను తమ రెక్కలను కాల్చుకొనలేదు.

## 'హరిజన్' నిర్వహణలో ఇతని పాలు :

ఇరువది సంవత్సరములుగ వీరు అవిశ్రాంతముగ గాంధీగారి సేవ చేయుచున్నారు. మొదట 'యంగ్ ఇండియా', ఇటీవల 'హరిజన్' ఈరెండు పత్రికలను గాంధీజీ నడపినది వీరి బలముతోనే. అవి అన్నిపత్రికలవలె వట్టి వార్తాపత్రికలు కావు. అవి పదుగుర అభిప్రాయసంగ్రహమే కాదు, ఒక సాత్త్వికసందేశసంగ్రహము; గాంధీజీ రాష్ట్రనిర్మాణకార్యమున ఈ ఇరువది సంవత్సరములుగ దేశమునకు, దేశాభిమానులకు వారవారము నొసగు పాఠము. తమ సిద్ధాంతములను జనులకు తెలుపుటకు గాంధీజీకి అవి సాధనములు. ఈ కార్యమున మహదేవదేశాయి, ప్యారేలాల్ ఇద్దఱును గాంధీజీకి నెరవగుచున్నారు. మహదేవదేశాయి ప్రతివారమును గాంధీజీవితమును ముద్దుగా చిత్రించుచు జనులకు వారియందు అపారభక్తిని కలిగించిరి. తమ అత్యంత

మనోహరమైన శైలిలో గాంధీగారి సిద్ధాంతములను వివరించి జనులకు రుచించునట్లు చేసిరి. నిజముగ దేశాయిగారి కైవాడము లేని 'హరిజన్' కొంచెము చప్పిడియగునేమో! గడచిన సంవత్సరము వీరు జబ్బుపడి వర్ధానుండి సిమ్లాకు ఆరోగ్యమునకై వెళ్లినపుడు గాంధీజీకి చాలకష్టమయ్యెను. 'హరిజన' సంపాదకీయమున "ఇందువలన కలిగెడి లోపములను మన్నింపవలె" నని కోరిరి. 'హరిజన్' నిలిచినను నిలిచిపోవచ్చుననిరి.

### పత్రికా వ్యవసాయములో ప్రారంభించిన క్రాంతి :

పత్రికావ్యవసాయమున ఈ గురుశిష్యు లిద్దఱును చేరి చేసిన క్రాంతి అనుపమానమైనది. ఇతిహాసములోనే ఇట్టిది జరుగలేదు. సంపాదకీయమును 'నేను' అని ఉత్తమపురుషఏకవచనమున వ్రాసినది గాంధీగారే. ఇంకను దాని ననుకరించు ధైర్య మెవ్వరికిని కలుగలేదు. కేవలము ఒక వ్యక్తి అభిప్రాయమునకై ఎచ్చటను పత్రిక వెల్వడలేదు; వెలువడు సంభవమును లేదు. మహాదేవభాయివలె తన గురు-నాయకుని జీవితమును దినదినమును చిత్రించుచున్నవారు లేరు. పత్రికావ్యవసాయమున సత్యసంయమములను జేర్చి దేశాయి ఒక్క మాదిరి అయిరి. తరుణులకు ఆదర్శులైరి. గాంధీజీ ఒకసారి ఇట్లు వ్రాసిరి: "కలము చేతబట్టియే కడపటి గడియకూడ గడపుటకు దేశాయి సదా సిద్ధుడు." దీనికన్న మేలైన దేశాయిగారి వ్యంగ్యచిత్ర మెవ్వరును వ్రాయజాలరు.

### సాహిత్య సంపన్నత, కళాహస్తము :

మహాదేవభాయి వట్టి గొడ్డుపండితులు కారు; కేవలము లేఖకులే కారు, మంచి రసికులు. వీరిది కళాహస్తము. సాహిత్యమున వీరికి చాల ప్రీతి. వీరు ఇంగ్లీషు, సంస్కృత, హిందీసాహిత్యమునుండి అప్పుడప్పుడు సొగసైన వచనముల నుదాహరింతురు. ప్రార్థనలో గీతములను చక్కగా పాడుటకు తగిన మంచి శారీరము వీరిది. అర్థశాస్త్రము, వేదాంతము మున్నగు విషయములను ఒలిచిన అరటిపండువలె వివరించుటయందు వీరికి మంచి నైపుణ్యము. అది వీరి ప్రత్యేకకళ. వీరి లేఖిని యొక్క యక్షదండము. దానిలో ఒకవిధమైన ఇంద్రజాల మున్నదనిన అతిశయోక్తి కానేరదు.

మహాదేవదేశాయిగారి జీవితమునందును గొప్ప కళ యున్నది, కేవలసాహిత్యముననే కాదు. వీరు గాంధీయులు. జీవితమున లీనము కాని కళ వీరికి కళ కాదు. సజ్జితమైన వీరి గదిని చూచిన ఇది అర్థమగును. అంతటా చొక్కటము! నీటు!! పదార్థము లన్నియు తమతమ స్థానమున నుండును. వీరు చదివి ముగించిన పుస్తకము ఎవ్వరును తాకలే దనిపించునంత సరిక్రొత్తగ నుండును. వేషమున శుద్ధమైన తెల్లనిఖాదీ. మాటలలో తేనె. పొరబాటుననైన మాసినబట్ట తాకరు. కటువుగ మాటలాడరు. హితముగను, రుచికరముగను మాటలాడి ఎదుటివారితో తమ అభిప్రాయము 'సరి' యనిపించుకొను తర్కచాతుర్యము గలవారు.

ఈపట్టే వీరిని గాంధీగారి దూతగ చేసినది. దేశాయిగారి సంధానకౌశలము హిందూస్థానమునకు తెలిసియేయున్నది. సరదార్ పృథ్వీసింగువిడుదల, ఢిల్లీ రాజకీయఖైదీల స్వాతంత్ర్యములు వీరి ప్రయత్నఫలములే. నైయక్తికరాష్ట్రీయజీవనము లందు వీరి నైపుణి ఎట్లు పరిణామకారి యైనదో తెలియుట కష్టము.

### ఆత్మనిరీక్షణ :

వీరి జీవితమునకు వన్నె తెచ్చిన ఈకళకు వీరి స్వావలంబన, ఆత్మనిరీక్షణములే పునాది యనవచ్చును. దేశాయి అన్నిపనులను స్వయముగ చేసికొందురు. తమ బట్టపాతలను తామే ఉతుకుకొందురు. తమగదిని తామే శుభ్రపరతురు. వస్తువులను యథాస్థానమున కూర్తురు. దుర్గాబెన్ ఉండినను ఈకార్యక్రమమున ఏవ్యత్యాసమును ఉండదు. ఆత్మనిరీక్షణము గాంధీయులకు ఒక లక్షణమైనను దేశాయి ఒకఒర ఎక్కువ. వీరివద్ద ఎప్పుడును ఒక నిఘంటువు (Dictionary) ఉండియే తీరవలెను. ఎక్కడ ఏశబ్ద మెక్కువగునో; దానిని మరింత రుచికరముగ చేయగలిగిన ఏల చేయరాదో తూనికచేయు స్వభావము వీరిది.

### ఆడంబరము నెరుగని సరళత :

సరళత వీరి వ్యక్తిత్వమున నొక అలంకారము. హిందూస్థానమునకే కాదు కొంతవరకు ప్రపంచమునకు

గూడ వీరిది కేంద్రకార్యాలయము. అయినను కుర్చీ లేదు, బల్ల లేదు. వీరికి కార్యాలయ మొకటి, ఏకాంతగృహ మొకటి అని వేఱుగ లేవు; రెండును ఒకటే. నేలపై అచ్చటనే తయారైన ఒక చాప. చుట్టును పత్రికలు, పుస్తకములు. ఒకమూల రాట్నము. ఎదురుగ మొరడైన బీరువలు; వాటినిండ పుస్తకములు, కాగితములు. వీరి కంటి అద్దములు నిక్కలుకట్టుది. అదియు రాయల నాటిది.

## వైరస్యములేని దాంపత్యము :

ఇక దుర్గాబెన్ విషయము పరికింపుడు. ఆమె నేటికిగూడ సనాతని. గాంధిగారి అనేక సంస్కరణము లామెకు నచ్చవు. మహదేవభాయి హరిజనవిషయ ముతో చేయదలచిన ఆచరణలు ఆమెకు యుక్తము లని పించవు. కాని వీరి దాంపత్యమున రవంత యైనను విర సము లేదు. తన ఇచ్చవచ్చినట్లు నడచుట కామెకు స్వాతంత్ర్య మున్నది. దేశాయి ఈ విషయమున గాంధీ యులకే ఆదర్శకులై యున్నారు. గాంధీజీ కూడ కస్తూరిబాయికి ఇంత స్వాతంత్ర్య మిచ్చియుండలే దేమో యనిపించును.

## గురుశిష్యుల మధ్య తగాయిదా :

కొంతకాలముక్రిందట దేశాయి సంసారసమే తముగ ఉత్కలమునకు వెళ్ళియుండిరి. జగన్నాథ క్షేత్ర మక్కడనేకదా, దేవుని దర్శనము చేసి రావలె నని దుర్గాబెన్‌కు ఆశ. కాని, ఆమందిరమున గాంధీయు లకు ప్రవేశము లేదు. హరిజనులకు ప్రవేశము లేని దేవాలయములందు కాలిడనని రామేశ్వరమున గాంధీజీ ప్రతిజ్ఞచేసిన నాడే గాంధీవాదుల కది యొక సంప్రదాయ మయ్యెను. దేశాయికి చాలచిక్కు వచ్చెను. తమ ఆజీవితాంత సహచరికి తా మిచ్చు సుఖము చాల తక్కువ. ఏదియు కోరు స్వభావ మామెకును లేదు. ఆమెతృప్తికొఱకై వీరు జగన్నాథదర్శనము చేయిం చినచో బాపూజీ నొచ్చుకొనుట నిజము. గాంధీవాదు లందరును ఎత్తిపొడుచుట స్వతస్సిద్ధము. తుదకు దేశాయి గారి సమరసజీవన - కళాతత్వములకే జయమయ్యెను. సత్య అహింసలను వీరు క్రొత్తఫక్కిగ జూపిరి,

ఉత్కలమునుండి మరలివచ్చిన తరువాత ఇది యొక దురంతప్రకరణ మయ్యెను. మహదేవునివంటివారే ఇట్లు చేసిన గాంధీవాదముగతి ఏమి యను అంపు మొద లయ్యెను. వీరు చేసినది గాంధీజీకి రుచింపలేదు. ఒక నాడు కొంచె మెక్కువగనే చీవాట్లుపెట్టిరి. వెనుక ఎన్నియోమారులు గాంధీజీ శిష్యుని కటువుగ విమర్శించి యుండిరి. కొన్నిసారులు సత్యాగ్రహము చేసినదికూడ నిజమే. ఒకప్పుడు ఉపవాసముకూడ చేసియుండిరేమో! అన్నిటిని భాయి ఆశీర్వాద - ప్రసాదము లని శిరసా వహించి తమగతిని దిద్దుకొనియుండిరి. అప్పుడు తాము చేసినది తప్పు; తెలియక చేసిన పని. ఇదిమాత్రము తాము తెలిసిచేసిన సత్యకర్మ. గాంధీగారితో తమది యుక్త మని వాదించిరి. ఇద్దఱికిని అభిప్రాయములు కుదర లేదు.

మహదేవభాయి చాల క్రుంగిపోయిరి. గురుచరణ ములను కన్నీటితో తడిపి వర్ధాకు వెనుదిరిగిరి. దుర్గా బెన్ వీరికై వేచియుండెను. ఆనాడే గాంధీజీకి భాయి గారి రాజీనామా చేరెను.

కావ్యనాటకములయందును కానరాని ఘట్ట మది. కల్పనయొక్క చిరుచేతుల కందని సత్యవృత్త మది. నిజముగ సత్యమున కున్న చవిచాయలు కల్పనకు మీరినవి.

గురుశిష్యుల నడుమ ఒక అగ్నిపరీక్షయే జరిగెను. "దైవచిత్తమునకు ఇది చాలు ననిపించిన నేను మాత్రము చేయున దేమి? గురుసేవ, తద్ద్వారా దేశసేవ ఈ ఇరువది సంవత్సరములుగ చేయించినది ఆదైవమే. 'నేటికి నీపని ముగిసినది' అని ఆదైవమే అనిన నాకు దుఃఖమెందుకు?" అని దేశాయిగారు చింతించిరి. "దేవుడు రాయి అయినచో భక్తు డుపాషాణము కావలెనా? ఇదెక్కడి న్యాయము?" అని గాంధీజీ విచారించిరి.

## శుభావసానము :

తుద కిద్దఱును ఓడిరి; ఓడి గెలిచిరి. గాలి మార్పునకై మహదేవభాయి సిమ్లాకు పోవలసివచ్చెను. పోవుటకు ముందు రాజీనామా కాగితపుముక్కలు నేగాంపోలములలో ఎగిరిపోయి దాగికొనెను,

మహాదేవదేశాయి గాంధీజీకి లక్ష్మణుడు, ఆత్మసాక్షి అనినది అతిశయోక్తి కాదు. సామాన్యముగ గురుశిష్యుల సంబంధము ఇనుము-అయస్కాంతముల వంటిది. వీరిది అట్లు కాదు; పరస్పరమైన ఆకర్షణము. వారివంటి గురువు దొరికినది వీరి భాగ్యవిశేషమైన, వీరివంటి శిష్యుడు లభించినది వారి పుణ్యఫలము. రామకృష్ణపరమహంసుల తపస్సర్వస్వమును పేల్చి ఆచార్యుని వెలుగునకు తెచ్చిన వివేకానందస్వామి శిష్యత్వాదర్శమును ప్రపంచమునకు చూపిరి. మహాదేవభాయి గురుజీవనమున తమ జీవనమును లీనముచేసి, వారి శ్రుతికి తమ ధ్వనిని మేళవించి, వారికుంచికకు తమచన్ను నొదిగించి రసమయస్నేహముయొక్క ఆదర్శచిత్రమును ప్రదర్శించుచున్నారు.

[కన్నడమునుండి]



కుర్తాలము జలపాతము

# బిడ్డల భయకారణాలు

బిడ్డలకు భయాలు పుట్టుకతో పుట్టవు ; మనము పుట్టించేవే.

శ్రీ బి. కుప్పుస్వామి

భయము అనేది విచారము, సంతోషము, క్రోధము మొదలగువానివలె ఒక భావోద్రేకము. ఇది పుట్టుకతో వచ్చినదికాదు.

అయిదారుసంవత్సరములవయస్సుబిడ్డలను మనము గమనించినయెడల వారిలో ఎన్నియో భయములు కనబడును. రాత్రిళ్లు చీకటిగదిలోకి వెళ్లి తన కుర్చీని తెమ్మన్న "నాకు భయము. నేను వెళ్లలే"నని చెప్పును. జూ (zoo) లోకాని, మ్యూజియంలోకాని మృగములను చూచినయెడల కటకటాలదగ్గఱకు వెళ్లుటకుకూడ భయపడును. భిక్షువా రెవరైనా ఇంటిముందు వచ్చి అఱచినయెడల 'అమ్మా' అని లోపలకు పరుగెత్తుకొని వచ్చును. పిల్లులూ కుక్కలనుచూచినప్పుడుకూడ చాలామంది భయపడి వాటిదగ్గఱకు పోరు.

కాని ఏడాది, రెండేళ్లబిడ్డనడవడికను జాగ్రత్తతో చూచినచో దానికి చీకటిభయము లేక ఇంట్లోనూ, ఇంటిచుట్టూనూ తిరుగును. జూయందు మృగములను చూచిన చప్పట్లువేస్తూ, గంతులువేస్తూ, వాటిబోనుల దగ్గరకివెళ్లును. ఏకుక్కను చూచినా భయములేక దాని దగ్గఱ ఆడుటకు పోవును. ఈ వయస్సునందు భయము బిడ్డకు కాదు—తల్లికి. తల్లులు తమబిడ్డలకు ఎక్కడ హాని కలుగునో యని భయముతో సదా వారిని చూచుచుందురు.

చిన్నతనమున లేని భయములు నాలుగైదేళ్లు వచ్చేసరికి ఎట్లు కలుగు నని మనశ్శాస్త్రకారులు ప్రయోగముల మూలమున చాలవఱకు పరిశీలించి, భయమన నెట్టిదో, అది ఎట్లు కలుగునో, దానిని ఎట్లు కలుగకుండ చేయవచ్చునో తెలుసుకొనిరి.

కాలిఫోర్నియా యూనివర్సిటీయందు మేరీ జోన్సు అను విద్యావతి ఒక ఆరడుగులపామును పట్టుకొని, దానిని చూచి బిడ్డలూ, పెద్దవారూ ఏరీతిగా ప్రవర్తింతురో చూచెను. ఆపాము హానికరమైనది కాదు. కాని చాలాచురుకైనది. ఏడాది రెండేళ్లపిల్లలు ఎట్టి భీతియులేక దాని దగ్గఱగా వెళ్లి, దానిని పట్టుకొని ఆడుటకు ప్రయత్నించిరి. కాని నాలుగైదేళ్ల వాళ్లు దానిని ముట్టుటకుగాని, లేక దాని దగ్గఱగా వెళ్లుటకుగాని జంకిరి. ఇంకా పెద్దవాళ్లు ఆ పేరు విన్నంత మాత్రాననే దానిని చూచుటకు కూడా భయపడి పెద్దవారివలె పారిపోయిరి.

వాట్సన్ అను అమెరికాదేశపు మరియొక మనశ్శాస్త్రజ్ఞుడు ఈసంగతినే కనిపెట్టుటకు ఒక పెద్ద ప్రసవఆస్పత్రికి వెళ్లి అప్పుడు పుట్టినబిడ్డమొదలు రెండేళ్లవయస్సుదాటిన బిడ్డలవఱకూ వారి వారి మనోభావములను పరిశీలింపగా, అప్పుడు పుట్టిన బిడ్డకు భయమనేదే లేదనీ, మొదటిమాసములో ఎప్పుడో ఒకొక్కప్పుడు భయచిహ్నములను చూపుననీ, రెండు మూడుమాసములలో ఏదైనా పెద్దచప్పుడు అయితేనో, లేక పట్టుతప్పిపోతేనో, లేక నొప్పికలిగితేనో భయపడుదురనీ గ్రహింపగలిగెను. మొదటిసంవత్సరమంతా ఈనాలుగు కారణాలచేతనే కాని వేరు ఏకారణాలచేతనూ బిడ్డలు భయపడరు. కాని పెరుగుతూవున్నకొద్దీ

భయములు ఎల్లా కలుగుతాయనిన, కొన్ని కొన్ని సన్నివేశములందు భయముకలుగవచ్చు. వానికే 'కండిషన్డ్ రిఫ్లెక్సు' అని ఇంగ్లీషులో అంటారు. ఈకండిషనింగ్ అను సిద్ధాంతమును పావ్‌లావ్ (Pavlov) అనుగొప్ప రష్యాదేశపు వైజ్ఞానికుడు కనిపెట్టెను. ఒకనా డతడొక ఆకలితోవున్న కుక్కను చూచెను. అది మధ్యాహ్న సమయమున తనకు భోజనముపెట్టుమనుష్యుని చూచి తోకాడించి గంతులువేసెను. ఆకుక్కకు భోజనము పెట్టు మనుష్యుని చూచినంతనే ఆకలి కలిగెను. ఇది చూచే పావ్‌లావ్ 'కండిషనింగ్' అను సిద్ధాంతమును కనిపెట్టెను. ఇంకొక చిన్న ఉదాహరణము. మన వ్రేలు గంటకొట్టిన ఆడగలదా ? కాని దానికి చిన్న ఎలెక్ట్రిక్ షాక్ ఇచ్చిన ఆడును. ఈషాక్ ఇచ్చుటకు ఒక్క క్షణము ముందు గంట కొట్టికొట్టి, షాక్ ఇస్తే వ్రేలు అల్లాడును. ఈరీతిగా ఇరవైముప్ఫైసార్లు చేసినతరువాత గంటకొట్టిన మాత్రాననే వ్రేలు అల్లాడును.

ఇదే రీతిగా మొట్టమొదట బిడ్డకు భయము రావలెనన్న ఏపెద్దచప్పడో, లేక పట్టు తప్పిపోవటమో, లేక బాధకలగటమో ఏదైనా కలుగవలెను. దీనితోపాటు ఏదైనా ఇంకొకటి కలిగితే ఈ రెండవదే భయానికి కారణమగును. ఒకచిన్నబిడ్డ ఒకకుక్కతో ఆడుతూవున్నసమయంలో అది హఠాత్తుగా మొరిగిన యెడల ఆబిడ్డ భయపడును.

ఈభయము కుక్కనుంచి కలిగినదికాదు. కాని ఆభయము కలుగు సందర్భంలో కుక్కవుండటంనుంచి కుక్కను చూస్తేనే భయము కలుగును. ఒక కుక్క కాకుండా, కుక్కమాదిరి ఏజంతువును చూచినా బిడ్డ బెదరును. బిడ్డలు నీటిని చూచి వెఱచుట, చీకటిని చూచి భయపడుట, భిక్షువాళ్లను చూచి భయపడుట, వురుములు మెరుపులను చూచి భయపడుట మొదలైనవన్నీ ఇల్లాగా చిన్నప్పుడు ఒక్కొక్క సందర్భంలో కలిగినవిగానే వుండవచ్చు. చిన్నబిడ్డ చీకట్లో తిరిగితే తల్లి భయపడి కేకలు వేస్తుంది. ఆకేకలవల్ల బిడ్డకు చీకటి భయము కలుగుతుంది. పిల్ల నిద్రపోకపోతే "బూచాడు వస్తాడు" అని బెదిరిస్తాం. అది చాలాతప్పు. అందుచేతనే ముష్టివాళ్లను చూస్తేనూ, మాధవకబళపువాళ్ల కేకలు వింటేనూ బిడ్డ బెదిరిపోవును. కావున బిడ్డలభయములు పుట్టుకతో వచ్చినవికావు. మన అజాగ్రత్తవలననూ, అవివేకముచేతనూ కలిగేవి.

బిడ్డలు క్రొత్తవారిని చూచి బెదరుదురు. అది క్రొత్తచేత. బిడ్డను పెంచువారు వేటిని చూచి భయపడుదురో బిడ్డలూ వానినే చూచి బెదరుదురు. ఇది ఒక విధమైన అంటురోగములాటిది. మరియు బిడ్డలుగా వుండునపుడువచ్చిన భయములు చచ్చేవఱకూ వుండిపోవును. అందువలననే పెద్దవారు చాలా జాగ్రత్తతో మెలకువతో పిల్లలవద్ద ప్రవర్తించవలెను.

అయిదేళ్లలోపుబిడ్డలభయములకు కారణము లేవనగా చప్పుడు, మృగములు, క్రొత్తమనుష్యులు, క్రొత్త స్థలము, పడిపోవుట.

అయిదేళ్లనుండి పన్నెండేళ్లలోపువారికి భయకారణములు దెయ్యాలు, పిశాచాలు, శవాలు, పిడుగులు, మెరుపులు మొదలైనవి. నూటికి ఇరవైవంతులు ఇవే కారణాలు. కొంతమంది మృగాలను చూస్తేనూ, చీకటిచూస్తేనూ, క్రొత్తస్థలాలూ నీళ్లూ చూస్తేనూ కూడా భయపడుతారు.

దేహహాని పుట్టిన బిడ్డకు అన్నిభయాలకూ కారణము. కాని బిడ్డ పెరిగినకొద్దీ ఈకారణము నూటికి తొంభైవంతులు తగ్గిపోవును. మీజీవితంలో ఎక్కువ వుపద్రవమైనది ఏది అని బడిపిల్లలను అడిగినచో నూటికి డెబ్బయిపాళ్లు దేహహాని అంటారు. కాని భయాని కది నూటికి పదిపాళ్లే కారణం. అయిదేళ్లు దాటిన తరువాత నిజప్రపంచఘటనములు, వస్తువుల భయము కంటెను కల్పనాప్రపంచవస్తువుల భీతియే హెచ్చు. ఈలాగు పెరుగుతూ పెరుగుతూ బిడ్డలు అవాస్తవకారణాలకు భయపడుదురు. ఈ భయములు జీవితమునకు వికాసము నివ్వక మనలను అశక్తులనుగా చేయును.

పిల్లలకు సాధ్యమైనంతవఱకూ భయము కలుగనివ్వకుండా వుండుటకు తల్లిదండ్రులూ, చుట్టుపట్టుల నుండువారూ అతిజాగ్రత్తతో మెసలుకోవలెను. తమ భయచిహ్నములను బిడ్డలకు చూపకూడదు. వారు కుక్కలతోనూ, పిల్లులతోనూ ఆడుతూవున్నప్పుడూ,

చీకటిలో తిరుగునప్పుడూ, నీటిదగ్గఱకు పోవునప్పుడూ వారిని జాగ్రత్తగా చూచుకోవలెను కాని గట్టిగా కేకలువేసి అరవకూడదు. వర్షమూ, గాలీ వస్తే తలుపులుకొట్టుకొని పెద్ద శబ్దం కాకుండా తలుపులూ, కిటికీలూ జాగ్రత్తగా మూయవలెను. భయముకలిగినచో ఆ భయమును పోగొట్టుటకు వారికి అనుగుణమైన సందర్భములను ఏర్పరచవలెను. ఒక చిన్న ఉదాహరణము: ఒక పిల్ల ఎలుకంటే భయపడేది. ఎలుక పేరు చెప్పితే ఏడ్చేది. ఆ భయము పోగొట్టటానికి ఒకనాడొక ఎలుకను పట్టుకొని, తండ్రి పిల్లనెత్తుకొని, దానికి మంచిమాటలతో ఎలుకకు కాళ్లు నాలుగనీ, తోక ఉందనీ, ముక్కు ఉందనీ చెప్పి ఆడించి మెల్లిగా ఆపిల్లభయాన్ని తొలగించాడు. అదే విధంగా బిచ్చపువాళ్లన్నానూ, మరేజంతువైనానూ వారి భయమును పోగొట్టవలెను. పిల్లలు పడిపోయిగాని, ఏదైనా పగలగొట్టిగాని భయపడివున్నప్పుడు వారిని కొట్టకూడదు.



# ద్రౌపది

(౬౮౮-వ పుట తరువాయి)

పుత్రశోకానలంచేత అతన్ని దగ్ధంచేయదూ? స్వయంగా కరవాలాన్నైనా ధరించి, అతన్ని ముక్కలుముక్కలుగా ఖండించి కాకులకూ, గ్రద్దలకూ వేయడానికి పెనుదీస్తుందా? కడకు అతని రక్తాన్ని దోసిటితో త్రాగి, గర్భాంతరశోకాగ్నిని చల్లార్చుకోవడానికి గూడా సాహసిస్తుంది. అంత చండప్రచండురాలు! పోతన్న ద్రౌపదికళ్లల్లో నిర్మల మైన శాంతిరసం తొలుకాడుతూవుంది. ఆమె అశ్వత్థామను ఆ పాదమస్తకం పరీక్షించింది. మెరుపులాగా ఆమె మనోవీథిలో పుత్రవియోగదుఃఖితయైన అశ్వత్థామ తల్లి గోచరించింది. కుమారుణ్ణి బంధించి పట్టుకుపోయారని ఆమె కన్నీరు మున్నీరుగా ఏడుస్తూవుంది. పుత్రశోకం అందరికీ ఒకటేగదా! కాకిపిల్ల కాకికి ముద్దు. ద్రౌపది తన పుత్రశోకాన్ని తాత్కాలికంగా మరచి, కృపిశోకాన్ని జూచి, సానుభూతితో రెండశ్రుకణాలను రాల్చింది.

నన్నయచేతిలో మెలగినప్పటి బాల్యమూ, తిక్కనచేతిలో మెలగినప్పటి యౌవనమూ, ప్రౌఢాత్వమూ, మనస్త్రీవతా నశించి, పోతనచేతిలోకి వచ్చేసరికి వయోభారం నెత్తిన పడి, ఆమెమనసు భక్తి, కరుణారసప్రపూరిత మయింది. ఆమెయందలి ప్రతీకారవాంఛను చంపేశాడు కవి. అతిదీనురాలిని చేసి, ఆమెచేత హితోపదేశం చేయించాడు అశ్వత్థామకు.

"నాయనా! మా మగవార లందరూ మీ తండ్రి దగ్గర విలువిద్య నేర్చుకున్నారు. "ఆత్మావై పుత్రనామాఽసి" అనే సూత్రప్రకారం నీవు సాక్షాత్తూ ద్రోణుడివి. "కరుణాసంగములేక శిష్య సుతులన్ ఖండింపగా పాడియే!" తండ్రీ! శిశుమారణం ఆసురకృత్యం గదా! అలా చేయడం ధర్మమేనా! నీవు భూసురుడవు. బుద్ధ దయా భాసురుడవు. ఈవిధంగా చేయడం నీకుతగునా?" అని వాపోయింది. ఎంతటి పాషాణ హృదయమైనా ఆమూర్తిని చూస్తే కరిగి ప్రవహించవలసిందే! ముందు వెనుకలు చూడక, అంతటి ఘాతుక కృత్యాన్ని చేసిన అశ్వత్థామకే కన్ను తడి అయింది.

"నాకుమారులు యుద్ధానికి రాలేదుగదా! నీ కేం ద్రోహం చేశారు? నిద్రబోయే బిడ్డలను చంపడానికి నీచేతు లెట్లాడాయి?" అని అతనిహృదంతరంలో ప్రతిధ్వనించేలాగా పలికింది.

తిక్కనచేతిలో ద్రౌపదికి ఒకరిని చంపించడమంటే బహుసరదా! రక్తమంటే ఆమెకు మంచినీళ్ల ప్రాయం. అలాంటి ద్రౌపది పోతనచేతిలో ఆ శౌర్యాన్ని కోల్పోయింది. రక్తాన్ని చూడలేదు సరిగదా, ఒకరు మరొకర్ని చంపారని వింటే ఆమెమనస్సు తల్లడిల్లుతుంది. "నిద్రాసక్తుల సంహరింప చేతు లెట్లాడాయి" అనేటంత పాపభీతి ఆమెలో పాదుకుంది.

పోతన్నలోని ఔత్కృష్ట్యం అంతా యీఘట్టంలోనే కరుడుగట్టి ఉందని చెప్పవచ్చు. ద్రౌపది క్షత్రియ స్త్రీ. దానికిదోడు అయిదుగురు కుమారులు ఒక్కమారు చంపబడ్డారు. పుత్రఘాతియైన అశ్వత్థామ తనయెదుటనే నిలబడిఉన్నాడు. అతని ప్రాణం తనపిడికిట్లో ఉంది. తాను క్షమిస్తే బ్రదుకుతాడు, లేకుంటే అతని జీవితానికి అదే ఆశ్వాసాంతం. ఇలాంటిసమయంలో సానుభూతి కలగడం దుర్లభం.

ద్రౌపది ఉన్నస్థితిలో ఆమెయందు సానుభూతిని వ్యక్తీకరించాడంటే ఆకవిని మేరువు నెక్కించవచ్చు. పోతన్నకీర్తి ఆచంద్రార్కంగా ఉండడానికి అతడు యీఘట్టంలో చూపిన ప్రతిభయే ముఖ్యకారణం.

తన పుత్రశోకాన్ని ఆమె లెక్కచేయలేదు. "నేను "పుత్రశోకజనితానలభారవిషణ్ణచిత్తనై పొక్కుచున్నభంగి" నేడు నిన్ను "ఇక్కడ కీడ్చి తెచ్చుటకు ఓర్వనిదై భవదీయమాత, ఎక్కడ ఇట్టి శోకము నేక్రియ నేడ్చుచున్నదో!" అని అశ్వత్థామను జూచి జాలిపడింది.

"ఇట్టిశోకము" అనేదానిలో గొప్పధ్వని ఉంది. ప్రపంచంలో అందరు తల్లుల పుత్రశోకమూ తన పుత్రశోకంవంటిదేనని మూలంకషంగా ఆమె గ్రహించినట్టు ఆముక్కవల్ల స్పష్టమౌతూవుంది. ఇలాంటిసమభావం

కలగడం ఆమె హృదయనైర్మల్యానికి సూచన. నిష్కపటములైన మనస్సుల్లోనే యిట్టిపరిణతబుద్ధి కలుగుతుంది. కవిలేఖినినుండి ఇలాంటిపాత్ర బయల్వెడలిందంటే ఆకవి అమృతుడన్నమాటే!

"నేను "అక్షీణతనూజశోకవివశీకృతనై విలపించుభంగి" ఈ అశ్వత్థామను బంధించడాన్ని సహించలేక "ఎంతపాపకర్మో!" అదీగాక యితడు బ్రాహ్మణుడు. కాబట్టి విడవండి. నాకు ప్రతీకారవాంఛ లేదు" అని కృష్ణార్జునులను ప్రార్థించింది.

"లోకంలో అందరి సుఖదుఃఖాలూ ఒకటే! నా పుత్రులు చచ్చారని నేను మరొకర్ని హింసిస్తే, వాళ్ల తల్లులు ఎంతగా దుఃఖిస్తారో! కాబట్టి ప్రతిహింస నీచాతినీచం" అని గ్రహించి, లోకానికి చాటిన ఆ మహాతల్లి ప్రాతర్వందనీయ. తన పుత్రుని హత్య గావించినవాణ్ణి ఎవరు క్షమించగలుగుతారు? పోతన్న ద్రౌపది యీ ఒక్క మహాగుణంవల్లనే—నశించిగూడా ఇంతకాలం ప్రతిమానవహృదయంలోనూ నివసింపగలిగింది. కడకు అశ్వత్థామను విడిచిపుచ్చింది. ఆమెకు శాంతే ప్రధానం. రక్తపాతం చూచిచూచి కండ్లు కాయలుగాచాయి. హింసమీద విరక్తి పుట్టింది.

ఇవీ ముగ్గురు కవులూ ద్రౌపదిపాత్రను పోషించిన రీతులు. తిక్కన ద్రౌపదిని బాగా పోషించాడనీ, నన్నయ ద్రౌపదిలోనూ, పోతన ద్రౌపదిలోనూ జీవం లేదనీ కొందరి మతం. అది కేవలం అసమంజసం. నన్నయ, తిక్కన, పోతనల ద్రౌపదులు ఒక వయస్సువారు కారు. ముగ్గురు కవులూ ద్రౌపదిజీవితాన్ని మూడుభాగాలుగా చేసి ఒక్కొక్కరు ఒక్కొక్క భాగాన్ని వ్యక్తీకరించారు ఆ వయస్సుకు అనుకూలంగా. ఒకే మనుష్యుడు బాల్యంలోనూ, యౌవనంలోనూ, వార్ధక్యంలోనూ ఒకే శరీరపటుత్వం కలిగి, ఒకే మనోదార్ఢ్యాన్ని కలిగి ఉండగలడా? వయస్సూ, వాతావరణమూ మారేసరికి శరీర మానసికపరిస్థితులు గూడా మారకుండా ఉంటాయా? "అలా ఎందుకుండాలి? మార్పులేకుండా ఎందు కుండగూడదు?" అని ప్రశ్నించి విమర్శించేవారు, "నేల విడిచి సాము చేసేవాళ్లే"ని నా అభిప్రాయం. ముగ్గురిద్రౌపదులనూ పోల్చడంలో ఉండే రహస్యమిదే! ముగ్గురిద్రౌపదులనూ కలిపితేనే ద్రౌపదియఖండస్వరూపం కనిపిస్తుంది. వేరుచేస్తే మనిషిని మూడుముక్కలుచేసి ఒక్కొక్క ముక్క ఒక్కొక్క మనిషి అని వాదించిన చందంగా ఉంటుంది.

పెండ్లియైన క్రొత్తలో, అప్పుడే అత్తవారింట్లో అడుగుబెట్టి, నలుగురిలో తిరగడానికి జంకుతూ సుఖదుఃఖాలింకా వంటబట్టనిస్థితిలో నన్నయగారు ద్రౌపదిని చూపించారు. అది ద్రౌపదిబాల్యావస్థ. అప్పుడామె ముగ్ధ.

తిక్కనభారతప్రపంచంలో అడుగుపెట్టేకాలానికి ఆమెకు బాల్యం గడిచింది. అరణ్యాజ్ఞాతవాసాలతో సుఖదుఃఖాలు వంటబట్టాయి. జీర్ణించాయి ఆమెలో. భర్తలసాంగత్యంవల్ల వారిశక్తులు అవగతమైనాయి. వారిని కనుసన్నలతో ఆజ్ఞాపించగల ప్రతిభ సంపాదించింది. పురుషులతోనూ, స్త్రీలతోనూ స్వేచ్ఛగా మాట్లాడడం అలవాటయింది. చాలా ఢక్కామొక్కీలకూ, విషమపరీక్షలకూ ఆగింది. పరాభవమేమిటో, ప్రతీకారమేమిటో బాగా అర్థంచేసుకొంది. అనేకయుద్ధాలూ, రక్తప్రవాహాలూ చూచింది. ప్రపంచజ్ఞానం సంపూర్ణంగా సంపాదించింది. "ఇక ఎలా ప్రవర్తించినా ప్రమాదంలే"దనేస్థితి కొచ్చింది. పూర్తిగా ప్రౌఢ అయింది. తన తీవ్రతనూ, శక్తులనూ చూపి విజృంభించింది. తిక్కన్నగారివద్ద సెలవుపుచ్చుకొని పోతనఅండజేరింది.

అసలే పోతనది భక్తి రసమిళితమైనగుండె. దానికి దోడు ద్రౌపదికిగూడా దాదాపు సగంవరకూ గడిచింది. రక్తాన్ని చూచిచూచి విసుగెత్తింది. హింసామయ ప్రపంచంమీద ఏవగింపుగూడా కలిగింది. జీవితంలో 'శాంతి' అనేది లేకపోయెనే అనేవిచారం ఆమెను పీడించడం మొదలు పెట్టింది. తనలోఉండే క్రోధాన్నంతా చంపుకున్నది. యుద్ధానంతరం నిర్మానుష్యమైన రాజ్యాన్ని చూచి, అశ్రువులు రాల్చి, జీవితం బుద్బుదప్రాయమనే మహాతత్త్వాన్ని గ్రహించింది. "ఇకఏది ఎలా

పోయినా యిబ్బంది లేదు. శేషించిన జీవితాన్నైనా నిశ్చింతగా గడుపుదా"మని శాంతిమార్గాన్ని అభిలషించింది. అలాంటిసమయంలో పోతన తనభక్తిరసాన్ని ఆమె హృదయాంతరాల్లో ప్రవహింపజేశాడు. దాహాన ఎండిపోతున్న నోట్లో అమృతంపోసినట్లయింది. అంచు చేతే కుమారులు చచ్చినా ఆమె రెండుఅశ్రుకణాలు మాత్రమే రాల్చి ఊరుకున్నది. చేజిక్కిన అశ్వత్థామను చంపించాలనే ఊహ లేదామెకు. "నామూలంగానే యీ యఖండ జనసమూహ మంతా పీనుగపెంట లయిందిగదా! ఇంకా మానవమారణం చేయించడ మెందుకు? ప్రపంచంలో అన్నిజీవాల బాధా ఒకటేగదా!" అనేతత్త్వం ఆమెలో ప్రవేశించింది. ఆమెమనస్సు సంపూర్ణంగా పరివర్తనం చెందింది. అప్పటికి ఆమెకు సంపూర్ణశాంతి లభించింది. జీవితం ధన్యమయింది.

నన్నయచేత సృష్టింపబడి, తిక్కనచే పోషింపబడిన ద్రౌపదిని పోతన సర్వాంగసుందరినిగా చేశాడు. ఒక్కొక్కకవి చిత్రించిన ద్రౌపదిజీవితభాగాన్ని వేర్వేరుగా చూస్తే ద్రౌపదిస్వరూపమే గోచరించదు. ద్రౌపదిజీవితం కావాలంటే ముగ్గురి చిత్రణములనూ జోడించాలి. అప్పుడే ద్రౌపది సంపూర్ణంగా సాక్షాత్కరిస్తుంది. ఇదే కళకు పరమావధి!



# నీ పుట్టు పూర్వోత్తరాలు

[ అనువృత్తము ]

శ్రీ వి. ఆర్. శాస్త్రి

## సందేహాలు : సమాధానాలు.

౨

నాల్గో అధ్యాయంలో నాడులూ, మెదడూ యెట్లా పెరిగేదీ, ఏయే పనులు చేసేదీ చెప్పాను, జ్ఞాపకముందా? ఆ సందర్భంలో ఒక ఉదాహరణం యిచ్చాను, నాడులు పనిచేసే విధం తెలుపడానికి. కుక్కకు బిస్కత్తు చూపిస్తే దాని కండ్లనుంచి మెదడుకు "ఇదిగో చక్కని బిస్కత్తు" అనే వార్త వెడుతుంది. వెంటనే మెదడు నుంచి "ఛబుక్కున నోరు తెరిచి, లటుక్కున దాన్ని అందుకో" అనే బదులు వార్త వస్తుంది. అప్పుడు కుక్క దాన్ని తీసుకొంటుంది. ఈ పోయే వార్తలూ, ఆ వచ్చేవార్తలూ నాడులద్వారా బహుత్వరగా చలిస్తాయి.

ఈ విషయం విన్నప్పుడు ఒక బాలిక అడిగింది గదా—"ఇట్లా యెందుకు జరుగుతుంది? కండ్లూ, నోరూ కూడా అదేపక్కవి కాబట్టి కండ్లు చూడగానే నోటికీ అది తెలుస్తుంది, మెదడుకు వార్తలువెళ్లటం, రావటం అనవసరం" అని.

ఇదియెంతవరకు నిజమో మనం విచారిద్దాం. అంటే మెదడు లేకుండానే మనశరీరంలో వేర్వేరు అవయవాలు విషయాలను తెలుసుకొంటాయా? అదీ ప్రశ్న. ఈ దినాలలో ఎన్నిచోట్లనో ఘోరయుద్ధాలు జరుగుతున్నాయి. చాలామంది సైనికులకు గొప్పగాయాలు తగిలి, కాళ్లూ చేతులూ విఱిగిపోతున్నాయి. కాలుగాని చేయిగాని అట్లా విరిగితే, వైద్యులు తరుచుగా దాన్ని పూర్తిగా కోసివేస్తారు. అట్లా కోసేముందు ఆ రోగికి మత్తుమందు ఇస్తారు. ఈమందునే క్లోరోఫారం (Chloroform) అంటారు. ఈ మందువల్ల వాడికి బాధ తెలియదు. తరువాత వాడికి యింకా మత్తుపోకముందే, వాడిని తీసుకువెళ్లి పక్కలో పడుకోపెడతారు. వెచ్చగా ఉండేందుకు, మత్తుదిగినతరువాత బాధ అంత ఎక్కువగా ఉండరాదని, రబ్బరు సంచీలో వేడినీళ్లు పోసి దానిని వాడిరెండోకాలుక్రింద పెడతారు. ఇట్లా పెట్టే వేడినీళ్ల సంచీ ఎక్కువ వేడిగా ఉండరాదు. అట్లా ఉంటే, బాగున్న రెండో కాలు కూడా ఆవేడికి ఉడికి, కాలుతుంది. అది కాలుతున్నా కూడా, పాపం ఆసైనికుడికి ఏమీ తెలియదు. కాని మత్తుదిగిన తరువాత ఒకకాలు లేదుసరిగదా, రెండోకాలు కూడా కాలిపోయిందని ఎక్కువబాధ పడతాడు. ఒకసారి ఒకరోగికి గొంతుకలో ఏదో కోసి మందులువేశారు. వాడికి మత్తుమందు పెట్టారు. వాడిని మంచంమీద పడుకోపెట్టి, కాళ్లకు వేడినీళ్ల తిత్తి పెట్టారు. ఆతిత్తి ఎంతో వేడిగా ఉండబట్టి, వాడి రెండుకాళ్లూకమిలి, బొబ్బ లెక్కాయి. తరువాత ఆబొబ్బలకు మందులూ, మాకులూ వేయవలసి వచ్చింది, ఎన్నోరోజులు!

మన అవయవాలు మెదడులేకుండానే వేర్వేరు విషయాలను గ్రహించగలవా?— నాడులనుండి మెదడుకు వార్తలు వెళ్లడానికి ఎంతసేపు పడుతుంది?— మనకు బాధ అనేది ఎందుకు ఉండవలెను?—మనశరీరంమీంద చర్మం ఎందుకని మూసుకొని యున్నది?— శరీరంపైన వెంట్రుకలు లేకపోతే వచ్చే ప్రమాదమేమిటి?

మత్తుమందును ముక్కు ద్వారాను, నోటిద్వారాను రోగి పీలుస్తాడు. అది లోపలికి పోయి నాడులను, మెదడును మొద్దుబారేటట్టు చేస్తుంది. తక్కిన శరీరపు భాగాలను అదేమీ చేయదు. ఆ భాగాలన్నీ బాగానే ఉంటాయి. కాని నాడులూ, మెదడూ పనిచేయటం లేదు కాబట్టి శరీరంలోని యేభాగానికిగాని, వాటికి ఏమిజరుగుతుందో తెలుసుకొనే శక్తి లేదు.

నాడీవార్తలన్నీ చిటికలో వెళ్లగలవని మనం అంటాము. కాని యిది సరీగా గ్రహించాలి. అవి చాలా త్వరగా పోగల్గినప్పటికీ, ఏదో కొంచెం కాలం పట్టనే పడుతుంది. వేర్వేరుచోట్లనుండి మెదడుకు వస్తూపోయే వార్తలు వేర్వేరుకాలం తీసుకొంటాయి. మనచేతి నుండీ, కళ్లనుండీ వెళ్లే వార్తలు కుక్కయొక్క కండ్ల నుండి గాని, ముక్కునుండిగాని వెళ్లేవాటికన్నా ఎక్కువకాలం తీసుకొంటాయి. టైపుకొట్టేయంత్రాన్నీ, హార్మోనియమునూ నీవు చూచియుంటావు. మనవ్రేళ్లు బహుత్వరగా పనిచేస్తాయి. గబగబా టైపు చేసేవాళ్లూ, హార్మోనియం వాయించేవాళ్లూ ఉన్నారు. కాని, ఎవ్వరూకూడా తమకాళ్లతోగాని, పాదాలతో గాని త్వరగా వాయించలేరు. త్రొక్కుడుహార్మోనియంలో కాళ్లతో గాలితిత్తులను నొక్కుతారు. చేతివ్రేళ్లతో వాయిస్తారు. కాళ్లు నెమ్మదిగానే త్రొక్కుతాయి. చేతులు ఎంతో వేగంగా పనిచేస్తాయి. కాబట్టి కాళ్లనుండి మెదడుకు వెళ్లే వార్తలు చేతినుండి వెళ్లే వాటికన్నా ఆలస్యమవుతాయని దీనివల్ల తెలుసుకోవచ్చు.

వేర్వేరు రకాల జనులలోకూడా యీ వార్తలు వేర్వేరువేగంతోపోతాయి. చిన్నపిల్లలలో యీవార్తలు, తరుచుగా, పెద్దవాళ్లలోవలె త్వరగాపోలేవు. అభ్యాసం మీదగాని నాడులు త్వరిత్వరగా వార్తలను పంపించలేవు. మీనాన్న, మీ అమ్మ, నీవు, మీచిన్నతమ్ముడు, లేదా మీ చిన్నచెల్లెలు రైల్లో వెడుతున్నారనుకో. మీనాన్న ఉన్నట్లుండి "అదిగో, ఆపక్షి చూడు ఎంత బాగుందో" అంటాడు. నీవు, పెద్దవాడివి కాబట్టి, వెంటనే చూస్తావు. కాని మీతమ్ముడు చిన్నవాడు, మూడేళ్లైనా లేవు యింకా. మీతండ్రి చెప్పిన మాట వాడిచెవులకు తాకి, అది మెదడుకు వెళ్లాలి. మెదడు అప్పుడు వాడిని తలత్రిప్పి చూడమని చెప్పాలి. నీవైతే త్వరగా యీపనంతా చేస్తావు. మీతమ్ముడికి చేతకాదు. వాడు చూచేటప్పటికి రైలు ఆ విచిత్రమైనపక్షిని దాటిపోతుంది! పెద్దవాళ్లలోకూడా ఎప్పుడూ యీ నాడులు త్వరగానే పనిచేయవు. నిద్రమత్తుగా ఉన్నప్పుడూ, జబ్బుపడిబలహీనంగా ఉన్నప్పుడూకూడాఆరోగ్యంగా ఉండినప్పటికన్నా, మేల్కొనియున్నప్పటికన్నా నెమ్మదిగానే వార్తలు నాడులద్వారా పోతాయి.

ఈదినాల్లో వాయు వైమానికులు ఎందరో తయారవుతున్నారు. కాని ప్రతివాడూ యిట్లా విమానం నడపడానికి పోలేడు. వైద్యులు మొదట వాళ్లను పరీక్షచేస్తారు. వాళ్ల నాడులు త్వరత్వరగా పనిచేస్తాయో, లేదో తెలుసుకోవాలి. నెమ్మదిగా పనిచేసే మనుష్యులు విమానం నడపటం ప్రమాదకరం. ఏదైనా అపాయం కనిపించగానే దానికి తగినట్లు మరలుత్రిప్పి, విమానాన్ని ఆపటమో, దించటమో, పైకి యెక్కించటమో, లేకుంటే మరీవేగంగా యెగిరేటట్టు చేయటమో జరగాలి. అందుకనే ప్రతివాడూ వైమానికుడు కాజాలడు.

మీయింట్లో రెండు మూడేండ్ల చిన్నపాపాయి ఉంటే దేన్నైనా వాడెంత త్వరగా గ్రహిస్తాడో నీవు పరీక్ష చేయవచ్చు. ఏదన్నా ఆడుకొనే వస్తువుగాని, తినుబండంగాని తీసుకొని "చూడు, చూడు" అను. వెంటనే "ఒకటి, రెండు, మూడు" అని యిట్లా లెక్కపెట్టు. ఎంతసేపటికి ఆపాప దాన్ని చూచి తీసుకొంటుందో తెలుసుకో. పాపాయి దాన్ని చూచి చేయి జాపిన తరువాత ఆ తినేవస్తువును దానికే యిచ్చేయాలి కాని నీవు నోట్లోవేసుకోరాదు!

కొందరు జనులు చాలావిషయాల్లో ఎంతో తెలివిగా ఉన్నప్పటికీ యిట్లా చూడటంలోనూ, వెంటనే కావలసిన పనిచేయటంలోనూ కొంచెం నెమ్మదిగానే ఉంటారు. కాని యిందుమూలాన వాళ్లు తెలివితక్కువదద్దమ్మలని అనుకోకూడదు. వాళ్ల మెదడుయొక్క ఆలోచనాశక్తికీ, దీనికీ యేసంబంధమూ లేదు. అట్లు

వంటివాళ్లు బాగా చదువుకోగలరు; లెక్కలూ తెలుగూ శాస్త్రం అన్నీ నేర్వగలరు.

## ౩

ఒక అబ్బాయి అడిగాడు—"మన కెందుకు బాధ అనేది ఉండాలి?" అని.

బాధ అనేది మనకు కష్టంగానే ఉంటుంది. కాని ఇది ఉండటం చాలా మంచిది. ఇది లేకపోతే మనం చాలా కష్టాలపాలు కావలసివచ్చును. గొంతుక లో శస్త్రం (ఆపరేషన్) చేయబడ్డవారికి బాధ తెలియకపోవటంచేత, పాపం, వాడికాళ్లు కాలిపోయాయి. బాధవలన మనకు "ఇదిగో, ఇది ప్రమాదకరమైన విషయం, జాగ్రత్త" అని శరీరం తెలుపుతుంది. మనుష్యులకూ, జంతువులకూ కూడ యీ బాధ అనేది లేకపోతే పెద్ద గాయాలవల్లా, విషపుపదార్థాలు తినడంచేతా ప్రాణమేపోవచ్చు. నీవు మీవాళ్లయింట్లో పెండ్లి భోజనాలకు వెళ్లావు. బాగా ఉన్నాయని మరిరెండు లడ్డూలు తిన్నావు. ఇంటికి రాగానే సాయంత్రం కడుపు నొప్పి వచ్చింది. చాలా బాధగా ఉంది. ఈబాధచేత నీకు ఏదీ తినాలని అనిపించదు. కష్టపడుతూ, విసుగుకొంటూ, రాత్రిభోజనం తినకుండా నిద్రపోతావు. ఎక్కువగా తిన్నలడ్డూలు ప్రొద్దుటికి జీర్ణమైపోయాయి; కడుపునొప్పి పోయింది. ప్రొద్దున్నే సరీగా విరేచనమయింది. ఆకలి పుట్టింది! బాధ లేకపోతే నీవు యింకా ఎంతతినేవాడివో! ఎంతగా నీ ఆరోగ్యం చెడిపోయేదో!

సాయంత్రం నీవు బంతిఆట ఆడుతుంటే బంతి మీద కాలుపడి దొర్లింది, క్రిందపడ్డావు. పాదం మెలి తిరిగి వాచింది. నొప్పి పెట్టింది. కుంటుతూ యింటికి వచ్చేశావు. కాలిబాధచేత మరి రెండు మూడు దినాలు నీవు బంతిఆట ఆడడానికి వెళ్లవు. కాలును సరీగా నేల మీద మోపకుండానే నడుస్తావు. దానికి చాలా విశ్రాంతి యిస్తావు. త్వరలో ఆనొప్పి సర్దుకుంటుంది. ఇట్లా బాధ అనేది నీకు తెలియకపోతే గంతులువేసి తిరిగి బంతులాటలాడేవాడివి. అప్పుడు నీకాలు ఎంతో చెడిపోయి, చాలా ప్రమాదం జరిగేది. ప్రస్తుతం కష్టంగా తోచినా, చీకాకుపెట్టినా, నొప్పి అనేది మనమేలుకే ఉపయోగపడుతోంది. అపాయం ఎక్కువగా కలుగకుండా మనలను అది హెచ్చరించి కాపాడుతోంది.

## ౪

"ప్రాణులు మొట్టమొదట ఎందుకని నీళ్లలోనే పుట్టాయి, నేలమీద ఎందుకు పుట్టలే"దని ఒక అమ్మాయి అడిగింది.

ప్రాణులశరీరమంతా చాలాభాగం నీటితోనేనిండి ఉన్నది. ఈ నీరు గనుక ఎండిపోతే, అసలు ప్రాణిలో ఉండే గట్టిపదార్థాలు గ్రుంగుతాయి; ముద్ద కట్టుకొంటాయి. ఆజీవి చాలా చిన్నదిగా అయిపోతుంది. ఏవైనా కాయగూరలు బజారునుంచి తెచ్చి చాలా దినాలు మనయింట్లోనే వండకుండా పెట్టామనుకో. వంకాయలు, పొట్లకాయలూ, ఆకుకూరలు మొదలైనవి ఎండిపోతాయి. అప్పుడు అవి వడిలి చాలా చిన్నవిగా ఔతాయి. పళ్లెంనిండా పొట్లకాయముక్కలు తరిగి, వాటికి ఉప్పు పూస్తారు: నీళ్లు కారిపోతాయి. ఆముక్కలను గట్టిగా పిండుతారు: చాలా కొద్దిగా మిగులుతాయి. వాటిని ఇంకా వేయించేస్తే మరీ క్రుంగి దోసెడుకూరన్నా కాదు. ఇట్లుకావడం జంతువులూ, ప్రాణులయొక్క శరీర పరిమాణమూ, వాటి బరువూ కూడా సగముకన్న యెక్కువభాగం నీళ్లు ఉండటం వల్లనే అని తెలుస్తోంది. నీశరీరంలోని నీళ్లన్నీ ఇగిరితే నీవు ఇప్పుడుండే పరిమాణం (సైజు) లో సగముకూడా ఉండవు. నీబరువుకూడా ఆమాదిరే తగ్గిపోతుంది. ఇట్లా నీరు తీయకుండాఉండటానికనే మనశరీరంపైన చర్మం మూసుకొని కాపాడుతోంది. లావైనచర్మం గల నారింజ, దబ్బజాతులు, ఆపిల్‌పండ్లు, మామిడిపండ్లు, పనస, అనాస మొదలైనవి, ఇందుకనే, చాలా రోజు లుంచినా ఎండిపోవు. పలుచని ఆకులుండే కొత్తిమిరి, తోటకూర్లవంటి ఆకుకూరలు కోసిన కొంచెం సేపటికల్లా వడిలిపోతాయి. చాలా మందమైన చర్మం లేకపోతే నీళ్లబయటనో, బురదలేనిచోటనో జీవులు బ్రతకటం కష్టం.

కంటికి కనపడనంత చిన్న క్రిములు గాలిలోను, దుమ్ములోను ఉన్నాయి. ఇవి ఎండిపోయి, పొడి లాగు ఎగురుతాయి. కాని అవి ఏదన్నా తడిగా ఉండేచోటులో పడితేనే పెరుగుతాయి. లేకపోతే వాటిలో ప్రాణం ఉన్నా అవి ఆహారం తీసుకోలేవు, పెరుగజాలవు. అసలు గాలిలోనే ఏదన్నా క్రిమి ఉండాలంటే దానికి రెక్కలవంటివి పెరగాలి. ఈ క్రిములకు రెక్కలులేవు. అయినా, అవి బహు చిన్నవిగా ఉంటాయి కాబట్టి గాలిలో కొట్టుకుపోతాయి, ఎగురుతూ ఉంటాయి. గాలిలోనే జీవులు ప్రారంభించితే, అవి రెక్కలు లేనందున, ఈ క్రిములమాదిరి బహుచిన్నవిగానే ఎప్పుడూ ఉండేవి. ఇతర ప్రాణులూ, నీవూ, నేనూ ఎవ్వరూ అసలు వృద్ధికావడానికే వీలయ్యేదికాదు.

నెత్తురుగాయాలకు-గాలీ, దుమ్మూ తగిలితే, ఈ చిన్న క్రిములు తడిగా ఉండే ఆగాయంలో చేరుతాయి. అవి పెరిగి ఎక్కువ అవుతాయి. అప్పుడే ఆగాయం చీముపట్టి వాస్తుంది. అన్నం, రొట్టెలు, మజ్జిగ, మిగుల పండిన పండ్లు — వీటికి గాలి తగిలితే, ఆగాలిలోని క్రిములు తడిగా ఉండే యీవస్తువులమీద పడతాయి. అవి పెరిగి యీవస్తువులపైన బూజులాగు తయారవుతాయి. తగరపుడబ్బాలలోను, సీసాలలోను గాలితగులకుండా తినేవస్తువులను బిగిస్తారు. కనుకనే వెన్న, జామ్‌లు (Jams), బిస్కత్తులు మొదలైనవి బూజు పట్టటంలేదు.

౫

జంతువులలో కొన్నింటికే శరీరంమీద ఈకలుగాని, వెంట్రుకలుగాని ఉన్నాయి. పక్షులు, పాలిచ్చి పిల్లలను పెంచే కుక్కలు, పిల్లులు, ఎలుకలు, కుందేళ్లు, కోతులు, మనుష్యులవంటివి ఇటువంటివి. చేపలకూ, మొసళ్లు, తాబేళ్లు, తొండలు, పాములు, కప్పలు మొదలైనవాటికి రెక్కలుగాని, వెంట్రుకలుగాని లేవు. వీటిరక్తం ఒకేమాదిరి వేడిగా ఉండదు. ఇవి నివసించే స్థలం ఎంతవేడిగా ఉంటుందో అంతవేడిగానే వీటి రక్తంకూడా మారుతుంది. వెంట్రుకలూ, రెక్కలూ ఉండేవాటి శరీరంలోని నెత్తురు ఎప్పుడూ ఒకేవేడిగా ఉంటుంది. మనుష్యులరక్తం 98.6 F వేడి. దీనినే ఉష్ణమానితో (Thermometer) కొలుస్తారు. ఈవేడి ఎక్కువైతే జ్వరం, తక్కువైతే శీతలం. రెండూ ప్రమాదమైనవే. అందుకని యీవిధమైన ప్రాణులు తమ శరీరంలోని వేడి తగ్గిపోకుండానూ, మరీ ఎక్కువకాకుండానూ ఒకేమాదిరిగా ఉండేందుకు ఈకలూ, వెంట్రుకలూ అవసరం. మరీ వేడిదేశాల్లో ఉండేవాటికి శరీరంమీద బొచ్చుయెక్కువగా ఉండదు. వేసవికాలంలో నీవు ఉన్నిచొక్కాలు తొడుగుకో నక్కరలేదు. అయినా, ఏనుగు, ఖడ్గమృగంవంటి జంతువులకు అసలు శరీరంపైన వెంట్రుకలే లేవు. కాబట్టి చర్మం చాలా మందంగా పెరిగింది. వేడినీళ్ల తిత్తిని మంచంమీద పెట్టి, అది త్వరగా చల్లారకుండా ఉండేందుకు దానిమీద దుప్పటిగాని, శాలువగాని కప్పుతారు. అప్పుడు కాళ్లకు చాలాసేపు దానివేడి తగులుతూనే ఉంటుంది. పక్షులకూ, పాలిచ్చేజంతువులకూ వాటిఈకలూ, వెంట్రుకలూ ఒకశాలువవంటివి అనుకోవచ్చు.

శరీరంలోని వేడి ఎప్పుడూ బయటకు పోతూ, శరీరం చల్లబడితే, తిరిగీ ఆవేడి ఎక్కేటందుకు మనం ఆహారం తినాలి. ఆహారం జీర్ణమై, రక్తంలోకి ఎక్కి, వేడినీ, బలాన్నీ యిస్తుంది. ఈకలూ, వెంట్రుకలూ శరీరంపైన లేకపోతే పోయేవేడిని వెంటవెంటనే నింపడానికి ఎప్పుడూ తింటూనే ఉండాలి. అది ఎంత కష్టం! ఎంత చీదరైనపని!

౬

ఇక్కడ మీకు చెప్పిన విషయాలన్నీ విన్నతరువాత ఒక అబ్బాయి "అయితే మనం ఒకప్పుడు అన్నిరకాల జంతువులుగానూ ఉన్నా"మన్నాడు!

ఇది చాలావరకు నిజమైనదని నీవు గ్రహించి ఉండాలి ఇప్పటికి. అంటే మనుష్యులం మనం మనమాదిరిగా ఉండే అనేకజీవులమాదిరిగా పెరుగుతూవచ్చాము. చీమలమాదిరిగా మన మెప్పుడూ మన తల్లిగర్భంలో లేము. ఎందుకంటే అవి మనుష్యులుగా పెరిగిన జంతువుల గుంపులోనివి కావు.

ఒక చిన్న అమ్మాయి "తనకు శరీరంమీద చక్కగా మెత్తనిబొచ్చు ఉంటే బాగుండేది" అన్నది! ఇంకో అమ్మాయి, పెద్దరకం జంతువులు తమ పిల్లలను శరీరంలోనే పెంచి, కనే విషయాలను చెప్పినప్పుడిలా గన్నది: "ఎంత చక్కని యేర్పాటది! ఏదన్నా సింహంగాని, పులిగాని తల్లిని తరుముకు వస్తే, తన బిడ్డతో కూడా తప్పించుకొంటుంది. తన బిడ్డ ఎక్కడుందా అని తరువాత వెతుక్కో అక్కర లేదు!"

"సింహాలూ, పులులూకూడా తమతల్లిగర్భంలో మెత్తని, ముంజతునకవంటి అణువులుగానే మొదలు పెట్టాయా?" అని ఒక అబ్బాయి అడిగాడు. ఔను. అన్ని ప్రాణులూ అంతే. ప్రతిదీ, తనకు సరియైన రూపం గల ప్రాణిగా మారేటంతవరకూ, అంతకు పూర్వం పెరిగిన జంతువులమాదిరే తన తల్లిగర్భంలో పెరిగింది. చేపలుగా పెరగడానికి ఎన్నో రూపాలు ఎత్తనక్కరలేదు. మనుష్యుడుగా పెరగడానికి చాలా రూపాలు మారాలి. ఇది నీకే తెలుసుగదా?

## ౭

ఈవ్యాసాల్లో ఇంతవరకు జంతువులు పుట్టటం, పెరగటం గురించిమాత్రమే చెప్పాను. కాని వాటి మరణాన్నిగురించీ, వాటికి పనికివచ్చే అవయవాలు పెంచుకోలేకపోవటాన్నిగురించీ యేమీ చెప్పలేదు. చాలాజంతువులు చనిపోయాయి. ఎన్నో, ఇతరమృగాలచేతను తినబడ్డాయి. ఈ విధంగా నశించటానికి అంతే లేకపోయింది. ఎత్తుగాఉండే ఆహారాన్ని అందుకొనేటందుకు పొడుగుమెడలు పెంచుకొన్నట్లే, ఎన్నో యితరవిధాలైన అవయవాలను జంతువులు పెంచుకొన్నాయి. ఇట్లా పెంచుకోలేనివీ, ఉపయోగకరమైన భాగాలు పెంచుకోవాలని జ్ఞాపకం ఉంచుకోలేనివీ నశించాయి. ఒకవిధంగా ఈ చనిపోవటమూ, మరచిపోవటమూ కూడా ప్రయోజనకరంగానే ఉన్నాయి. క్రొత్తజీవులు పుట్టాలంటే పాతవి నశించాలి. ఏదైనా క్రొత్తవిషయం నేర్వాలంటే పాతవాటిని మరవాలి.

మనకు ప్రయోజనకరమైనవాటిని ఇప్పుడు అవసరంలేకున్నా మరిచి వదలిపెట్టలేని జంతువుల జీవితం చాలా కష్టంగా మారుతుంది. కొన్ని ఉదాహరణాలు చూడండి:

పూర్వం చాలా మంచుగడ్డలు లోకాన్ని కప్పిన దినాలలోనూ, అంతకు పూర్వం కూడా ఉన్ని దట్టంగా పెరిగిన ఖడ్గమృగాలుండేవి. ఆ దినాలలో వాటికి ఉన్ని యెంతో సహాయంగా ఉండేది. ఈదినాలలో లోకపరిస్థితులు మారాయి. ఖడ్గమృగాలు నివసించే దేశాలు వేడివిగా మారాయి. దానికి తగినట్లే ఖడ్గమృగాలకు యిప్పుడు దేహంమీద ఉన్నిలేదు. మునుపు ఎప్పుడో ఉపయోగపడ్డదని, ఉన్నిని ఖడ్గమృగాలు ఇప్పుడుకూడా అదేవిధంగా ధరించినట్లైతే, ఎంత చీకాకుగానూ, అవస్థగానూ ఉంటుందో ఆలోచించి చూడు.

పిల్లులకు చేపలంటే యిష్టం. కాని ప్రతిపిల్లికీ నీళ్లంటే అయిష్టం. అందుకని అవి నీళ్లలోదిగి చేపలు పట్టవు. కాని, మును పెప్పుడో ఉండే జంతువులకు ఉపయోగమైనాయని, పిల్లులు తమపువ్వారములను పూడ్చుకొనకపోతే, వాటిబ్రతుకు ఎంతకష్టంగా మారుతుందో గదా!

ఎలుకలూ, చుంచులకు చిన్నకండ్లూ, చిన్న చెవులూ పెరిగాయి. అవి నేలలో త్రవ్వుకొని దాగుకొంటాయి. కాబట్టి పెద్దకండ్లుంటే మన్ను వాటిలో పడవచ్చు; పెద్దచెవులుంటే ఇరుకైన బొరియలో దూరేటప్పుడు తెగిపోవచ్చు. "మోల్" అనే చిన్న చుంచువంటి ఒక జంతువుంది. ఇదికూడా కలుగుల్లో, భూమిని తొలిచి, జీవిస్తుంది. దీనికి అసలు బయటచెవియే ఉండదు. శరీరంమీద వెంట్రుకలే ఉండవు. కాని, ఎప్పుడో ఒకప్పుడు పనికొచ్చాయని పెద్దనేత్రాలూ, చెవులూ, ఒంటినిండా బొచ్చూ ఉంటే ఇవి చాలా అవస్థపడేవి. కాబట్టి పనికిరాని అవయవాలను పెంచుకోకపోవటం చాలా లాభకరం. ఏదో దాని తాతముత్తాతలకు ఉపయోగపడ్డాయని యే జంతువన్నా అన్ని అవయవాలనూ వదలకుండా పెంచుకొంటే దానిఅవస్థకు మితి ఉండదు. పువ్వారములు, తోకలు, రెక్కలు, ఈదేకాళ్లు—ఎన్నో లెక్క

లేనన్ని అంగాలు దాని జీవితానికి అడ్డంవస్తాయి. ఇన్ని ఆటంకాలను సర్దుకోలేక, ఆజీవి బహుత్వర లోనే చనిపోతుంది.

ఇదేమాదిరిగా చావు అనేదికూడా చాలా ఉపయోగమైంది. ఎందుకూ లాభం లేని "బ్రాంటసార్‌లు", "టిరనోసార్‌లు" (అంటే "పిడుగుతొండ" అని, "రాక్షసి తొండ" అని అర్థము.) నశించిపోవటం యెంతో మంచిదైంది. ఇదేమాదిరిగా, ఏవిధమైన అపాయమూ చేయలేకపోయినా, ఎందుకూ ఉపయోగం కాని, క్రొత్తవిషయాలు నేర్చుకోలేని ఎన్నో చిన్నజీవులుకూడా రూపుమాసిపోయాయి. ప్రతిజీవీ తనజీవితం అంతలో బహుకొంచెమే క్రొత్తరీతిగా జీవించేటందుకు నేర్చుకోగలదు. ఏచిన్న అవయవమైనా క్రొత్తది పెరుగుటకుగాని, ఉండే అవయవములలో ఏ బహు తక్కువమార్పైనా కలిగేటందుకుగాని, ఎన్నో తరతరాలుగా జీవులు మారితేనేగాని వీలుకాదు. కాబట్టి ఒకేజీవి అంతులేకుండా బ్రతికేకన్నా చనిపోయి, క్రొత్తజీవులు వృద్ధి అవుతే చాలా మార్పులు కలగడానికి అవకాశం కలుగుతుంది. ఉండే తోక పోవాలన్నా, ఏదైనా క్రొత్తరకంగా ఒకపన్ను మారాలన్నా కూడా ఎన్నోతరాలు గడవాలి.

పాత పెద్దజీవులు చనిపోవటంవల్లనే క్రొత్త చురుకైన చిన్నజీవులు పుట్టడానికి అవకాశం కలుగుతోంది. ఒక్కొక్క సందర్భంలో పాతజీవు లెంతవరకు విషయాలునేర్చుకొన్నాయో అక్కడనుంచీ క్రొత్తగా పుట్టిన జీవులు ముందుకు నడుస్తాయి. మనుష్యులలో కూడా యింతే. ఒక్కొక్క తరంగా శిశువులు పుట్టేకొలదీ ఇంతకు ముందు మనం కని విని ఎఱుగని విచిత్రవిషయాలూ, శక్తులూ వృద్ధికావడానికి ఎంతో అవకాశం కలుగుతోంది. ఏజీవైనా చిన్నతనంలోనే చనిపోవటం చాలా విచారకరం. పాపం, దానికి ఏ విషయంగానీ నేర్చుకొనేటందుకే వీలూ, అవకాశం చిక్కాయికావు. కాని ఒకజీవి పూర్తిగా జీవించి, వీలైనన్ని అనుభవాలు పొంది, క్రొత్తవిషయాలు నేర్చుకొన్నతరువాత అది చనిపోతే విచారపడవలసిన అక్కరలేదు. చురుకైన, బలమైన క్రొత్తజీవికి యీ పెద్దప్రాణులు స్థలం యివ్వాలి. ఇందుకని లోకంలో

## ప్రోటొజోవా [ప్రథమజీవులు]

| తొమ్మిది నెలలు | బహుశ ౯,౦౦,౦౦,౦౦౦ సంవత్సరాలు [ఇంకా ఎక్కువే ఉండవచ్చు] |
|---|---|
| ప్రోటొజోవానుండి, పురుగు — సుమారు ౧౫ దినాలు | ప్రోటొజోవానుండి, పురుగు |
| పురుగునుండి, చేప సుమారు ౧౫ దినాలు | పురుగునుండి, చేప |
| చేపనుండి, నేలమీద తిరిగే జంతువులు — సుమారు 3 వారాలు | చేపనుండి, తొండ, పాముల జాతిజీవులు [Reptiles] "రెప్టైలులు" |
| కాళ్లచివర వ్రేళ్లు, గోళ్లు పెరిగిన జాతి జీవిగా మారటం — సుమారు ౮ వారాలు | "రెప్టైలు"లనుండి పక్షులు, వాటినుండి నాలుగుకాళ్ల జంతువులు |
| కోతివంటి జీవి మ్రానుపిల్లి(Lemur)వంటిది సుమారు ౮ వారాలు | మానుపిల్లివంటి మృగాలకు(Marmoset, Lemur) మారటం |
| మ్రానుపిల్లినుండి, కోతులవంటిజీవి — సుమారు ౮ వారాలు | మ్రానుపిల్లినుండి కోతిజాతులు |
| కోతినుండి, మనుష్య శిశువు — సుమారు౧౬ వారాలు | కోతులనుండి మనుష్యులు |

౯ నెలలు - మనుష్యుడు-౯ కోట్లయేండ్లు

ప్రాణులు చనిపోతున్నాయని విచారించ నక్కర లేదు. పెద్దతరాల జీవులు నశించినందున క్రొత్తశిశువులు పుట్టి పెరిగి ఎన్నోవిచిత్రవిషయాలను కనిపెట్టి లోకాన్ని వృద్ధిపరచడానికి వీలు కలుగుతోంది.

నేనూ, నామాదిరిగా ఇటువంటివిషయాలు చెప్పేవాళ్లూ, వ్రాసేవాళ్లూ, ఇంకా ఇతరులూ అప్పుడే పెద్దతరంవారిమి. బ్రతికినన్నిదినాలు బ్రతుకం. మాదినాలు

గడిచిపోతాయి. కాని, అంతరించే యీ పెద్దవాళ్లం మీకు- పసివారికి వదిలిపెట్టే లోకం, అంతగా చూచి సంతోషపడవలసిన స్థితిలో లేదు. మీ పెద్దవాళ్లు యీ లోకాన్ని యుద్ధాలతోనూ, ధనవంతులూ బీదవాళ్లూ అని తెచ్చిపెట్టిన మిట్టపల్లాలతోనూ, అధికారులూ పరిచారకు లనే అసహ్యపు భేదాలతోనూ, మతము లనే మాయకత్తులతోనూ నింపేశారు. సహజంగా, సవ్యంగా, సంతోషంగా మనుష్యజీవితం గడిచి నిన్నటికన్న నేడు, నేటికన్న రేపు లోకం అభివృద్ధిచెందడానికి తగిన పరిస్థితులు లేకుండా చేసిపోతున్నారు మీ పెద్దవాళ్లు. ఎవరన్నా పెద్దలు తమ శిశువులకు ఆనందదాయకమైనవీ, ఉపయోగకరమైనవీ వస్తువు లిచ్చిపోతారు. కాని యీ కాలపు పితరులు మీ కిచ్చేదంతా విషబాంబులు, టాంకులు, ధనకాంక్షలు, స్వార్థగుణాలు, తారతమ్యాలు! ఎంత విచారకరం! ఎంతసిగ్గుచేటు! దీన్ని తలచుకొంటే యీ పెద్దవాళ్లకు తలవంపులు కావాలి. ముందే నే చెప్పినట్లు లోకంలో యిప్పుడెన్నో నూతనశక్తులు మన స్వాధీనమైనాయి. ఎన్నో గొప్పవిషయాలను కనిపెట్టుతున్నారు. కాని మనుష్యులు యీ సమస్తశక్తులనూ, విషయాలనూ స్వలాభంకొరకు, అహంకారంతో ఉపయోగిస్తున్నారు.

కాబట్టి మారవలసింది మానవహృదయం. దీన్ని మీరు- చిన్నవాళ్లు, అంటే రేపు లోకాన్ని నడిపించేవాళ్లు గ్రహించాలి. మీ హృదయపుష్పాలు సుగంధపరిమళాలతో వికసించాలి. మీ క్రొత్తశక్తినీ, ఉత్సాహాన్నీ, ఉద్రేకాన్నీ, ధైర్యసాహసాలనూ, విజ్ఞానాన్నీ వినియోగించి యీలోకాన్ని చక్కబెట్టండి. మీ పెద్దలు చేసిన తప్పులనే మీరూ చేయకండి. మీరక్తంలోనుంచి, మీకండలలోనుంచి పుట్టిపెరగబోయే మీ చిన్న శిశువులకు మీరు బహుమతిగా ఈయదగిన చక్కని సంఘాన్ని నిర్మించండి. పైన జెప్పిన శక్తి, ఉత్సాహం, ఉద్రేకం, ధైర్యం, సాహసం, విజ్ఞానం యివన్నీ చక్కని బలంగల గుఱ్ఱాలు. వీటిని నడిపేవాడు లేకుంటే ఇవి ఇప్పటిలాగానే అడ్డదారులు తీస్తాయి. డొంకలవెంబడి చెలరేగుతాయి. కనుపడ్డదాన్నంతా ధ్వంసంచేసి బండీని పడవేస్తాయి.

కాని వీటిని కట్టుదిట్టంలో పెట్టి సవ్యంగా నడిపించే సారథి నీలోనే ఉన్నాడు. అదే నీ యొక్క కారుణ్యహృదయం.



# చిగురాకు (?)

# చిగుళ్లు

శ్రీ కొమరవోలు వెంకటసుబ్బారావు

ఈయుషస్సమయమ్ము
లెంత శాంతములోకొ-
నామనోవీథిలో
స్వామి నే డగుపించె

ఈదివ్యసౌరభము
లెందుండి వచ్చెనో
నాస్వామితలపు లే
నాకు బాడసూపెడిని.

ఈవిహంగకూజితము
లెంత మధురములోకొ-
నానాథు పిలుపు లే
వీనులం ధ్వనియించె

ఈ స్వర్ణమాంగల్య
భాస్వరారుణకాంతి
నాజీవితేశ్వరుని
నన్ను గన్నుల గలిపె.

ఓ యనిలవాహినీ
ఓ యుషస్సుందరీ!
నా తుట్టతుదివార్త
నాథునకు నందిండు.

ఓప్రభూ కొనుమోయి
నా ప్రాణసుమపూజ
నీ చరణదాసి శ్రీ
నిర్మలాలలితాంగి.

---

# కలగూరగంప

## దేశసేవ - సాహిత్యమార్గము - గ్రామరంగములు

సాహిత్యవిషయములో మన పూర్వులనాటికిని, మన తరమునకును పరిస్థితులలోను, దృష్టిలోను, ఫలాపేక్షలోను చాలా వ్యత్యాసము కనబడుచున్నది. ఆంధ్రమున సాహిత్యవిజృంభణమునకు తోడ్పడిన మన పూర్వులు సాహిత్యపరత్వమునకు నలంకారమైన కవిత్వమును ప్రకాశింపజేసి తమను, తమ వంశములను, తమ దైవతములను, తమ యేలికలను తమ దేశచరిత్రలో ఆచంద్రార్కముగా నిలిపినారు. కవితాశక్తిని మానవాతీతమైన భగవద్వికాసముగా, ఉత్కృష్టమైన దివ్యప్రసాదముగా పరిగణించినారు. దానిని భక్తిశ్రద్ధలతో, ఏకాగ్రతతో ఉపాసించి తమ జీవితముల కాచంద్రార్కప్రతిభ చేకూర్చుకొనినారు. మననాడును సాహిత్యపరులును, కవితారచయితలును గలరు. మన ఆంధ్రమందు నేడు వెలువడుచున్న పత్రికలు చూచినయెడల రచనాకౌతుకము మన ఆంధ్రయువకులలో చాలా కలదని తోచక మానదు. కాని వీరు చదివిన చదువులలో సాహిత్యరచనా రహస్యములు బోధించి తద్రచనయందు కొంత శిక్షణ నిచ్చెడి యవకాశములు వారికి కలిగియుండలేదు. పేరుకు కొన్ని సంఘము లున్నవి కాని వీటిలో ఒకరి రచన లొకరు పొగడుకొనుటతో సరిపోవుచున్నది గాని లోపములు సరిచూచుకొనుటకు తగిన సలహాలు కూడా వీరికి లభించుచున్నట్లు తోచదు. మా తరమునకు ముందు మనమండలములోనే గ్రంథరచయితలకు ఎట్టిసలహాలు లభించియుండినవో, ఎట్టి ఆమోదములు పొంది గ్రంథప్రకటనకు రచయితలు సిద్ధపడుచుండేవారో ఒకకవి ఇట్లు చెప్పియున్నాడు;

"సీ. సరసశాస్త్ర విశేషసారవిచ్ఛిత్తిపర
వస్తు రంగాచార్యవైష్ణవమణి
వైయాకరణశిరోవర రత్నసంజ్ఞ భా
గవతుల హరిశాస్త్రిఘనుఁడు సుమతి
రమణీయసంస్కృతాంధ్రకవివర్యేందుర్తి
వేంకటరామసద్విబుధుఁడు దయ
సరససాహిత్యనిస్తంద్రపోషనపెద్ది
వేంకయపండితోర్వీసురాగ్ర
గణ్యుఁడును మఱి ముఖ్యసత్కవులు కొంద
ఱరసి నిర్దోషమని పల్కి యప్పు డుభయ
కవిమనోరంజని యని యాఖ్య యిడినట్టి
టీక యిది యన నొప్పారు లోకమునను."

(శ్రీపాద వెంకటాచలకవి
రామకృష్ణోపాఖ్యాన వ్యాఖ్యానము)

ఇట్లు వివిధవిద్వత్కవిపండితామోదము గనిన తరువాత నాకాలపు ప్రకటనమార్గముగా కవి దానిని శ్రీ సింహాచల నారసింహదేవునకు కృతిసమర్పణము చేసెను. మన యీనాడు కృతిప్రకటనములు చేయుచున్న యువకవులకును ఏతత్కాలానుగుణమైన శిక్షణము, సహాయము, ఆమోదము కృతిప్రకటనకు ముందు కలిగినయెడల వీరు సాహిత్యమూలకముగా చేయుచున్న దేశసేవ యిత్తోధికముగా నాసికెక్కి, విద్వత్కవి పండిత జనానురంజకమై ప్రతిభావంత మగుననుటకు సందేహము లేదు. ఇక పాండిత్యము చాలక, భాషాజ్ఞాన మంతగా లేక, రచనాశిక్షణ మసలే లేక, అనుకరణ విధానముగా, కేవలమును ఉత్సాహబలము మీదనే ఆధారపడి వ్రాసిన కవనములు, చిన్నకథలు, గీతికలు మొదలగు యువజనరచనలకు సాహితీపరుల సాయ మెక్కువగా అవసరమై యున్నదనుటలో అతి

శయోక్తి లేదు. కాని ఏదో తలతిక్క స్వాతంత్ర్య భావమునకు దాసులై మన ఆంధ్ర యువరచయితలు చాలా మంది వృద్ధికి రావలసినవారు రేకెత్తజాలకున్నారు. మన ఆంధ్రసేవకు ఎంతమంది అయినా స్వచ్ఛంద సేవకులు దిట్టదేరగలవారు కావలసిన తరుణము వచ్చినది. మన యీ సాహిత్య సభలు సాధన రంగములుగా పరిణామము పొందవలసియున్నది.

మనపూర్వులు తమకు రచనాసిద్ధి కలుగుటకుగాను ఒక యిష్టదైవము నుపాసించి, యొక గురువువల్ల శిక్షణపొంది, తత్కటాక్షప్రసాదముగా తమరచనలను విజృంభింపజేసినారు. పూర్వకవులను తమగ్రంథముఖమున వాక్సిద్ధికై స్తుతించినారు. అట్టిస్తుతులలో ఆయాకవులలో తమకు కనుపట్టిన ప్రత్యేకకవితాగుణ గౌరవములను సూచించినారు. అంతేకాదు. తా మనుసరించ దలచిన సంప్రదాయ గ్రంథములను పరిశీలనగా చూచినారు. సాధనచేసి రచనాచమత్కారముల నెన్నేని చూపించినారు. ప్రజ్ఞలు ప్రదర్శించినారు. గతానుగతికముగా కాకుండా అనేకమార్గములు త్రొక్కినారు. నిమిషములమీద పంతములు పెల్లుపెరిగినప్పుడు ప్రసిద్ధ రచనలకు ప్రతిరచనలు ఒకటెనిమించిన దొకటిగా ఎన్నెన్నివిధములుగానో చెప్పి రాజ సూరి సభారమ్యమైన విద్యగా, నిర్నిద్రసారస్య లీలాచాతుర్యముగా సాగించినారు. అట్టి మహానుభావుల సంప్రదాయములోనివార మనుకొనదగిన నేటి ఆంధ్రరచయితలుకూడా దేశకాలవైపరీత్యములకు వగచి నిరుత్సాహులు కానక్కరలేదు గాని మన కవితా సంప్రదాయమందలి పూర్వపురుషులవలె ఆస్తిక్యపవిత్రతాపాండిత్యములు మనమును సుసాధములు చేసుకోవలెను. ఆస్తిక్యపవిత్రతాపాండిత్యములు లేని రచన కారణాంతరములచే తాత్కాలికముగా పామరరంజక మైనను నిత్యజీవమును పొందజాలదు. కనుక మన రచనల కాధారముగా అనుసరించు ఇతివృత్త మేదైనను దాని కనురూపముగ నాస్తిక్యపవిత్రతా పాండిత్యములచేత దానిని సంస్కరించి రసవంతము చేసినప్పుడే అది ప్రకాశమానమగును. కాని ముద్రాపకుల సాయమున దానికి సహృదయహృదయాహ్లాదకత్వము కలుగనేరదు.

ఇక మనవారు ఆంధ్రకవిత్వమును ఐహికాముష్మికములకే గాక పలువిధములను విద్యలను ఆంధ్రలోకమునకు సుపరిచితము చేయుటకై వినియోగించియున్నారు. యోగవేదాంతరహస్యములను రసవంతములైన పద్యగద్యములలో నిత్యస్మరణీయములైన స్తోత్రరాజముల ననేక జాతీయ ఫక్కికలుగా రచించి ముముక్షువులకు మార్గదర్శకు లైనారు. ఇట్టిరచనలను కేవలము సన్యాసిసంప్రదాయులుకూడా ఆంధ్రమందు సాగించినారు. మూర్ధాభిషిక్తులైన మహారాజులును సాగించినారు. మచ్చుకు రెం డుదాహరణలు చూపుచున్నాను.

బొబ్బిలిరాజ్యాధీశ్వరులగు శ్రీరాయడప్పరంగారాయణింగారు 'సంకల్పసూర్యోదయ' మను వేదాంతగ్రంథమును రచించిరి. 'ముముక్షుజనకల్పక' మను విశిష్టాద్వైత వేదాంతగ్రంథమును ఎంబెరుమానార్ జియ్యరువారి శిష్యుడు తెలుగుసీసములతో రచించెను. 'జీవప్రబోధ' మను వేదాంతగ్రంథమును శ్రీవాసుదేవయోగీశ్వరులవారాంధ్రమున రచించిరి. ఇట్లు ఆశ్రమవిశేషముతో ప్రసక్తిలేకనే ఉపనిషత్తులు పుట్టిననాటి పరిస్థితులు ఆంధ్రలోకమందు మనపూర్వపుతరమువరకూ సాహిత్య మార్గమున వచ్చినవి. ఈ ఆంధ్ర సాహిత్యమును ఆంధ్రులలో ఉపాసించినవారిలో నే నెరిగినంతవరకు బ్రాహ్మణులలో నియోగులు, వైదికులు, యాజ్ఞవల్క్యులు, నందవరీకులు, వేగినాట్లు, ములికినాట్లు, కోసలేయులు, ద్రావిడులు, ఉత్కళబ్రాహ్మణు లనుకొను శిష్టకరణములు, ఆరాధ్యబ్రాహ్మణులు, వీరుగాక శివదీక్షాపరులగు విశ్వబ్రాహ్మణులు, జంగాలు కుమ్మరులు, - ఇతరులలో క్షత్రియులు, కోమట్లు, భట్రాజులు, వీరుగాక కమ్మలు, రెడ్లు, వెలమలు, కాపులు, వీరూ వారూ అననేల, సాహిత్యము నభ్యసించి పాండిత్యము సంపాదించి కావ్యకళయందు ప్రతిభ చూపించి, రాజసమ్మానములు పడసినవారు ఎందరో కలరు. ఆంధ్ర సారస్వతచరిత్రలలో గాని, గ్రంథప[illegible]లో గాని పేరుకురాని ఆంధ్రరచయితలు అన్ని[illegible]ములలోని వారును ఎందరో కలరు. ఇక ఆంధ్ర[illegible]దు అశ్వశాస్త్రము, గజశాస్త్రము, పశుశాస్త్రము, సస్యశాస్త్ర

ము, సంగీతము, ధనుశ్శాస్త్రము, ఖడ్గశాస్త్రము, ఆయుర్వేదము, శిల్పము, దశవిధగణితములు, శారీరకము, లక్షణ శాస్త్రములు మొదలైన ప్రాచీనసంస్కృత సంప్రదాయ సిద్ధములగు శాస్త్రము లెన్నేని రచింపబడి యున్నవి. అందు అమూల్యమైన లోకజ్ఞానము, ఐహిక పురుషార్థ సాధకమైనది ఇమిడియున్నది. ఈ జ్ఞానమును తిరిగీ పరివర్తనములోనికి తెచ్చుట సాహిత్యమూలకమైన దేశసేవ యైయున్నది. మనపూర్వుల జ్ఞానమును తిరిగీ పరివర్తనములోనికి తెచ్చి అభినవజ్ఞానముతో సమన్వయించి లోమెరుగు తెరిగి యుపయోగము చేసికొనుటకన్న ఆంధ్రలోకకల్యాణమునకు సాయపడుట వేరేమి కలదు?

మరియొక చిత్రమైన సంగతి మనవారు గమనింపకున్నారు. మన దేశములో పల్లెటిచదువులనీ, పట్నవాసపుచదువులనీ మనపూర్వులనాడు మనవారు కనివినియెరుగని భేదములు ఈనాటి విద్యావిధానములో బలపరచుటకై ప్రయత్నములు జరుగుచున్నవి. ఇది మన ఆంధ్రదేశపు పూర్వచరిత్రకు కేవలము విరుద్ధమైన అభూతకల్పన. మన దేశములో పూర్వము కేణికివచ్చిన విద్యల కన్నిటికి గ్రామములే అసలు పుట్టుకస్థలములు. రాజస్థానములైన పట్నములు ప్రకటనరంగములవంటివి. సాధనరంగములు గ్రామములే. మన ఆంధ్రదేశములో మహామంత్రులు, సేనాధిపతులు, నాయకులు, విద్యాధికారులు, రాజసభాలంకారులగు పండితప్రకాండులు -- అందరును అసలు గ్రామములలో పుట్టి పెరిగి, విద్యాబుద్ధులు నేర్చి ప్రజ్ఞావంతులైనవారే. గ్రామకరణముల వంశీయులు సంగీతసాహిత్యములతోపాటు ఖడ్గవిద్యయు, రాజ్యతంత్రమును నేర్చి ప్రఖ్యాతులగు మహారాజ్యాధిపతులవద్ద కార్యకర్తృత్వము సంపాదించి బీదసాదలను పోషించినవారైరి. రాజసభాభూషణులైరి. రాజలాంఛనములను, బిరుదములను తాము సంపాదించుటయేగాక తమవంటి సాహిత్యపరుల కిప్పించిరి. ఆనాడు రాజ్యాధికారులకును, సేనాధిపతులకును కలిగియుండినటువంటి బిరుదములును, లాంఛనములును దిట్టలగు కవులకు లభించినవి. వారి వైభవము వారితో సంబంధబాంధవ్యములు గలవారికిని సంక్రమించియుండెను. అట్టి బిరుదైన సాహితీపటిమ బ్రాహ్మణ క్షత్రియసంప్రదాయులుకాని రాజ్యాధిపతులకుకూడా కలిగియుండి వారును బ్రహ్మక్షత్రియకవులతో సమానమైన విద్యాగౌరవము పొందియుండిరి. ఆంధ్రకవిత్వవిద్యయందట్టి యుత్తేజకత్వము సహజముగా కలదు. దానిని తిరిగీ పవిత్రహృదయములతో పలువిధములుగా ఎవరిశక్తికి తగినట్లు వారుపాసించి యట్టి సాహిత్యోపాసనరంగములుగా తిరిగీ మన ఆంధ్రదేశీయగ్రామములను మార్చినప్పుడే ఆంధ్రజాతి తిరిగీ భారతీయ జాతములలో స్థైరెన్నిక గనగలుగునుగాన అక్షరరూపిణియగు వాగ్దేవతను దేశమాతగా భావించి తన్నిరంతరసేవాసమాయత్త చిత్తులమై ధన్యత గాంతుముగాక.

(పిఠాపురము గీతామండలి వార్షికసభలో చదివిన ఉపన్యాస భాగము)

—బుర్రా శేషగిరిరావు.

---

## కీ. శే. శ్రీ కూచి నరసింహము పంతులుగారు



[సుప్రసిద్ధాంధ్ర రచయితలైన వీరు నవంబరు నెల 7-వ తేదీనాడు పిఠాపురమునందు పండు వయస్సులో 70-వ యేట పరమపదించిరి.]

శ్రీ కూచి నరసింహముగారి మరణమును విని కంట దడివెట్టని విద్యావంతు డుండడని నాతలంపు. ఆంధ్రసారస్వతమున ధ్రువతారయై వెలిగిన పానుగంటి వారి మరణవార్త విని వాపోవుచుండ నాయనతో సోదరునివలె మెలగిన కూచి నరసింహముగారి మృతి సంభవించి సారస్వతాభిమానులకు మరింత హృదయ పుటభేదన మొనర్చినది.

కూచి నరసింహముగారి జీవితమంతయు నొక విధముగ విద్యావిషయకముగనే గడచినదని చెప్ప వచ్చును. ఆవిద్యాబోధనాప్రాగల్భ్యమునకు దోడుగ సారస్వతసేవయు బంగారమునకు దావి యబ్బినట్లు కలిసి శ్రీవారి పవిత్రనామమును జిరస్మరణీయము నొనర్చినది.

వారు యాజ్ఞవల్క్యగోత్రులు; "శుక్లయాజుష మహీసురులు;" కూచివంశోద్భవులు; "విప్రశ్రేష్ఠుడౌ వెంకనార్యు"ని సుతులు; తల్లిగారి నామము పుల్లమాంబ. ఇట్లు వారు త్తమవంశమున జనించి,తీయనీటికి జేపయెక్కి నట్లు విద్యాభ్యసన మొనర్చి, యుద్యోగమున బ్రవేశించిరి. ఈసమయముననే వారికి గవితావాసన తగిలినది. వారికి "కవితయందు నాసక్తి బుట్టించినట్టి గురుడు కందుకూరి వీరేశలింగకవిమౌళి". వారు ఆంగ్లేయభాషాభ్యసనము మూలమున నుపాధ్యాయవృత్తి నవలంబించి కుటుంబ పోషణము సేయుచు నొకవంక సారస్వతసేవ సేయ మొదలిడిరి. ఇట్లే వారి పవిత్రజీవిత మంతయు గడచినది.

నరసాపురమునను,పీఠికాపురమునను బ్రధానోపాధ్యాయపదవుల నతిసమర్థతతో నిర్వహించి, యధికారులచేత నేమి, తదితరులచేత నేమి యనేకవిధముల మెప్పు వడసి, యుద్యోగమును విరమించి, సారస్వతసేవ సేయుచు శ్రీరామచంద్రుని దివ్యపాదారవిందముల నతి భక్తితో గొల్చుచు వారిటీవల దైవసాన్నిధ్యమును జేరిరి. నిక్కముగ నాంధ్రులందఱిలో మిక్కిలి ధన్య జీవితమును గడపిన మహనీయు డాయన.

ఆంధ్రసారస్వతమున గూచి నరసింహముగారు కవిగాను, గద్యరచయితగాను పేరుపడియున్నారు. శ్రీవారిచే రచింపబడిన గ్రంథములు తక్కువయే యైనను వారు పట్టినదెల్ల బంగారము నొనర్చి రనునది నిర్వివాదాంశము. వారి 'గౌరాంగచరిత్రము' నేటి ప్రముఖ కావ్యములకు బ్రతిభలోనేమి, పాండిత్యముననేమి యెంతమాత్రమును దీసిపోదు. వారి రూపలతా, వనవాస్యాది నాటకములు పానుగంటివారి నాటకముల ప్రక్క నేమాత్రమును నలమలలేక నిలువగలవు. వారి 'ప్రాక్పశ్చిమము'లను వచనగ్రంథము భాషాంతరీకరణ మనిన నిట్లుండవలెగదా యనిపింపజేయును. స్వల్పముగనే గ్రంథరచన మొనర్చినను శ్రీవారికి మన వాఙ్మయమున బ్రముఖస్థానము లభించినది.

కూచి నరసింహకవివరుని కావ్యములను బరిశీలించునపుడు వారికిని, పానుగంటివారికిని గల పోలిక మనలకు దట్టును. వారిద్దరును జీవితముల సోదరులవలె గడపిరని చెప్పితిని. పానుగంటివారి మరణమును విన్నంతనే శ్రీవారు తమ జ్యేష్ఠసోదరుని గోలుపోయినట్లు విలపించిరి. ఈ నరసింహద్వయ మాంధ్ర సారస్వతమున నిరుపమానముగ నిలిచియున్నది. ఈ యిరువుర కనేకములగు పోలిక లగపడును. ఇరువురును విద్యాబోధనమునకు జాలకాలము వినియోగించిరి. ఇరువురును సారస్వతసేవ నొనర్చిరి. ఇరువురును నొకే శైలి నవలంబించిరి. వార్ధకమున నిరువురును పీఠికాపురముననే,యొకరి గ్రంథముల కొకరు ప్రస్తావనలు వ్రాయుచు, నొకరి నొకరు ప్రోత్సహించుకొనుచు భాషాసేవ సేయుచు గతించిరి. ఆంగ్లమున అడ్డిసను స్టీలులవలెను, ఆంధ్రమున దిరుపతి వేంకటకవులవలెను వారును నొక వింతజంట.

కూచి నరసింహముగా రనేకవిషయముల పేరు పడియున్నారు. అందు విద్యావిషయముననే వారు జగద్విఖ్యాతి నందిరి. వారి విద్యాబోధనాశక్తి యిట్టిదని చెప్ప వలనుపడదు. ఆ విషయమున వారికి వారే సాటి. వారు ప్రధానోపాధ్యాయ పదవియం దుండిన యున్నత పాఠశాలలలో విద్యార్థులు పరీక్షలుతప్పుట యనునది దుండెడిదికాదట! వారి శిక్షణ మట్టిది. వారివలన విద్య నంది యున్నతోద్యోగభారనిర్వహులై యున్నవా రందఱును వారిని ఆర్నాల్డు ఆఫ్ రగ్బీ యను విఖ్యాతాంగ్లోపాధ్యాయునితో బోల్తురు. ఈవిఖ్యాతియే

పోలును శ్రీవారి నామమును చిరస్థాయిగ జేయుటకు. నవకవులలో ధ్రువతారలైయున్న కృష్ణశాస్త్రి మొదలగువారు కూచివారి శిక్షణ నందిగడితేరిన జగజెట్టిలే. వారిశిష్యులు తమయనంతర విభవమునకు, నభివృద్ధికిని వారి శిక్షణమే కారణమని చెప్పుకొందురు.

శ్రీవారి గ్రంథము లన్నింటిలోను నన్నెక్కువ యాకర్షించినవి వారి గౌరాంగచరిత్రము, వనవాసి, ప్రాక్పశ్చిమములు అను మూడును. అవి అన్నియు నొకవిధముగ భాషాంతరీకరణములే. అయినను అన్నియు స్వతంత్రగ్రంథములే యనిపించును. వారి భాషాంతరీకరణము కందుకూరివారి రచనను బోలును. గౌరాంగచరిత్ర మాధునికపద్యవాఙ్మయమున నుత్తమస్థానము నధిష్ఠించిన కావ్యరత్నము. ఇది గొప్ప భక్తిరసప్రతిపాదకము. పోతనభాగవతమువోలె నిందు భక్తి వెల్లివిరిసిపోయినది! చైతన్యుని భక్తిపారవశ్యము, తన్మహనీయత యిం దతిమనోహరశైలిలో వర్ణింపబడినవి. ఈదివ్యగ్రంథరచనమువలన కూచివారు ఆంధ్రప్రపంచమునకు గొప్ప యాధ్యాత్మికసేవ నొనర్చిరి. పార్నెల్ అను నవనామకుడగు ఆంగ్లకవి రచించిన 'హెర్మిట్' అను చిన్న పద్యకావ్యమును జనివి కూచివారు వనవాసి యను రమణీయమగు నాటకమును వ్రాసిరి. నిష్పాక్షికబుద్ధితో జూచిన నిదియు భాషాంతరీకరణవిధానమునకు మంచిమార్గమును జూపగల గ్రంథమని యనవలెను. శ్రీవారి నాటకమును రచించిన తీరు వారి యనన్యప్రతిభకు జక్కని నిదర్శనమగుచున్నది. ఆధునికవచనగ్రంథములలో 'ప్రాక్పశ్చిమములు' అను శ్రీవారి గ్రంథమును ముఖ్యముగ నెన్నవలెను. 'ప్రాక్పశ్చిమము'లందు వివేకానందస్వామి పాశ్చాత్యప్రాచ్యనాగరకతల విశేషమును దబిచినైచి హిందూదేశీయుల కన్నులను దెఱచెను. ఆంగ్లవాసన లేని యాంధ్రుల కీయమూల్యగ్రంథస్థవిషయగ్రహణలాభమును 'ప్రాక్పశ్చిమ' గ్రంథరచనమూలమున కూచివారు కలిగించిరి.

శ్రీవారికి సహజమగు కవితాప్రతిభ కలదు. ధారయందు వారికి వేరులేకున్నను వారి పద్యములన్నియు మలయమారుతపు బింకెలవోలె నుండును. వ్యర్థపదములు వారి పద్యములందు మచ్చునకైనను గానరావు. ఆంగ్లమున గ్రేకవివలెను, ఆంధ్రమున వసురాయనివలెను కూచివారు వ్రాయు పద్యములన్నియు సాన బట్టిన వజ్రములు. గౌరాంగచరిత్రమున మొదటినుండి చివఱవఱకు నొక్క నీరసపద్యమైనను గానిపింపకుండుట శ్రీవారి సహజకవితాప్రతిభకు మాయని నిదర్శనము.

వారిని గద్యరచనమునకు బ్రోత్సహించినది పానుగంటివారని నాయూహ. ఏల యన నాయన నాటకముల శైలిలోను, వచనశైలిలోను పానుగంటివారి చాయలు పొడకట్టును. పానుగంటివారి యమకసౌలభ్యము నలవరిచికొన్నవారు కూచివారొక్కరే. ఒకవేళ నిరువురు గూడబలుకుకొనియే మన మిట్టి శైలి నాంధ్రమున బ్రవేశపెట్టుద మని నిశ్చయించి యట్టి శైలిలో వ్రాయ మొదలిడిరేమో! ఏమైనను వ్యక్తిత్వముగల శైలి కిరువురును పేరుపడియున్నారు. పానుగంటివారిశైలియు, కూచివారి శైలియు మిక్కిలి పోలిక గలిగి యొకొక్కచో విడదీసిచూప గష్టమనిపించును. పానుగంటివారి శైలిలక్షణములన్నియు శ్రీవారి శైలికిని గలవు. మనోహరమగు యమకము, సమాసముల యొక్కయు, వాక్యముల యొక్కయు తూగు, తేటతెల్లముగ నర్థమగు భావప్రకటనము— ఇవి కూచివారి వచనశైలియొక్క ప్రత్యేకలక్షణములు.

విద్యాబోధకుడుగాను, కవిగాను వారు గాంచిన కీర్తియంతయు నొకయెత్తు; శ్రీరామపాదారవిందసేవకుడుగా వారార్జించిన విఖ్యాతి యొకయెత్తు. నిక్కముగ నింత నిర్మలజీవితమును గడపిన ధన్యాత్ము లరుదు. ఇంత నిగర్వి లేడు. కూచి నరసింహముగారు శాంతమూర్తి; సౌజన్యము యొక్క యవతారము. వారి శ్రీరామభక్తి యచంచలమైనది! తమ జీవితమునంతయు వారు శ్రీరామునకే ధారవోసిరి. శ్రీరాముని దివ్యనామస్మరణమే వారి జీవితమును నిలిపి, వార్ధకమున సారస్వతసేవకు వారికి శక్తి నిచ్చినది. శ్రీవారు జీవితమునంతను

"శ్రీరామా శ్రీరామా
శ్రీరామా రామరామ సీతారామా"
యనుచు భక్తిపరవశులై గడపిరి.

శ్రీవారు జగద్విఖ్యాతి నంది గతించిరి. వారి భౌతికకాయమే మనలను బాసినదిగాని వారి దివ్యకీర్తి కాయము మన హృదయములందు బాదుకొనియేయుండును. వారి మరణము ఆంధ్రసారస్వతమునకు దీఱని కొఱత గలుగజేసినది. పేరెక్కిన యాధుని కాంధ్ర కవులందఱును మనలను వీడుచున్నారు. వసురాయడు, పానుగంటివారు, కూచివారు వీరందఱును అరముగ్గిన ఫలములై రాలిపోయిరి. అయినను వాపోవ నేల? *"The old order changeth yielding place to the new."*

"పూవు వీడినఁ గాని పుట్టదు ఫలము
ఫలము రాలినఁగాని జనింపదు నవాంకురము"

అనునది మఱవరాదు.

— వంక వెంకటరామకృష్ణారావు

---



# ఆంధ్రాభ్యుదయము

## శ్రీ శొంఠి రామమూర్తి పంతులుగారు



శ్రీ శొంఠి రామమూర్తిపంతులు మదరాసు ప్రభుత్వపు ప్రధానకార్యదర్శిగా యిటీవల నియమింపబడ్డ ప్రథమ భారతీయులని విని ఆనందించని గర్వించని ఆంధ్రు డుండడు!

ఐహికాముష్మికాలను కరతలామలకం చేసే ఆధ్యాత్మిక చింతనలను భారతదేశానికే కాకుండా పాశ్చాత్య దేశాలకుకూడా అందజేసి, విశ్వవిఖ్యాతిని పొందిన వేదాంతవేత్తలలో అగ్రతాంబూలం ఆంధ్రుడికే అందింది — శ్రీ రాధాకృష్ణపండితుడికి!

అంతేకాకుండా ...

పాశ్చాత్యదేశాలలో పుట్టి, ఆదేశస్థుల ప్రత్యేక ఆదరణకు పాత్రమై, పాశ్చాత్యక్రీడలలో ప్రధాన స్థానాన్ని ఆక్రమించుకున్న 'క్రికెట్' ఆటలో అఖిల భారతీయులలో అసమానుడనే కాకుండా, ప్రపంచంలోని ప్రముఖయోధులలో ఒకడుగా పేరొందినవాడు కూడా ఆంధ్రకుమారుడే — శ్రీ సి. కె. నాయుడు.

ఆవిధంగా ...

ఆత్మపరిపక్వానికి ఉపయుక్తమైన ఆధ్యాత్మిక చింతనలు మొదలు, కేవల వినోదంకొరకు వినియోగించే క్రీడారంగంవరకూ ఆంధ్రులు అందరి మన్ననలనూ అందుకుంటున్నారు.

ఇంకా చెప్పవలసివస్తే ...

విశ్వమానవ కల్యాణానికి ప్రపంచచరిత్రలో మనం యింతవరకూ కనీ, వినీ ఎరుగని విలక్షణమైన సత్యాగ్రహాస్త్రాలను సంధించిన సైన్య సూత్రకారునకు — మహాత్మునకు — బ్రాహ్మణ భాష్యకారుడై, అఖిలభారత కాంగ్రెసుచరిత్రను స్వర్ణాక్షరాలతో లిఖించి ఖండఖండాంతరవాసుల ప్రత్యేకమన్ననలను పొందిన ప్రథమభారతీయుడుకూడా మన ఆంధ్రపుత్రరత్నమే — శ్రీ పట్టాభి సీతారామయ్యపంతులు!

ఆంగ్ల భాషాకోవిదులైన కొద్దిమందిగురు ప్రముఖ భారతీయులలో ఒకరై, విద్యార్థిగా ఉండగానే తన అమోఘవాక్చాతుర్యంచేత కేంబ్రిడ్జి యూనివర్సిటీ యూనియనుకు అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డ ప్రథమ భారతీయుడు మన ఆంధ్రుడే — శ్రీ సి. ఆర్. రెడ్డి!

కొంతకాలం ప్రభుత్వోద్యోగిగానూ, మరి కొంతకాలం మైసూరుసంస్థానపు దివానుగానూ పని చేసి, ఎల్లకాలమూ ప్రజోపయోగకరములైన విద్యుచ్ఛక్తి, నీటిసరఫరా నిర్మాణాలను చేసి, ఇతరరాష్ట్రాల వారివల్లనేకాకుండా అమెరికావారిచేతకూడా వారి దేశంలో యిల్లాంటి నీటిపారుదల ఏర్పాట్లు చేయటానికి ప్రత్యేకంగా ఆహ్వానింపబడిన ప్రథమ భారతీయుడు మన ఆంధ్రుడే — శ్రీ విశ్వేశ్వరయ్య!

కేవల బాహుబలాన్నే ప్రధానంగా పెట్టుకుని, పాశ్చాత్యదేశాలలోకూడా 'కలియుగభీము' డని గణన కెక్కిన ప్రథమ భారతీయుడుకూడా మన ఆంధ్ర పుత్రుడే—కీ. శే. శ్రీ కోడి రామమూర్తినాయుడు!

ఇంతవరకూ భారతీయులకు అందనిప్రామాని పందుగా ఉండి, యింతకాలమూ పాశ్చాత్యులే గుత్త గొన్న బొంబాయిరాష్ట్ర యూరపియన్ స్కూళ్ల ఇన్‌స్పెక్టరు పదవిని పొందిన ప్రథమ భారతీయుడు కూడా మన ఆంధ్రపుత్రుడే–శ్రీ జి. యస్. కృష్ణయ్య!

ఇంతే కాకుండా...

మన రాష్ట్రంలోనూ, యితర రాష్ట్రాలలోనూ అనేకవిషయాలలో పేరుప్రఖ్యాతులు గాంచి, ఆంధ్ర మాతృఋణమును తీర్చుకున్న ఆంధ్రులు అనేకమంది ఉన్నారు—కీ. శే. మహర్షి వేంకటరత్నంనాయుడు, శ్రీచింతామణి, శ్రీరాఘవేంద్రరావు, శ్రీరెడ్డినాయుడు ప్రభృతులు!

అల్లాగే...

అటు ప్రభుత్వంవారి సన్మానాలనూ, ఇటు ప్రజల ఆదరాభిమానాలనూ పొందుతూన్న ఆంధ్రులలో శ్రీరామమూర్తిగారు అగ్రగణ్యులు.

ఇంతవరకూ......

మన ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి పదవి ఆంగ్లేయాధికారుల హస్తగతమై ఉన్న సంగతి మనకు తెలిసే ఉన్నది. అటువంటి స్థానాన్ని—అందులో ముఖ్యంగా మన దేశము చిక్కుకున్న ప్రస్తుతక్లిష్ట రాజకీయ పరిస్థితులలో—శ్వేతాధికారుల చేతుల్లోంచి భారతీయుడి చేతుల్లోకి రావటమనేది ఎంత ఆశ్చర్యకరమైన విషయమో కొంచెం ఆలోచిస్తే అర్థంకాక పోదు!

అయితే......

ఆ స్థానానికి రామమూర్తిగారు అన్ని విధాలా అర్హులని ప్రభుత్వంవారు ఎంతదృఢంగా నిశ్చయించుకున్నారో, ప్రజలుకూడా అంత సంతోషంతో అంగీకరిస్తున్నారు.

ఎంచేతనంటే......

ప్రభుత్వ శృంఖలాలలో చిక్కుకుని, సర్వసాధారణంగా కేవలం యంత్రాల లాగు పనిచేసే యితర ప్రభుత్వోద్యోగుల మాదిరిగా కాకుండా, రామమూర్తిగారు దేశౌన్నత్యాన్ని దైనందినమూ అభిలషించే అకుంఠిత దేశాభిమాని. వ్యవసాయ శాఖా డైరెక్టరుగా ఉన్నప్పుడు రైతు లోకానికి ఆయన చేసిన సదుపాయాలు అపారమైనవి కాంగ్రెసువారు రాష్ట్రీయ ప్రభుత్వం స్వీకరించిన తర్వాత పానపిశాచాన్ని పారద్రోలటం విషయంలోనూ, ఈనాందారీ బిల్లు ప్రవేశపెట్టిన సందర్భంలోనూ కాంగ్రెసు మంత్రులకు తోడై అహర్నిశాలూ పనిచేసి వారి ప్రత్యేకాదరణకు పాత్రమవటమనేది కేవలం అగ్నిపరీక్షలో ఉత్తీర్ణుడైనా రసటంలో అతిశయోక్తి లేదు.

ఇంకొక విషయం......

అధికారుల అడుగులకు మడుగులొత్తి, అర్హత ఉన్నా లేకపోయినా, ఎంతఉద్యోగాన్నైనా కేవలం ఆశ్రయింపులతో, సునాయాసంగా సంపాయించే చాలామంది ఉద్యోగాభిలాషుల మాదిరిగా కాకుండా, రామమూర్తిగారు ఒక్క మేధస్సువల్లనే యింత ఉన్నత పదవిని అలంకరించ గలిగారనటం సత్యదూరంకాదు.

అదీగాక......

ప్రభుత్వోద్యోగంలో ఉండికూడా ప్రజాధనాన్ని దుర్వినియోగం చేయటం యిష్టంలేక, తన జీతాన్ని అయాచితంగా తగ్గించుకున్నారట రామమూర్తిగారు! ఇటువంటి ఆదర్శాలు ఉండటం—కాంగ్రెసు మంత్రులకు (కొందరికి) మినహాగా—సామాన్య 'గవర్నమెంటు సర్వెంట్ల' కుండటం సహజంకాదు.

ముఖ్యంగా...

ప్రభుత్వోద్యోగిగా ఉన్నంతమాత్రంచేత ప్రజాసేవకు దూరమైపోయినా మనుకునే సహచరులకు రామమూర్తిగారు చక్కటి ఆదర్శాన్ని చూపారు. దేశాభిమానమనేది మనిషికి ఉన్నట్లయితే ఉద్యోగాల భయంవల్ల ఆ దేశభక్తిని చంపుకోవలసిన అవసరం లేదని రామమూర్తిగారు నిరూపించారు.

కాబట్టి...

ఈ సదవకాశాన్ని పురస్కరించుకుని మిగతా ప్రభుత్వోద్యోగులుకూడా వారి ననుకరించినట్లయితే భారతమాత భాగ్యం పండినట్లే భావించవచ్చును.

కాగా...

దానకర్ణుణ్ణి మరపించిన 'విశ్వదాత'నీ, నిరుపమాన నిర్మాణకార్యక్రమ సాధనాలకు సారథిఅయిన పట్టాభినీ, తన సర్వస్వాన్నీ దేశంకొరకు అర్పించి, దరిద్రనారాయణోపాసన చేస్తూ,తరుగని త్యాగధనంగల 'ఆంధ్రకేసరి'నీ ఆంధ్రదేశానికి అందజేసిన ఆంధ్రమాత, ప్రభుత్వమన్ననలను యింకా పొందని, తన భావిజీవితాన్ని ఆంధ్రాభ్యుదయానికి అంకితం చేయమని తన ప్రియపుత్రుణ్ణి — రామమూర్తిగారిని — ముక్తకంఠంతో అర్థిస్తోంది!

ఆంధ్రులంతా రామమూర్తిగారికి యీశుభ సమయంలో హృదయపూర్వకమైన జోహారులు అర్పిస్తున్నారు.

—భావరాజు నరసింహారావు

---

## శ్రీ పెళ్లకూరు చంద్రశేఖర రెడ్డిగారు



యల్ యల్. బి. పట్టభద్రుడైన ఈ ఆంధ్రయువకుడు ఇటీవల లక్నో విశ్వవిద్యాలయమువారి యం.ఏ. పరీక్షలో ప్రథముడుగా ఉత్తీర్ణుడై విక్టోరియా మెమోరియల్ బంగారు పతకమును బహుమానముగా గడించినాడు. అంతేకాదు, 'ఆంధ్రదేశమునందలి నూనావి జాతి'ని గురించి ఒక ఉత్తమ— పరిశోధక వ్యాసమును వ్రాసి రామేశ్వరసత్యా బంగారు పతకమునుగూడ బహుమతిగా పొందినాడు.

---

## శ్రీ యస్. గణపతిరావుగారు



ఈ నడుమ అర్థశాస్త్ర పరిశోధనములో 'హిందూదేశపు వ్యాపారకుల్య విధానము'ను గురించి వ్రాసిన ఉత్తమపరిశోధక వ్యాసమునకు ఈయన మద్రాసు విశ్వకళాపరిషత్తువారివల్ల డి. లిట్. డిగ్రీని సంపాదించినాడు. అర్థశాస్త్రమునందు ఈ యూనివర్సిటీనుండి ఇంతటి పెద్దడిగ్రీని పొందుటకు వీరే ప్రప్రథములు. వీరు గోదావరిజిల్లా వాస్తవ్యులు.



# పద్మినీ తపశ్చర్య*

శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు

[అష్టపది]

వలపు దలఁగి యినుండు పరదేశ మేఁగ న
వ్వలని యెడఁబాటు మొయిఁగలఁగి పద్మిని తొంటి
పొలుపేది తమ్మినెమ్మోము వాడి ముడుంగ
నలిసంజ కెంజాయ నారచీర ధరించి
యళిపంక్తికలిత రుద్రాక్షమాలలు దాల్చి
యెలనాఁచు జడలూని నిలువునీటను నిలిచి
తొలఁగి చన్న నిజేశుతోడి కూటమికినై
బలుతపము గావించుపగిదిఁ జూపట్టె.

*. బాణుని 'పార్వతీపరిణయము'నందలి వైతాళిక గీతిక ననుసరించి వ్రాయఁబడినది. ఇందుఁ బార్వతీ తపము సూచితము.





# విమర్శనము

## శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణము

[మందరవ్యాఖ్యానసహితము - సుందరకాండము - ప్రథమభాగము - గ్రంథకర్త: శ్రీ వావిలికొలను సుబ్బారావుపంతులుగారు. వెంకట్రామా అండ్ కో, బెజవాడ, మద్రాసు, సికింద్రాబాద్ (దక్కన్) అనిగాని, శ్రీ కోదండరామ సేవక సమాజము, నడిగడ్డపాలెం, చుండూరు పోస్టు, గుంటూరు జిల్లా యనిగాని వ్రాసిన గ్రంథములు దొరకును వెల రేపరుబైండు రూ. ౧-౦-౦.]

హిందూ సనాతన ధర్మపరులగు ఆస్తికులకు రామాయణసుందరకాండము పారాయణగ్రంథములలో నొకటి. కేవలం పాఠముమాత్రమే చేసినదానికంటే అందలి అర్థతాత్పర్యములను గుర్తెరిగి పారాయణం చేయడం ఎక్కువ లాభకారి. అందులకు తగినట్లు ఈ గ్రంథము మందర నామకవ్యాఖ్యానసహితంగా ముద్రిత మైంది. ఇందు కేవలమూ అర్థమూ, తాత్పర్యమూ మాత్రమే కాదు, మరికొన్ని విశిష్టలక్షణా లున్నాయి. సీతారామశబ్దాలు రెండూ లక్ష్మీ విష్ణుపరములని సాంఖ్య శాస్త్రానుసారము నిరూపించబడింది. సీతా రామ లక్ష్మణ హనుమంతులు ఆయా సందర్భములందు గావించిన చర్యలవలన బద్ధముక్తజీవులయొక్కయూ, గురుశిష్యులయొక్కయూ, యోగులయొక్కయూ కర్తవ్యాకర్తవ్యములు విశదీకరింపబడినవి. గ్రంథ మంతటా అవకాశము లభించినపుడంతా ఇటులే ఆధ్యాత్మికవిషయముల రహస్యమును వెల్లడిస్తూవచ్చారు వాసుదాసుగారు. రెండోది— ప్రక్షిప్తము లున్న చోట్లు తెలిపి అవి యెందువల్ల ప్రక్షిప్తములో యుక్తి యుక్తంగా సాధించారు. మూడోది— దక్షిణహిందూ స్థానమునందు భౌతికముగా గలిగిన మార్పులను భూగర్భ శాస్త్రానుసారంగా వివరించి రామాయణకాలమందున్న స్థలజలవిభాగములు ప్రస్తుతకాలమున నేప్రకారము పరివర్తనము చెందివున్నవో తెలియపరిచారు. ఇవి రామాయణంలోని భూగోళవర్ణనమంతా వట్టి పుక్కిటి పురాణమనే వైజ్ఞానికులకు చాలావరకు సమాధానము నివ్వగలుగుతాయి. వీరి సిద్ధాంతంప్రకారం ఆకాలంలో సముద్రం ప్రస్తుతం మధురదగ్గిరవున్న అలగార్ కొండలశాఖలవరకూ వ్యాపించివుందనీ మధ్యమధ్య చిన్న చిన్న దీవులు పెక్కులుండే వనీ తేలుతుంది. అంతకుపూర్వమం దెన్నియుగాలక్రిందనో లంక దక్షిణభారతముతో కలిసివుండడమే కాక, బోర్నియో, సెలబసూ, సుమిత్రా లోనుగా గల తూర్పుఇండియా ద్వీపసమూహము యావత్తూ ఆసియాఖండములో కలిసి, ఒకే భూభాగముగా వుండి, తరువాత కలిగిన భూకంపాదులవల్ల భూమి సముద్రమున మునిగిపోవ ఎత్తైన ప్రదేశములు ఈపర్యుక్తద్వీపములుగా మారినవని మరి యొక సిద్ధాంతము. అందువల్లన సముద్రమున కావలి గట్టునను, ఈవలిగట్టునను మలయపర్వతము లున్నట్లు రామాయణమున పేర్కొనబడినదట. ఇదే విధముగా ఆధునికజిజ్ఞాసువులకు అనేకసమాధానము లివ్వబడినవి. వర్ణాశ్రమధర్మములవిషయమున తెలుసుకోదగిన ఎన్నో సంగతులునూ ఇందు గలవు.

## ౧. గాయకసార్వభౌమ పారుపల్లి రామకృష్ణయ్యపంతులవారి జీవితం.

## ౨. హరిదాసు అద్దంకి వేంకట్రాయడుగారి జీవితం.

[ రెంటికీ కర్త: శ్రీ కోన వేంకటరాయశర్మగారు, ఖరీదు: మూడణాలూ, రెండణాలూ. కాపీలకు బాపట్ల దగ్గర స్టూవర్టుపురంలోని కర్తకు రాయాలి.]

ఈరెండూ లఘువుగా వ్రాసిన జీవితచరిత్రలు. ద్రావిడావని అంతా రామకృష్ణయ్యగారు వాసికెక్కిన వారు. గాంధర్వవేది రామకృష్ణయ్యగారి విశేషాలూ, గానవైఖరులూ మొదటి దానిలో వివరణలతో వ్రాయ బడినవి.

వేంకటరాయడుగారు లౌకిక మర్యాదల్లో ఎక్కువగా పైకి రాకపోయినా, ఆతిథేయసత్కారం లోనూ, ధన్యజీవనంలోనూ వాసికెక్కినవారు.

ఇట్టి చరిత్రలు అవసరమే. కాని, రచయిత తన రోకంటిపాట వైఖరిని వదలుకోవలయును. ఏవిష యమున ప్రసిద్ధులో ఆవిషయం మథించాలి; అందంగా చెప్పాలి. వర్ణ్యంతో సంబంధం లేనప్పటికీ, రచనా పద్ధతి ప్రతివారినీ లొంగదీసుకునేదిగా ఉండాలి. జీవితచరిత్ర వ్రాస్తున్నాముగదా అని, ప్రతిదీ గుచ్చెత్తితే, గ్రంథప్రయోజనం వెనకబడుతుంది. వేంకటరాయుడుగారి రెండో పెళ్లి, ఉద్యోగం- వీటికంటె రాసలీలా, రాసక్రీడా ప్రకరణాలు రసవత్తరంగా విస్తరించాలిసింది. రామకృష్ణయ్యగారి చరిత్రలో వారి గానవైఖరిప్రత్యేకతలూ, సంప్రదాయసంఘర్షణల్లో శ్రీ వారి సమన్వయమూ, కచ్చేరీలలోని వారి నేర్పు, కూర్పులూ ఎత్తవలసినది. గాంధీ అంటే గిట్టని ఒక పెద్దమనిషి తెలుగు ఆత్మకథను గురించి ఇలా అన్నాడు: "శివరామశాస్త్రి ఆపాడుగాంధీఆత్మకథ రాశాడు. ఐతేనేం-రత్నం! గాంధీదికాక అది ఇంకోరి ఆత్మకథే అయితేనా !?" అని వువ్విళ్లూరినాడు. ఈవాక్యం ఈ గ్రంథకర్త వినదగును. ఈరెండుపుస్తకములలోని శైలీ తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం అన్నట్టుందిగాని కలిసికట్టయి సాఫీతేరి పదనుగా లేదు.

—శాస్త్రి

## ఆంధ్రదేశపు ఖనిజ సంపత్తి సంక్షిప్త వివరణము

## (AN OUTLINE OF THE MINERAL RESOURCES OF ANDHRA DESA)

[రచయిత: డా. సి. మహాదేవనుగారు. వాల్తేరు ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారిచే ప్రకటితము. వెల రు. ౦-౮-౦. ]

ఆంధ్రదేశములో దొరికే ఖనిజపదార్థములను గురించి ఆంగ్లేయభాషలో వ్రాయబడిన గ్రంథము. నైజాంఇలాకాలోని ఆంధ్రభాగపువిషయ మిందులో లేదు. కేవలం బ్రిటిషుఇలాకాయందున్న ఉత్తర సర్కారులూ, చిత్తూరుతో సహా రాయలసీమజిల్లాలూ కలిసిన ఆంధ్రదేశములోని ఖనిజములనుగురించిమాత్రమే వ్రాయబడినది. ఇందులో అధ్యాయములు నాలుగు. మొదటిదానిలో ఆధునిక భూగర్భశాస్త్రముయొక్క పుట్టుకా, భూగర్భమున గన్పించు రెండు విశాలమహాస్తరీకరణముల వివరణమూ, అజీవకశిలల (Azoic rocks) యొక్కయూ, అశ్మలములయొక్కయూ (Fossils) వర్ణనమూ, సమస్త హిందూదేశములోని మూడు భూగర్భవిభాగములసమాచారమూ ఇత్యాదులు కలవు. రెండవ అధ్యాయములో ఆరంభికశిలలు (Archaeans), పొరలరాలు (Schists), జంబూరు శిలలు (Gneissic rocks), ఖాండలాయిటేములు (Khondalites), కడపకర్నూలు శిలాస్తరములు (Cuddapah & Kurnool Formations), ఊర్ధ్వాధోగోండ్వానాలు (Upper and Lower Gondwanas), దక్కనునాపరాలు (Deccan Traps), ఆధునిక నిక్షేపములు, కురువిందములు (Laterites) మొదలగు పదార్థములతోగూడిన ఆంధ్రదేశపు భూగర్భ విభాగముల సామాన్యవర్ణన మున్నది. మూడవఅధ్యాయమందలి మొదటిభాగంలో అంజనము (Antimony), రాతిబొగ్గు, ఇనుము వెండి బంగారాలు, వజ్రాలూ, రత్నాలూ, ఆస్బెస్టోసు (Asbestos) లోనగు ఖైరిక ఖనిజాలు ఆంధ్రదేశమున ఏయేప్రాంతములలో దొరకునదియూ, రెండోభాగంలో వాటి బిబ్లియోగ్రఫీ (Bibliography) యూ గలవు. నాల్గవ అధ్యాయమునందు ఉపర్యుక్తఖనిజాలు ఎక్కడెక్కడ తీయబడు

తున్నారో, ఎట్లు వ్యాపారంలో వినిమయ మవుతున్నారో విశదీకరింపబడినది. ఈ గ్రంథమును చదివినయెడల ఆంధ్రదేశములో ఎంతటి ఉత్తమఖనిజ సంపత్తి కలదో తేటతెల్లము కాగలదు. కాని వాని నన్నింటిని క్రమముగ దీయించి దేశీయులకు లాభకర మగురీతిని వ్యాపారములోనికి తెచ్చుటకు ప్రభుత్వము యొక్క ప్రోత్సాహమూ, సహాయమూ అత్యావశ్యకములు. శ్రీమంతులయొక్క ప్రయత్నమూ ఆవశ్యకమే. కాని ఈ రెండునూ లేకుండుటవలన ఈ ఖనిజముల ఉత్పత్తి వినిమయములు అభావప్రాయముగ నున్నవని తెలియగలదు. భూమియొక్క ఉపరి భాగముననో, పైరుపంటలకు దక్కువ లేదు. లోపలి భాగముననో, అనేకప్రకారముల ఖనిజరాసులు నిండి యున్నవి. కాని ఇట్టిభూమిమీద నివసించే జనులలో అధిక సంఖ్యాకులు దారిద్ర్యముననే మునిగియుండుట మిక్కిలి శోచనీయము.

---

## ఇండియాబాలకునకు
## (TO THE BOY INDIA)

[సంపాదకుడూ, గ్రంథకర్తా: జి. యస్. యన్. మూర్తిగారు. ఖర్గపురము (Khargpur) నందలి భారతీయ బాలసాహిత్య సమితివారిచే ప్రకటితము. వెల రు. ౦-౪-౦ ]

గాంధీగారి జయంత్యుత్సవమును పురస్కరించుకొని ఆంగ్లభాషలో వెలువడిన చిన్నపుస్తకము. ఇట్టిదానినే దేశభాషలలోగూడ ప్రచురించవలెనని సమితివారి అభీష్టమైనట్లు గన్పించుచున్నది. అది ముఖ్యంగా చేయదగినపని. ఇందు మహాపురుషులరచనలనుండి సంగ్రహించిన ఉద్ధృతాలు ౨౫ టికి పైగా వున్నాయి. "భాగ్యచక్రమూ లేక చర్ఖా" అనేశీర్షికగల "శుద్ధాం సనాతనీ మంబాం, భుక్తిముక్తిప్రదాయినీం, లక్ష్మీస్వరూపిణీం చర్ఖా మిష్టదేవీం భజామ్యహం"

అనే శ్లోకంతో ఆరంభమై "భద్రంకర్ణేభిః శ్రుణుయామ దేవాః" అనే శాంతిపాఠంతో సమాప్తమవుతుంది. మహాత్మగాంధీ, శివానందసరస్వతి, వాస్వానీ, నెహ్రూ, నారీమన్, బి. జి. ఖేర్, స్వామి రామతీర్థ, సరిహద్దుగాంధీ, మాలవ్యా మొదలుగాగల సమస్తనాయకుల ఉపదేశవాక్యరత్నాలిందు గలవు. నమూనాకు రెండుమూడు చూడండి!

"భూమిమీద నే నెవరికీ జడవను. దేవునికి మాత్రం భయపడుతాను. నే నెవరికీ కీడుతలపను. ఎవని కారణంగా గానీ అన్యాయానికి లొంగను; సత్యంతో అసత్యాన్ని జయిస్తాను. అసత్యాన్ని ఎదుర్కోడానికి నే నెన్ని కష్టాలనైనా అనుభవిస్తాను."

—ప్రాతఃకాలపు ప్రథమకర్తవ్యం (మ. గాంధి)

"ఉత్తిష్ఠత! ధైర్యంతో లేచి నిలుచోండి. నిత్యశక్తి కుమారీ కుమారుల్లారా లేచి నిలుచుకోనండి! అన్యాయ, అక్రమాలకు అడ్డకట్టలుగ నిలుచోండి! దరిద్రసేవకు నడుము కట్టండి. ఈ సేవే స్వరాజ్యం"

— స్వరాజ్యం అంటే? (వాస్వానీ)

"ఇతిహాస ప్రసిద్ధములైన స్థలములను దర్శించుట ద్వారా ప్రాచీనభారత ఇతిహాసమును పఠించి, స్వార్థరహితమైన సేవా, బలిదానములను సలిపి ఆ ప్రాచీన ఔన్నత్య, సౌఖ్యములయుగమును పునఃస్థాపించడానికి ప్రయత్నంచేయండి."

— కె. జె. నారీమన్

పుస్తకము యావత్తూ ఇట్టి ఉపదేశవాక్య రత్నాలతో నిండివుంది. మరోవిశేషమేమంటే ఈ పుస్తకంలోని కాగితాలన్నీ చేత్తో తయారైనవి.

---

## జీవన
## (కన్నడమాసపత్రిక)

శ్రీ డి. ఆర్. బెంద్రె, యం. ఏ., వి. కె. గోకాక్ బి. ఏ. (ఆక్సన్) గార్ల సంయుక్త సంపాదకత్వంక్రింద ఈ మాసపత్రిక ధార్వారునుండి వెలువడుతున్నది. వార్షికచందా నాలుగు రూపాయలు. సారస్వత సాంఘికాది విషయకమైన వ్యాసాలే కాక కథలూ, విమర్శలూ కూడా ఈ పత్రికలో ప్రముఖస్థానాన్ని అందుతున్నాయి. ఉన్నంతమట్టులో ఈ పత్రిక ధోరణినిబట్టి చూడగా ఇది ఉత్తమవర్గానికి ఉద్దేశించిన పత్రికగా కనిపిస్తున్నది.

---

## నాట్యకళ

ఆంధ్రనాటకకళాపరిషత్తువారి పక్షమున శ్రీ కొత్తపల్లి లక్ష్మయ్యగారి సంపాదకత్వమున పునరావిర్భావమందిన సచిత్రద్వైమాసపత్రిక - ద్వితీయసంపుటపు ప్రథమసంచిక మా కార్యస్థానమున కందినది. సంచికయావత్తూ నటీనటుల చిత్రములతో, నాటకకళకు సంబంధించిన వ్యాసరాజములతో చక్కగానున్నది. మొత్తముమీద వ్యాసము లన్నింటిలోనూ గల విషయము ఆంధ్రదేశములో నాటకకళ హీనస్థితియందుండటమూ, దాని నేలాగైనా పునరుద్ధరించి పైకి తీసుకొని వచ్చి బాగుపరచడమూ. అందులకుగాను నవమాంధ్రనాటకకళాపరిషత్తున కధ్యక్షులైన శ్రీరామచంద్రారెడ్డిగారూ, మల్లాది అవధానిగారూ, కుటుంబరావుగారూ వారివారికి తోచిన ఉపాయాలను సూచించారు. స్వార్థరహితమైన బుద్ధితో వారి సూచనలను పాలించినయెడల మరల నాటకకళ మంచి అభివృద్ధిలోకి రావచ్చు. రసోద్దీపన ప్రయోజనమును గురించి శ్రీకజిన్సుగారును, సంస్కృత నాటక లక్షణాలనుగురించి శ్రీ రాజాబహద్దరువారును వ్రాసిన వ్యాసములు భారతీయ నాట్య నాటకకళా విఖ్యాతిని జాటునవి. సురభినాటకమండలియొక్క అభివృద్ధికి ముఖ్యకారకులు శ్రీలక్ష్మయ్యగారు. నాటకకళా పరిషత్తుయొక్క జీవనానికీ వారే. అట్టివారి హస్తములలో ఈ పత్రికా నిర్వహణము చేరినందున ముందు ముందు ఇది బాగుగ నభివృద్ధినందగలదని మా యాశ. సంవత్సరపు చందా రు. ౩-౦-౦ లు. ప్రతి ౧ కి రు. ౦-౮-౦. విక్టోరియాపబ్లిక్ హాలు, పార్కుటవును, మద్రాసు అని వ్రాసిన సంచికలు దొరకును.

---

# గ్రంథస్వీకారము

---

## మైనాదేవి : మొరాక్కో కన్య

గ్రంథకర్త : శ్రీ అంబటిపూడి వెంకటరత్నం గారు. సాహితీమేఖల మాలాప్రచురణము. పులిజాల హనుమంతరావు, కొండాపురం, చండూరు పోస్టు, నల్లగొండ జిల్లా, నిజాం ఇలాకా యని వ్రాసిన గ్రంథములు దొరకును. వెల రు. ౧-౦-౦.

---

## త్రిభాషాబోధిని
### (ప్రథమభాగం)

రచయిత : పండిత శ్రీ కర్ణ వీర నాగేశ్వరరావు గారు. శ్రీ గ్రంథి ఆదినారాయణ గుప్తగారు, ఆంధ్ర సంస్కృత హిందీ పుస్తక నిలయము, చీరాల, గుంటూరు జిల్లా యని పుస్తకముల కొరకు వ్రాయవలెను. వెల రు. ౦-౮-౦.

---

౧. నిర్వచనభారతగర్భ రామాయణము
౨. మాచరల చెన్నకేశవశతకము
౩. గురజాల యిష్టకామేశ్వరశతకము
౪. సర్వేశ్వరశతకము
౫. నాగార్జునకొండ

ఈ అయిదు గ్రంథములను రచించినది శ్రీ రావిపాటి లక్ష్మీనారాయణగారు. పుస్తకముల కొరకు గురజాల, గుంటూరుజిల్లా యని వ్రాసిన దొరకును. ఇందులో మొదటి పుస్తకం వెల రు. ౦-౮-౦. తక్కినవి ఉచితంగా లభిస్తాయి.

---

## కోదండరామశతకము

రచయిత : శ్రీ అయితం కాళీవరప్రసాదరాయ కవిగారు, సీనియర్ తెలుగు పండితుడు, బోర్డు హైస్కూలు, బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు అని వ్రాసిన గ్రంథములు లభించును. వెల రు. ౦-౨-౬.

---

## భక్తియోగము
### (శ్రీ వివేకానంద ప్రవచనము.)

అనువాదకుడు : శ్రీ మాధవచైతన్య బ్రహ్మచారిగారు. మదరాసు, మైలాపూరు, రామకృష్ణ మఠమువారిచే ప్రకాశితము. వెల రు. ౦-౮-౦.

---